కాకినాడ నాట్యకళా విజ్ఞాన గ్రంథమండలి

తృతీయకుసుమము

# యోగసంకలనము.

(శ్రీ అరవింద ఘోషుగారిచే రచింపఁబడిన యోగసంకలనమునకు తెలుఁగు తర్జుమా.)

వాల్యూము I.

## కర్మయోగము.

వ్యాసావళి, సంపూర్ణమహాభారతము, శ్రీకృష్ణావతారము, వనసుందరి, విహారలీల, మొదలగు పదినాటకములు వ్రాసిన

మద్దులపల్లి దొంతాబాడా గోపాలకృష్ణరావు, B. A., గారిచే

నాంధ్రీకరింపఁబడి ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 500 ప్రతులు.

కాకినాడ:

రంగా అండ్ కో., యందు ముద్రింపఁబడియె.

1932.



[వెల రు 1-4-0.

# నాట్యకళా విజ్ఞాన గ్రంథమండలి

## రాజపోషకులు

1 మ॥రా॥రా॥ యన్. బలరామమూర్తినాయుడుగారు,
బి.ఏ.. బి.ఎల్., చెన్నపట్టణము.

2 ,, వారణాసి సీతారామయ్యగారు, బి.ఏ.,
సబ్ మేజిస్ట్రేటు, గన్నవరం.

3 ,, శీలంశెట్టి వెంకటరత్నంనాయుడుగారు డి. పి. డబ్లి
యూ అసిస్టాంటు ఇంజనీరు, పెన్షన్ లింగారెడ్డిపాలెం.

## పోషకులు

4 ,, పైడా శ్రీరామకృష్ణయ్య బ్రదర్సు,
జమీందార్లు, కాకినాడ.

5 ,, వారణాసి బాపయ్యగారు, బి.ఏ., క్యాషియరు,
డి. కో. బ్యాంకి, చెన్నపట్టణం.

6 ,, ముత్యాల సత్యనారాయణమూర్తిగారు,
రామచంద్రపురం.

7 ,, అంగర వెంకటసుబ్బారావుపంతులుగారు. డిటో

8 ,, మాజేటి మునెయ్యగారు, బి.ఏ., బి.ఎల్,,
రాజమండ్రి.

9 ,, ముత్తా సత్యప్రసన్నం బ్రదర్సు, బ్యాంకర్సు,
కాకినాడ.

10 ,, దేవులపల్లి విశ్వనాథంగారు, ఆకిరిపల్లి.

11 ,, వెలమూరి కుటుంబరావుగారు, అవనిగడ్డ.

12 ,, చిత్రపు సుబ్బారావుపంతులుగారు,
తహశీలుదారు, అవనిగడ్డ.

13 ,, చిరాంవూరు కామేశ్వరరావుగారు, అవనిగడ్డ;

14 ,, ధూళిపాళ్ల వెంకటరత్నంగారు, గ్రామమునసబు

పురుషోత్తపట్నము.

15 ,, దర్భా వెంకటశివరామరాస్ బి.ఏ., బి.యల్.,

కాకినాడ.

16 ,, చెలికాని రామస్వామిబాబుగారు,

అసిస్టెంటుయింజనీరు, సామర్లకోట.

17 ,, సర్భాదా శేషగిరిరావుపంతులుగారు, కాకినాడ.

18 ,, అంగర వెంకటకృష్ణారావుపంతులుగారు ప్లీడరు

కాకినాడ.

19 ,, కొత్త వెంకటరత్నంగారు, Officer De Acafinee Chenaliar do & Sclelr Nares de, Beeni Cocanada

20 ,, దసిగె వెంకటేశ్వరరావుగారు, గుడివాడ.

21 ,, కే. వి. రమణరావుగారు, Representative Confectionery, Dept. Parry & Co, Ltd. Madras.

22 ,, జమ్మి వెంకటసుబ్బారావు పంతులుగారు, Clerk, Tq. Office, Cocanada.



శ్రీ అరవింద యోగి.

# విజ్ఞాపనము.



హిందూదేశమందుఁ బ్రస్తుతమున్న యోగులకెల్ల మిన్న
శ్రీ అరవిందఘోసుగారని లోకప్రసిద్ధమే. వీ రాంగ్లేయభాషలో
The Synthesis of Yoga యను గొప్పయోగశాస్త్రము రచించి
నారు. ఇందు సమస్త యోగమార్గములు పూర్ణముగా విమర్శిం
పఁ బడినవి. ముఖ్యముగాఁ గర్మయోగము, భక్తియోగము, జ్ఞాన
యోగము, హఠయోగము, రాజయోగము, తాంత్రికయోగము,
చర్చింపఁబడి, పరస్పరసంబంధములు నిర్ణయింపఁబడినవి. వివిధయో
గమార్గముల నభ్యసించు విధానములుఁ జెప్పఁబడినవి. వానిసార
ము సంకలన మొనరించి పరిపూర్ణయోగమార్గ మొకటి యభ్యసిం
చుటకు సులభసాధ్యమగునట్లు వర్ణింపఁబడినది. ఈగ్రంథ మాంగ్లేయ
భాషనుండి తెనుఁగులోనికి నాచే భాషాంతరీకరణ మొనరింపఁబడి
నది. దీనికిఁ దెనుఁగున యోగసంకలన మని పేరిడితిని. కొంతకాల
మునకుఁ గ్రిందట నేను తూర్పుగోదావరిజిల్లా పెద్దాపురంతాలూకా
జగ్గంపేట రివిన్యూ యినస్పెక్టరుగాఁ బనిచేయుచుంటిని. అప్పుడు
నాకొక యభిప్రాయ ముండెను. శ్రీ వ్యాసమునీంద్రునిచే రచిం
పఁబడిన శ్రీమద్భాగవతమును బద్యగద్య రూపముననున్న దానినున్న
ట్లే సంస్కృతమునుండి తెలుఁగులోనికి మార్చవలె నని తలంచియుం
టిని. కాని యాగ్రామవాసియగు మ॥రా॥శ్రీ కోమాండూరి రంగా
చార్యులవా రీనూతనగ్రంథమును నా కొసంగి తెనుఁగుభాషలోనికిఁ
బరివర్తన మొనరించిన బాగుండునని తమకుతూహలమును వెల్లడిం
చిరి. అంతకుపూర్వమే నాకు కొన్ని యధ్యాత్మికభావములు నూత
నముగా నుద్భవించినవి. ఈనూతన గ్రంథము నాభావముల స్థిరపరు
చుటచే శ్రీరంగాచార్యులవారు కోరినప్రకారము తర్జుమాచేయుట
ప్రారంభించితిని. ఉద్యోగభారమున త్వరలో ముగింపలేకపోతిని.
దైవానుగ్రహమున నేటికి దీనిఁబ్రచురించుటకు సాహసించితిని. ఇందు

73 అధ్యాయములు లున్నవి. అయిదు వాల్యూములుగాఁ బ్రచురింపఁ బడును. మొదటివాల్యూం యీసంవత్సరమున నాచే స్థాపింపఁబడిన కాకినాడ నాట్యకళావిజ్ఞానగ్రంథమండలి వారిచే మూఁడవకుసుమముగాఁ బ్రచురింపఁ బడుచున్నది. నామిత్రులు శ్రీ రంగాచార్యుల వారు నన్ను ప్రోత్సాహపరుచుటేగాక ఫెయిర్ కాపీ కూడా వారే స్వయముగాచేసిరి. ఈయింగ్లీషుపుస్తకములు ప్రస్తుతము ముద్రణమందులేవు. రాజమహేంద్రవర పురవాస్తవ్యులు మ॥రా॥శ్రీ మాజేటి మునెయ్య, బి.ఏ., బి.ఎల్., వకీలుగారు "ఆర్య" పేపరుఫైళ్లు కట్టించి భద్రపరిచి యున్నారు. The Synthesis of Yoga యందు ప్రచురింపఁబడియున్నది. శ్రీ మునెయ్యగారు మాకీపుస్తకములనిచ్చి తోడ్పడిరి. అందుకుఁ గారకులు సహితము శ్రీరంగాచార్యులవారే. వీరిరువురకు నీగ్రంథకర్త సదావిధేయుడు. ఈగ్రంథము చదువువారికి విజ్ఞానప్రాప్తి పరిపూర్ణసంసిద్ధి కరతలామలక మనుమాటయతిశయోక్తికాదు. ఈవాల్యూమునందు కర్మయోగముమాత్రమే పూర్తిగా విమర్శింపఁబడినది. రాఁబోవు వాల్యూమునందు జ్ఞానయోగము విమర్శింపఁబడును. ఈయోగశాస్త్ర మాంధ్రమండలమునకు విలువలేని యీవియని ఘంటాపదముగాఁ జెప్పఁ గలను. ప్రతియాంధ్రునిచేతి యందు సదానుండదగిన గ్రంథము.

Cocanada, 16-12-32. } **Doultabad GopalakrishnaRao, B. A.**



# యోగసంకలనము.



గీ॥ యోగసిద్ధుఁ డాయరవింద యోగవరుని
యోగతత్త్వంబు తెనుఁగునఁ బొందుఁబరచు
నాంధ్రలోకంబు మన్నించి యాదరించి
చదివి మాఁపుఁడు జ్ఞానము సంభవించు.

## ఉపోద్ఘాతము



జీవితమంత యోగమే.

## I



### జీవితము — యోగము.

సాధారణమైన విశేషమైన మానుష కార్యవిధానములందుఁ బెక్కింటిలో రెండు స్వభావధర్మములు కలవు. అందు మొదటిది. ప్రతి కార్యవిధానము పొందికగల సమిష్టి యేకత్వము నిచ్చుచున్నది. అట్టి సమిష్టి యేకత్వము తిరిగి భిన్నమై, వివిధరూపములనొంది, మరల విపులతర శక్తతర సంకలనముగా సమిష్టి నొందుచున్నది. రెండవది. ప్రత్యక్షానుభవము సాధకముకావలెనన్నఁ గార్యవిధాన రూపమునఁ బరిణమించుటే దానికిఁగల విధాయకమగు సూత్రము. కాని సమస్తానుభవములు, సత్యములు మిక్కిలి యనులంఘ్యమైన నిబంధనలక్రింద నేర్పడినపుడు, పాతగిలి సారమును గోలుపోవు

ఖ్య హెచ్చినం గొంతనష్టముకలదు. యోగి యేకాంతముం గోరు చున్నాండు. కర్మలవిడచి జ్ఞానము నేకాక్షించుచున్నాండు. అంతః స్వేచ్ఛతకొఱకు బహిర్వ్యాపారము విడుచుచున్నాండు. అందుచే యోగమార్గావలంబకులు ప్రపంచమున కుపయోగపడరందురు. ఈయుద్దేశము బలముగా నాటుకొనుటచేఁ బ్రపంచమునుండి తప్పించుకొనుట యోగమునకు ముఖ్యమనుకొనుచున్నారు. కాని ముక్తుఁడై పరిపూర్ణుఁడైన మనుష్యునందు స్వభావమును దేవునికలుపుట యోగసంకలనమునకు ముఖ్యోద్దేశము. అదియంతర్బహిః పరిపూర్ణత్వమిచ్చును. మనుష్యుఁడనగా స్థూలరూపమొందిన యుత్తమస్థితి. (Higher existence). అతనియందు హైన్యముత్తమముగా మారుటకు, నుత్తమముహీన రూపములలో వెల్లడిచెందుటకు వీలుకలదు. అట్టివీలును దెలుసుకొనుట కివ్వఁబడిన జీవితమునుండి వైదొలగుట పరిపూర్ణసిద్ధికి యావశ్యకముకాదు. ఒకప్పుడు తాను తయారగుటకు జాతీయవృద్ధికొఱకు నేకాంత మందుండవలసివచ్చును. కాని యెల్లప్పుడది పనికిరాదు. స్వభావమందుయోగజీవితములు వ్యక్తిలేక నేకస్థానగతములగుచున్నవి. ఆవిధమ్మున మనుష్యునందు యోగజీవితములు వ్యక్తితో నేకస్థానమును బొందునేని యోగము ఫలించినదగును. అప్పుడు "జీవిత మంతయు యోగమే" యని ఘంటాపదముగాం జెప్పవచ్చును.

---

# యోగసంకలనము.

## ఉపోద్ఘాతము.

## II

### స్వభావమందు మూఁడు సోపానములు.

వెనుకటి యోగాభివృద్ధియందు భిన్నరూపములనొందు స్వభావము గనిపెట్టితిమి. సృష్టిలోని సమస్తవస్తువులవలె యీభిన్నత్వమునకుఁ బ్రత్యేక ముపయోగము కలదు. అ స్థేర్పడినవిధానములఁ

బ్రయోజనముల సంకలనమునకై మనము ప్రయత్నింతము. ఇట్టి సంకలన మొనరించునపుడు రెండువిషయముల మనసున నుంచుకొనవలెను. (1) ఈవిభాగప్రేరేపణమునకు మూలమేమో, ప్రయోజనమేమో తెలుసుకొనవలెను. (2) ప్రతి యోగమార్గమునకుఁ బ్రత్యేకోపయోగ మేమున్నదో గ్రహించవలెను. మూలమేదో తెలుసుకొనుటకు స్వభావముయొక్క కార్యకరణమును బరీక్షించవలెను. పరీక్షించి స్వభావము (Nature), వికారమగు మాయవలనఁ బుట్టిన భ్రమచేఁ గల్పింపఁబడు కార్యము కాదని, బ్రహ్మాండశక్తియని, యనంతమయ్యు భిన్నత్వమొందిన ప్రజ్ఞానముచేఁ బ్రేరేపింపఁబడి యీశ్వరుఁడు సర్వవ్యాపకుఁడై తా నొనరించుచున్న కార్యమని తెలుసుకొనవలెను. ఆప్రజ్ఞానము మొదటినుండి యీనిస్వని వల్లనే యుత్పన్నమగుచున్నదని యెరుగవలెను. ఇఁక వివిధోపయోగముల. గ్రహించునపుడు యోగవిధానముల జాగరూకతతోఁ బరిశీలించి, విభజించి, ముఖ్యోద్దేశములఁ దెల్పి, ఫలప్రాప్తికై శక్తిని పుట్టించునది యేదియో గ్రహించవలెను. అటుపిమ్మట సమస్తయోగవిధానము లెందుఁబుట్టుచున్నవో తెలియకనే దేనివైపునకు నడచుచున్నవో, తెలిసి దేనియందుఁ జేరుటకు ముందువాటికి వీలుకలదో యట్టి సర్వసామాన్యమైన ధర్మమును సర్వసామాన్యమైన శక్తినిగని పెట్టగలము. స్వభావముయొక్క యీస్వకీయ ప్రత్యక్షాభివృద్ధినే యీకాలమునఁ బరిణామ మనుచున్నారు. (Evolution). ఆపరిణామము మూఁడింటిపై నాధారపడియున్నది. (1) వెనుకటివృద్ధి (2) వర్తమానమందు వ్యక్తితో జరుగుచున్నవృద్ధి (3) ముందు జరుగఁబోవుభావికవృద్ధి. ఈభావికవృద్ధికొన్ని సమయములయం దిదివఱకే కాన్పించినది. మఱికొన్ని సమయములందిప్పటి మనుష్యజాతికిముందు సాధ్యముగానున్న సంపూర్ణత్వమును సమీపించినది. స్వభావముయొక్క నడక కవాతునందుఁ గ్రమపద్ధతిని ముందుకువేయు నంజల వంటిది కాదు. శోచనీయములగు పరాజయములు రానియెడ నన్నతిక్రమించి సదావృద్ధిఁ జెందుచున్నది. దానికి దొమ్మీలుకలవు. శ్రేష్ఠములగు గొప్పదండయాత్రలు కలవు. కొన్నివేళల దొమ్మీచేసి ...

వంతముపై దేవత్వము సంపాదించుచున్నది. తన్నుఁదానిట్లతిక్రమించుట తనయందున్న దేవత్వముగాని దుష్టత్వముగాని వెల్లడించుటే. ఏదైనను దానిగమ్యస్థానమును శీఘ్రముగాఁ బొందుటకు శక్తికలిగే యున్నది.

ఇంతవరకు స్వభావము మనకొఱకు స్థూలజీవితమును నిర్మించినది. భూలోకమున మనవృద్ధికిఁ, గర్తలకత్యావశ్యకమైన రెండు హీన వస్తువులఁగలపి సమ్మేళన మొనరించినది. అందొకటి జడపదార్థము. ఈజడపదార్థ మున్నతస్థితిలో నుండువారి కెంతహీనముగాఁ దోఁచినను మనశక్తులకు సంసిద్ధులకుఁ బునాది. రెండవది ప్రాణశక్తి. అది స్థూలదేహమున మనము నివసించుటకు సాధనమగుటేగాక మానసవిజ్ఞాన వ్యాపారములకుఁగూడ మూలమగుచున్నది. స్వభావము తన యెడతెగని స్థూలవ్యాపారమునకుఁ జాలినంత స్థిరత్వమును సంపాదించినది. ఆస్థూలవ్యాపారము, మనుష్యజాతియందుఁ బ్రత్యక్షమై క్రమవృద్ధినొందుచున్న దేవునకు నివాసయోగ్యమగు సాధనమును నిర్మించుటకుఁ జాలినంత స్థిరమై శాశ్వతమై తగినంతమార్దవము కలిగి మారఁదగినదై యున్నది. అయితరేయోపనిషత్తునందుఁ జెప్పంబడిన కట్టుకథ కిదియర్థము. ఆకథ యేమనగా దివ్యాత్మ క్రమానుసారముగాఁ జూపిన మృగశరీరముల దేవత లంగీకరించక మనుష్యునిఁజూపఁగానే "యిది సంపూర్ణముగాఁ జేయఁబడినది" యని చెప్పుచు నందుఁ బ్రవేశించ నొప్పుకొనిరి. మరియు స్వభావము జడపదార్థముయొక్క మాంద్యతకును, జడమందుండి వశము చేసుకొనుచున్న ప్రాణముయొక్క చురుకుతనమునకును సమాధానము జేసినది. అందువలనఁ బ్రాణముతో నిలుచుటకేగాక మానస వికాసములకుఁగూడ వీలుకలిగించినది. కొంతకాలము స్థిరముగా నిలచి పనిచేయుటకు సాధ్యపడినది. ఈసమాధానమే స్వభావముయొక్క మొదటి యంతస్థు. దీనికి యోగశాస్త్రమున స్థూలదేహమని పేరు. దీనియం దన్నమయ ప్రాణమయ కోశము లిమిడి యున్నవి.

ఈసమ్మేళనము సర్వవ్యాపకుం డుద్దేశించిన యుత్తమవ్యాపారములకుం బునాదియైనయెడల, నీయుపాధిమూలమునం దన్నుం దా దైవము వెల్లడించుకొనందలచినయెడల, "శరీరమాద్యంఖలు ధర్మసాధనం" అను హిందువుల యార్యోక్తి సత్యమైనయెడల, స్థూల జీవితమునుండి వైతొలగుట దివ్యజ్ఞానసంపూర్తిని విడుచుటే. భౌతిక పరిత్యక్తమునకుఁగల యుద్దేశమును త్యజించుటే. స్థూలదేహానిరాకరణము కొందఱికిఁ గొన్నివేళల వారివారి వృద్ధినిబట్టి కావలసి యుండును. కాని యది జనసామాన్యమునకుం బనికిరాదు. స్థూలదేహమును త్యజించుట పూర్ణయోగ మనంబడదు. విజ్ఞాన ప్రాప్తికి ముఖ్యముకాదు. శరీరమును పరిపూర్ణత్వమునకుఁదెచ్చుటే యాత్మతుదకుఁ బొందెడు విజయము. స్థూలజీవితమును దివ్యజీవితముగా మార్చుటే ప్రపంచమం దీశ్వరకార్యమునకుం బరిపూర్ణత్వము. జ్ఞానప్రాప్తికిఁ బ్రతిబంధకమని స్థూలమును విడువకూడదు. మనకుం దటస్థించుకష్టములు ముందు మనమంచికై యుండ వచ్చును. గొప్పకష్టమువచ్చుట యుత్కృష్ట విజయమును శ్రమపడి సంపాదించుమని సూచించుటే. తప్పించుకొన శక్యముకాని వలయున్నదనియు, జయింపలేని శత్రువులున్నారనియు నది మందలింపు కాదు.

ఆవిధమున మనలోనున్న ప్రాణశక్తులకు, నాడీశక్తులకు గొప్ప యుపయోగమున్నది. అవికూడ మన సంసిద్ధితోపాటు దివ్యజ్ఞానప్రాప్తినే కోరుచున్నవి. ఈనాడీశక్తుల దుష్టములని చంపుట, త్యజించుట పూర్ణయోగము కానేరదు. అవి మనలోఁబుట్టి వృద్ధిఁగాంచుట కుద్దేశము వాటినిమార్చిస్వాధీనపరచుకొని, యుపయోగించుట. వాటి పవిత్రీకరణ ముద్దేశముకాని వినాశముకాదు.

మనకు స్వభావ మేర్పరచిన స్థిరమైన మొదటిసాధనము స్థూలజీవితము. రెండవది మానసిక జీవితము. స్థూలమునకంటే నుత్తమమైనది. ఇప్పుడే యేర్పడుచున్నది. స్వభావము దీనినేర్పరుచుటకు బహుప్రయత్నయు చేయుచున్నది. సదా పాటుపడుచున్నది.

## II

మానవునందున్న యానిక్యతేయిది. మనుష్యునందొక మానసమే గాక (1) జడమానసము, (2) తెలివిగలమానసము, (3) దివ్యమానసమను త్రివిధమానసములు గలవు. జడమానసము స్థూలదేహసంబంధములగు పశేంద్రియముల వశమై వర్తించును. తెలివిగల మానసమింద్రియ వశవర్తి గాక స్వచ్ఛమై యుండు. దివ్యమానస మసమాపకములగు తార్కిక భావనావిధానములకు లోబడదు. మానవులందు మానసము దేహప్రాణములతో జిక్కుపడినది. వృక్షాదులలో బూర్తిగా నంతర్గతమైనది. మృగములలో బంధింపబడినది. తనవ్యాపారమునకు స్థూలజీవితమే ముఖ్యమని స్థూలమునే సేవించుచున్నది. కాని స్థూలజీవితము ప్రారంభస్థితిగాని గమ్యస్థానము కానేరదు. మనుష్యుడనగా యోచించువాడని, మనువని, యన్నమయ ప్రాణమయకోశముల నడపించు నేతయని పూర్వులు చెప్పియున్నారు. ఎప్పుడతడు స్థూలమునువిడచి యన్నమయ ప్రాణమయ కోశములకు వెలియై వర్తించునో యప్పుడు నిజమైన మానవజీవితము ప్రారంభమగుచున్నది. అట్టి స్వేచ్ఛననుసరించి స్థూలమప్పుడు నడిపింపబడుచున్నది. నిగ్రహమునకు సాధనము స్వాతంత్ర్యముగాని నేస్పతో వశవర్తియగుట కాదు. వృద్ధిగాంచిన స్థూలవిషయముల బలాత్కారముపై నంగీకరించుట యుత్తమ ప్రమాణము కాదు. సర్వస్వాతంత్ర్యముతో నంగీకరించుటే యుత్తమలక్ష్యము.

ఇట్లు వెల్లడగుచున్న మానసిక జీవితమందఱియందు సమానము కాదు. కొందఱియందే సంపూర్ణవృద్ధి గాంచినట్లున్నది. బహుజనులలో నసంపూర్తిగానున్నది. కొందఱియం దంతర్గతమై క్రియారూపమున దెలియుటలేదు. మానసజీవితము పూర్తిగా బహిర్గతము కాలేదనుట నిశ్చయము. అది నరమృగమునందింకను స్థిరపడలేదు. ఇందున కుదహరణముగా మానసికవ్యాపారశూన్యములగు కొన్ని జాతులందు బలిష్టములై చిరకాలము జీవింపగల దేహములు కనబడుచున్నవి. ఆదేహము లందున్న ప్రాణములు సమస్థితి నొందినవి. నాగరికుడైన జనుడు పూర్తిగా బనిచేయుచున్న మనస్సునకును దేహమునకును సమత్వము స్థాపింపవలసి యున్నాడు. మాట

మాత్రమునకైన నతఁడా సమత్వము కలిగియుండలేదు. ఉద్రేకముతోఁ గూడుకొన్న మానసికజీవితము చేయు తీవ్రప్రయత్నము సమత్వభంగమును వృద్ధిఁజేయుచున్నది. గనుకనే గొప్పశాస్త్రజ్ఞుల నసాధారణ మేధావంతులఁ బిచ్చివారనిరి. అసాధారణ మేధయనగా బ్రహ్మాండశక్తి మనమానసశక్తులఁ ద్వరఁబెట్టి తీవ్రమొందించి దివ్యమానస విలాసమున కర్హములగునట్లు చేయుటే. అది విపరీతాద్భుతముకాదు. పరిణామమందు స్వభావసిద్ధమైన ముందంజ. స్వభావము స్థూలజీవితమునకు, జడమానసముతోఁ బొందిక కలిగించినది. దానికిఁ దెలివిగల మానసముతోఁ బొందికకలిగించుచున్నది. అందుకై స్థూలప్రాణముల నణచినను గొప్ప కల్లోలము బుట్టింప నవసరము లేదు. ఉన్నతపదవినొందుటకు ముందంజవేయుచున్నది. దానివిధానమునందేర్పడిన కల్లోలములు జనులనుకొనుచున్నంత గొప్పవి కావు. వాటిలోఁగొన్ని నూతనావిర్భావమునకు నపక్వములగు నంకురము లగుచున్నవి. మరికొన్ని నూతనకార్య విధానఫలములై శిథిలత్వమును దొలగించుచున్నవి.

అన్ని సంగతులఁబట్టి యోచించిన మానసిక జీవితము మనుష్యునకు స్వల్పకాలముక్రింద నేర్పడినదిగాక, ఘోరమైన యధఃపతనముల నొకదాని నొందిన జాతీయశక్తియొక్క వెనుకటి సంసిద్ధుల పునరుక్తియని తోఁచుచున్నది. అనగా మనోమయకోశము క్రొత్తగా నిప్పుడే యుద్భవించినదికాదు. కొన్నిజాతులు వృద్ధిఁజెంది పడిపోవుచున్నవి. అప్పుడు వృద్ధిఁజెందిన వాటిశక్తి క్షీణించును. అట్లు మనోమయకోశము వృద్ధిఁజెంది యధఃపతన మొందుటచే క్షీణించినదై యుండవచ్చును. ఏమియెరుగని యాటవికుఁడు బహుశహా నాగరీకునకు మొదటివాఁడు కాకపోవచ్చును. క్షీణించిన వెనుకటినాగరీకతయొక్క పడిపోయిన వంశస్థుఁడై యుండవచ్చును. కారణమేమనగాఁ బ్రత్యక్షమున మేధాసంసిద్ధియందలుకు సమానముకాకపోయినను సామర్థ్యమందలుకు సమానమే. ఆఫ్రికా మధ్యవాసులగు కేవల యనాగరీకులకు సహిత మితరసాంగత్యములేకనే మానసికా

# II

భివృద్ధిఁ జెందుటకు సామర్థ్యము కలదు. ఐరోపావారి మేధోసంసిద్ధి లేకపోయినను మానసాభివృద్ధిఁ జెందగలరు. సంఘమందు సహితము యుగయుగములు బట్టెడి వృద్ధి కొన్ని తరములలోనే వచ్చుచున్నది. ఆటవికుని గావించునది మనస్సుయొక్క యశక్తత కాదు. అంకురించుచున్న ప్రేరేపణలఁ ద్రోసిపుచ్చి యవకాశములఁ జిరకాల ముపయోగించకుండుటే కారణము. మనుజుఁడు మానసికపురుషుఁడుగాన మందగతిగల పరిణామధర్మములతో నవసరములేనివాఁడై యుండిన నుండవచ్చును. లేక తగినసహాయముండి ప్రేరేపణకలదేని మానసిక వ్యాపారమునకుఁ దగిన భౌతికసామర్థ్యము కలిగియుండిన యుండవచ్చును. అనాగరీకత యాదిమ యంధకారము కాదు. మధ్య వచ్చిన నిద్దుర.

మానసోపకరణముల, మానసశక్తుల భావికవృద్ధికిఁ బనికి వచ్చునట్లు సర్వజనులయందు సమస్థితి నొందించుట స్వభావమెరిగి చేయుచున్న ప్రయత్నముగాఁ గనుపించుచున్నది. అన్నమయ ప్రాణమయకోశ సమ్మేళన పూర్తి చేయుటకును, మానసికవృద్ధికిఁ దగిన యవకాశములఁ గలిగించుటకు నైరోపాదేశస్థులు పెక్కుస్థూల ప్రయత్నములఁ జేయుచున్నారు. వారి విద్యావ్యాపారము, హీనజాతులవృద్ధి, శరీరశాస్త్రానుగుణ్యమగు నారోగ్యపద్ధతి, యాయుర్వృద్ధి విధానము మొదలగునవి నిదర్శనములు. సరియైన పద్ధతుల నుపయోగింపకఁ బోవచ్చును. కాని యుద్దేశము మంచిది. స్థూలమానసమును స్థిరపరచి, చాలినంతసుఖము, తీరుబడి, సర్వసమమైన యవకాశము, స్థూలమానస సంతృప్తి కలిగించుచున్నది. ఇట్లు రాగమానసాభివృద్ధి ప్రత్యేక మొకజాతి, తరగతి, పురుషునకుఁగాక సమస్తమానవకోటికిఁ బ్రాప్తించుటకు వీలుకల్పింపఁ బడుచున్నది. వర్తమానమందు స్థూల లక్ష్యము, మితప్రియలక్ష్యము, ప్రబలియుండినను దాని వెనుక నుత్తమ ప్రేరేపణ పనిచేయుచునే యున్నది.

ప్రారంభవిషయములు సంతృప్తిగాంచినపుడు, గొప్ప యీ ప్రయత్నము తనమూలమును కనిపెట్టినప్పుడు, ముందేవిషయము

కొఱకు మానసవ్యాపారములుపయోగింపఁబడుచున్నవి? ఆవిషయ మెట్టిది? మానసమే స్వభావమునకుఁ బరమోత్తమ లక్ష్యమగునేని, వివేకవిశిష్టమై కల్పనాశక్తిగల మానసమేర్పడినఁ జాలును. కాని మానవుఁడు తర్కములు రాగములు మాత్రముకల జంతువుకాఁడేని, ప్రస్తుతమున పరిణామ మొందినదేకాక ముందు పరిణామ మొందవలసిన దుండేనేని, మానసికజీవిత పరిపూర్ణత్వము, మానసశక్తివిపుల త్వము, రాగవైభవము మొదలగు నని యుత్తమ జీవితమును, గొప్పసామర్థ్యములను వృద్ధిఁజేయుటకు మార్గములగుచున్నవి. ఆజీవితము, సామర్థ్యములు ముందురావలసియున్నవి. మానసము దేహము నెట్లు వశము జేసుకొనెనో యట్లే యివికిందియుపకరణములస్వాధీనము జేసుకొనవలసియున్నది. స్థూలము తన సంతుష్టికై యేర్పడినది గాక యుత్తమ వ్యాపారమునకుఁ బునాదిద్రవ్యము నివ్వవలసి యున్నది.

మానసికజీవితమునకంటె యుత్తమజీవిత మున్నదని నిరూపించుట హిందూవేదాంతములకు మూలము. అట్టి యుత్తమజీవితమును బొందుటకు, నిర్మాణము జేయుటకు యోగవిధానము లుపయోగింపఁబడినవి. మానసోద్భవము పరిణామమునకుఁ దుదిహద్దు కాదు. అంత్యలక్ష్యమనఁబడదు. స్థూలదేహమువలెనది యొకయుపకరణము. యోగశాస్త్రమందు దీనినంతఃకరణ మందురు. రానున్న యుత్తమజీవితము క్రొత్తగా నిప్పుడే పుట్టినదికాదు. ఇదివరకే యుద్భవించి కొన్నికాలములయందు జనులఁ బరిపాలించినదని హిందువులు చెప్పుచున్నారు. ఏదియెట్లున్నను దానిని తెలుసుకొనవలెనన్నఁ గొంతభాగమైన నిదివరకే యుత్పన్నమై యుండవలెను. తరువాత స్వభావము తానుసాధించిన విషయమునుండి పడిపోవుటకుఁ గారణము స్థూలమానసములసంపూర్తిగా నుండుటే. వాటిపొందిక తెలియక పోవుటే. హీనస్థితిని నిరాకరించి యుత్తమస్థితి కెక్కువప్రాముఖ్యత కల్పించుటే. అందువలన స్వభావము తిరిగి స్థూలమానసములనే పొందినది.

పరిణామము తేఁ బ్రయత్నించుచున్న నీయుత్తమ జీవితమెట్టి ది? ఈప్రశ్నమున కుత్తరమిచ్చుటలోఁ గొన్ని యుత్తమానుభవ ములఁగొన్ని యసాధారణభావముల విమర్శింపవలసియున్నది. అట్టి భావానుభవములు ప్రాచీనసంస్కృతభాషయందుఁదప్ప యేయితరభాష లో బోధించుటకు సాధ్యముకాదు. అవి యాభాషయందు మాత్రమే కొంతవరకు క్రమపద్ధతికిఁ దేఁబడినవి. యోగపరిభాషయం దన్న మయ ప్రాణమయ కోశములు స్థూలదేహమని చెప్పఁబడుచున్నవి. మనోమయ కోశమంతఃకరణమని వాడఁ బడుచున్నది. మూఁడవయా యుత్తమసోపానము కారణశరీర మనఁబడుచున్నది. అందు విజ్ఞాన మ యానందమయ కోశము లిమిడియున్నవి. ఈవిజ్ఞానము మానసి కతర్కముచేఁ గ్రమపద్ధతిఁ గాంచిన విషయముకాదు. ఊహింపఁబడి నతీర్మానములపై నేర్పడిన యసత్యవిషయముకాదు. అది స్వతసిద్ధ స్వప్రకాశముఁగల సత్యము. ఈయానందము సుఖదుఃఖాయతమైన యింద్రియజనితసుఖముగాక స్వతసిద్ధస్వస్వరూప జనితానందమై యున్నది. ఈయానందమునకుఁ బ్రత్యేకానుభవ ద్రవ్యములతోఁ బనిలేదు. అదియనంతపరమోత్తమ స్థితియందు స్వతసిద్ధస్వస్వరూపా నందము.

ఇట్టి తత్వజ్ఞానవిషయములు సత్యములగునా? సాధ్యములన వచ్చునా? యోగమువలనఁ దుదకుకలిగెడి యనుభవమిదియని యోగము చెప్పుచున్నది. మిక్కిలి విపులత్వమొందిన మన పర మోత్తమజ్ఞానస్థితియందివి ముఖ్యతత్వములు. ఈపరతత్వములు శృతి యావేశము, సహజజ్ఞానమనఁబడు మానసశక్తులతోఁ గొంచెము పో లియున్నవి. వీటికి తమలోఁదమకు పొందికకలదు. ఈతత్వములు దివ్యమానసమనఁబడు సహజజ్ఞానజనిత విచక్షణతోఁ బనిచేయునవి కావు. అంతకునెక్కువైన లోకమందు సత్యమును బ్రత్యక్షమున ము ఖాముఖిఁ జూచుచు, బహ్మాండమందున్న, బ్రహ్మాండాతీతమైన సమ స్తవస్తు సత్యత్వమునుఁ దెలిసికొనఁజాలినవి. అవి యహంకారశూ న్యమైన జ్ఞానస్థితియొక్క ప్రకాశత కలవి. ఆప్రకాశము విశ్వవిషయ ము, విశ్వాతీతవిషయము. ఆప్రకాశలక్షణ మానందము. తప్పక

నివి దివ్యతత్త్వములు. అమానుషజ్ఞాన స్థితులు. మనుష్యశక్తికి మించినవి. పరమాత్మ త్రిమూర్త్యాత్మకమైన సచ్చిదానందమని వేదాంతమభినుతించుచున్నది. విశ్వరూపమున సగుణముగా వ్యక్తముకాని శుద్ధరూపమున నిర్గుణముగా వ్యక్తముకాని, మేల్కాంచిన మన వ్యక్తికది సచ్చిదానందముగాఁ బ్రత్యక్షమగుచున్నది. ఈతత్త్వములు వెలికిఁ గాన్పించవనియు, మేల్కాంచిన మనప్రస్తుతవ్యక్తికి గోచరించవనియు, మనలోనున్న నూర్ధ్వలోకమం దున్నవనియు, మనమారోహించవలసినవనియు యోగముసహితము జెప్పుచున్నది.

కారణమనగా హేతువు. కారణదేహ మనుటచేతఁ గరణములగు స్థూలసూక్ష్మములకు వేరైనది. ఇప్పటివరకు ప్రాప్తించిన పరిణామఫలమునకిది మూలము. శక్తిదాయకము. మనమనోవృత్తులు మరియొకదానివల్లఁ బుట్టినవి. వేరొకదానినుండి యెన్నుకొనినవి. మూలమునుండి విడియున్నంతవరకవి దివ్యజ్ఞానమును వికారముగాఁ బ్రకటించుచుండును. మన యింద్రియజ్ఞానములకు రాగములకు బ్రహ్మానందముతో నట్టిసంబంధమే కలదు. మన నాడీశక్తులకు దివ్యజ్ఞానమువహించిన చిత్తమునకట్టి సంబంధమేకలదు. స్థూలదేహమునకు నావిజ్ఞానానందముల శుద్ధసత్తునకట్టి సంబంధమేకలదు. దేనికి మనము భౌతికశిఖరమైతిమో యట్టిమనకుఁ గాన్పించుచున్న యీ పరిణామము తలక్రిందుగానున్న యావిర్భావమనవచ్చును. అందుచే భిన్నముగా నేకముగా నీశక్తులు పరిపక్వముకాని, ద్రవ్యముల జడ ప్రాణ మనోవృత్తుల నుపయోగించి, వృద్ధిపరచి పూర్ణత్వమునకుఁ దెచ్చుచున్నవి. తాము వేటినుండి యుత్పన్నమైనవో యట్టి యనంతదివ్యస్థితులయొక్క వృద్ధిగాంచెడు పొందికను, మార్పులుజెందుచున్న తారతమ్యములందు వెల్లడించుచున్నవి. ఇదే విశ్వతత్త్వమైన యెడలఁ బరిణామమునకు గమ్యస్థానమేదియో యదేదానికిఁ గారణము సహితమగుచున్నది. అది సమస్తభూతములలో నంతర్గతమై యున్నది. వాటినుండి దానిని విడతీయవలసియున్నది. తప్పించుకొనుటే ప్రధానమై, వస్తువులవృత్తుల నున్నతస్థితికి మార్చుటకు మన

ల స్వీకరించకున్న నది సంపూర్ణముక్తి కాదు. తుదకట్టిమార్పు రాకున్న నాయంతర్గతస్థితి యున్నదనినమ్మటకే కారణముండదు. మనుష్యమానసము దివ్యతేజముయొక్క సంపదనుపొందఁగలదేని, మానుషేంద్రియ జ్ఞానములు రాగములు బ్రహ్మానందస్థితులుగా మారగలవేని, మానుషక్రియ లహంకారవర్జిత దివ్యశక్తి ప్రేరితములని తెలియఁబడునేని, స్థూలపదార్థ ముత్తమసత్తులోఁ బాలుగొని యుత్తమానుభవముల దీర్ఘకాలమనుభవింపఁ జేయఁగలదేని, స్వభావము పడుచున్న శ్రమకప్పుడు ఫలముగాన్పించును. దాని పరిణామముయొక్క విపులార్థమప్పుడు తేటతెల్లమగును.

ఇట్టి యున్నతస్థితియొక్క లవలేశమునకైన నెంతటిప్రకాశముగలదన్నఁ దత్ప్రాప్తికొఱకితరమంత విడచుటే న్యాయమని తోచును. మానసమే ముఖ్యలక్ష్యార్థమనెడి మతమునకు సహితము మోక్షప్రాప్తికి మానస మొకయభ్యంతరమై తోఁచకమానదు. మోసపుచ్చి సత్యమును దాచునదిగాఁ గనుపించకమానదు. మానసమేర్పడుటకుగల యీశ్వరోద్దేశమును విడుచుటచే, నిట్టియసంపూర్ణజ్ఞానము జనించుచున్నది. ప్రపంచమునకు వెలియై ప్రపంచాంతర్గతుఁడై యీశ్వరుఁడున్నాఁడనుటే పూర్ణజ్ఞానము. పూర్ణయోగమనగా నీశ్వరుని జేరినపిదప మరలసృష్టిలోఁ బ్రవేశించి దానివశము చేసుకొని పైకెక్కుటకు దిగుటకు శక్తికలిగియుండుటే. నిత్యవివేకముండుటే నిజమైనయెడల మనస్సునకు సహితముపయోగముండవలెను. ఆయుపయోగమారోహణా వరోహణలయందు దానిస్థితినిబట్టి యుండును. దానియుద్దేశము సంసిద్ధిమార్పు. నశింపునిర్మూలత కాదు.

పైనఁజెప్పఁబడిన యీమూఁడుసోపానములు స్వభావమందుఁగనుపించుచున్నవి. ఈభౌతిక ప్రపంచమందు మనయునికిమూలము స్థూలజీవితము. రెండవ సోపానమగు మానసికజీవితమున ముందుప్రవేశించిదానివలన స్థూలమును బైకెత్తి విపులమొనరించి యుత్తమస్థితికి మార్చెదము. మూఁడవసోపానమగు దివ్యజీవితము కడమ

రెండుజీవితములకు గమ్యస్థానము. వాటికిఁ బరమోత్తమస్థితిని గలిగించుటకు నందుమరలఁ బ్రవేశించుచున్నది. పరిపూర్ణస్థితికొఱకీ మూఁడింటిలో దేనినైన నశింపఁజేయనక్కఱలేదు. కాబట్టి యీ విమోచన యీసంసిద్ధి యోగమందొక ముఖ్యభాగమని యంగీకరింతము.

# యోగసంకలనము.

## ఉపోద్ఘాతము.

### III

త్రివిధజీవితము.

స్వభావమనగా నిత్యావ్యక్తస్థితితోఁ బొందుచున్న పరిణామము, అదేయాత్మయొక్క ప్రత్యక్షాభివృద్ధి. దానికారోహింపఁ త్రివిధరూపములగు మూఁడుసోపానములుకలవంటిమి. ఒకటిపై నొకటి యాధారపడియుండు నీస్థూలసూక్ష్మకారణ జీవితములు మనకర్మల కత్యావశ్యకములు. కారణముదాగియున్నను బ్రవృత్తిమార్గమున (involution) తక్కిన రెంటికి మూలమైయున్నది. నివృత్తిమార్గమున (evolution) వాని ఫలమైయున్నది. స్థూలమును పోనివ్వకఁ బరిపూర్ణస్థితికిఁదెచ్చి, మానసమును సంపూర్తిచేసి, వానిమూలమున నతీతమగు నాత్మ వ్యాపారముల మనము వెలికిఁదేవలెను. సూక్ష్మజీవితము స్థూలజీవితమును దోసివేయక దానివృద్ధికి సహాకారి యెట్లగుచున్నదో యట్లే కారణము సూక్ష్మమునకు భంగకారిగాక, దానికిఁ దోడ్పడి, మన మనోరాగరసజ్ఞాన ప్రాణవ్యాపారముల మార్చవలెను.

మనుష్యుఁడు భౌతికస్వభావమునకు శిఖరము, అతని స్థూలాకారమందే దాని పరిణామము సంపూర్ణమగుటకు సాధ్యపడుచున్నది.

# III

అట్టిమనుష్యుఁడు మూఁడుజన్మలు గలవాఁడు. అతనికి స్థూలదేహము ప్రాణసహితముగా నివ్వఁబడినది. ప్రత్యక్షానుభవమునకు స్థూలదేహముపాత్ర. ప్రాణముశక్తియుక్తమగు సాధనము. అతని క్రియాశక్తియంతయు వృద్ధిచెందు మనస్సునం దిమిడియున్నది. అట్టిమానసము పరిపూర్ణస్థితినొందుచుఁ దానివశించియున్న స్థూలమును, మరి యితరపరికరణములఁ బూర్ణస్థితికిఁ దెచ్చును. అంతటనాత్మజ్ఞానాభివృద్ధిచే నాత్మస్వరూపమే తన నిజతత్వమని ప్రబోధనొందుచున్నది. ఎల్లప్పుడు మనుజుఁడేదైయుండెనో యట్టి యాత్మయందు సమాప్తి నొందుచున్నాఁడు. అట్లు ప్రకాశతనొందిన యాత్మదాగియున్న తన ప్రభలతో మనోప్రాణముల నింపుచున్నది.

దివ్యశక్తియొక్క ముఖ్యోద్దేశమిది గాన, నీత్రివిధజీవితముల పరస్పర వ్యాపారమే మన ముఖ్యకార్యవిధానము. ఈత్రివిధజీవితములు దేనికది ప్రత్యేక్య మేర్పడియుండుటచే వీటిలోనెద్దానినైన నెన్నకొనుటకు మనుజునకు స్వాతంత్ర్యముకలదు. కానియతఁడు వృద్ధినొందినకొలది యీమూటిని జేర్చి వానిపరస్పర విరోధములకు సమరసత్వము కల్పించుచున్నాఁడు. ఆవిధమునఁ దనలోఁ దేవత్వము నిర్మించుచున్నాఁడు. అనగాఁ బరిపూర్ణమానవుఁ డగుచున్నాఁడు.

సాధారణ స్వభావసృష్టియందివి వేరువేరుగుణములు, ప్రేరేపణలు కలిగియున్నవి. స్థూలజీవితముయొక్క శక్తిగుణము వృద్ధిజెందుటలోకన్న స్థిరపడుటయం దెక్కువగానున్నది. తాను ప్రత్యేకము విపులత్వ మొందుటకన్నఁ దిరిగితిరిగి పునరుక్తమగుటలో యధికముగానున్నది. నిశ్చయమునకు భౌతికస్వభావమందొక తరగతినుండి మరియొక తరగతిలోనికి వృద్ధిగనుపించుచున్నది. చెట్టుచేమలనుండి జంతువులలోనికి, జంతువులనుండి మనుష్యులలోనికి వృద్ధికనుపించుచున్నది. అందుకుఁగారణము జడమందుసహితము మనస్సు పనిచేయుటే. కానియొకప్పుడు తరగతి యేర్పడినతోడనే యెడతెగని పునరుక్తిచేఁ దరగతిచెడకుండ భౌతికమాత ప్రయత్నించుచున్నది. ఏలననఁ బ్రాణము నిత్యత్వముకొఱకుఁ బ్రయత్నించుచున్నది. వ్యష్టి

రూపమనిత్యము. బ్రహ్మాండమును సృజించు జ్ఞానమందు శరీరాకార భావము మాత్రముకే నిత్యము నిలచి యుండును. ఆభావము నశించు నదికాదు. కాబట్టి భౌతిక నిత్యత్వ మనగా నెడతెగక తిరిగితిరిగి పునరుక్తిజెందుటే. ఆత్మరక్షణ మాత్మపునరుక్తి, యాత్మబహుళత్వ మనునవి స్థూలజీవితమునకుఁ బ్రబల సహజధర్మములు.

స్వచ్ఛమగు మానసశక్తికి మార్పే ముఖ్యగుణము. హెచ్చుస్థితికి రానురాను స్తిమితము పడనుపడ నెడతెగని విపులత్వము వృద్ధిజెందుచు స్వల్పస్థితినుండి యది బహుముఖ పరిపూర్ణత్వము గాంచుచున్నది. స్థూలమునకంటె మనస్సు యెక్కువ వీలుకలది. పెరుగుటలో సాగునది. ఆకార మొందుటలో సులభముగా మారునది. మార్పులనగా నాత్మవిపులత్వ శ్రేష్టత్వములు దానిసహజధర్మములు. దానిమతము పరిపూర్ణత్వము. దానిలక్ష్యార్థమువృద్ధి.

ఆత్మకు స్వతసిద్ధమగు పరిపూర్ణత్వము, మార్పులేని యసంతత్వము గుణములు. ప్రాణమునకు ముఖ్యోద్దేశమైన నిత్యత్వము, మనస్సునకు గమ్యస్థానమైన పరిపూర్ణము దానికి సదాకలవు. సమస్తవస్తువులయందు సమస్తవస్తువులకు వెలియందునేకమై, ప్రపంచమందు ప్రపంచమునకు వెలియందు సమానానందముకలిగి, తానివసించునట్టి యాకారవృత్తిలోపముల కంటకుండెడుదాని తెలుసుకొనుటే నిత్యత్వమును బొందుటే విజ్ఞానజీవితమునకుఁ గలయాధిక్యత.

స్వభావమీ త్రివిధాకారములలో వ్యష్టి సమిష్టిరూపమునఁ బనిచేయుచున్నది. నిత్యుఁడగు నీశ్వరుఁడు వ్యష్టియందెట్లు స్థిరపడుచున్నాఁడో యట్లే సమిష్టికి సంబంధించిన యొకవంశమందు, కులమందు, దేశసంఘమందు, మనుష్యజాతియందు, స్థిరపడుచున్నాఁడు. కాబట్టి మనుజుఁడు తనమేలు వీటిలోనేదైన నొకదానిచేనైన, నన్నిటిచేనైన, పొందఁగలఁడు. సమిష్టితో నేకీభవించి దానికొఱకు జీవయాత్రగడపిన గడుపవచ్చును. బహువికారములతోనున్న నీప్రపంచముయొక్క నిజపరిపూర్ణత్వమునకు లేవనెత్తఁబడిన సమిష్టియొక్క

యుద్దేశ్యముతో వ్యష్టిజ్ఞానమును సమన్వయము జేసినఁ జేయువచ్చును. కారణ మేమన నీప్రపంచమందున్నంతవరకు, జీవేశ్వరుల నిజమైన సంబంధము యహంకారజనిత ప్రత్యేకత్వము, యనిర్వాచ్యమందు లీనత్వముకాదు. ప్రపంచేశ్వరుల కేకత్వ మెరిగి ప్రపంచేశ్వరులను వ్యష్టియందుఁ గలుపుటే. అట్లే వ్యష్టికిని సమిష్టినిగల నిజమైనసంబంధము, నాకను నహంకారముతోఁ దనతోటివారిని విడచి, తన స్వకీయమైన స్థూలసూక్ష్మ కారణవృద్ధికై ప్రయతించుట కాదు. సమిష్టికొఱకుఁ దనక్రమవృద్ధిని జెడఁగొట్టుకొనుట సహితముకాదు. తనయందు సంఘవిషయములఁ బరిపక్వమొనరించి, వాటిని మనో వాక్కాయకర్మలచేఁ జుట్టు వెదఁజల్లి మనుష్యజాతిని యుత్తమస్థితులకుఁ దెచ్చుటే.

ఇందువలన స్థూలజీవితమునకుఁ గలపని స్వభావముయొక్క ముఖ్యోద్దేశ్యమును నెరవేర్చుటేయని తేలుచున్నది. స్థూలమానవునకుఁగల ముఖ్యప్రయోజనము జీవించుట. పుట్టినదిమొదలు చచ్చువరకు సుఖముగా జీవించుట. తనపునరుక్తికొఱకు తనవంశము కుటుంబము సంఘము నిలుపుకొనుటకుమాత్రమే యీసుఖజీవితమును కొంచెము విడువఁగలఁడు. తాను, కుటుంబము, జనము, దేశసంఘము, స్థూలజీవితమం దిమిడియున్నవారు. స్వభావగృహ కార్యనిర్వాహకమందు దీనికిమిక్కిలి యాధిక్యత కలదనుట స్పష్టము. తరగతిపోకుండ నిలుపుటే సృష్టిలోదాని ముఖ్యప్రయోజనము. స్వభావసృష్టి నిర్మించిన యీయాకారమును జెడనివ్వక వెనుకటివృద్ధిని నిలుపుటే యీజీవితమిచ్చు నమ్మకము.

ఇట్టి ప్రయోజన మున్నప్పటికి యీజీవితమా జనులు జ్ఞాన శూన్యులనియుఁ బ్రాపంచకులనియు నిరాకరింపఁ బడుచున్నారు. మామూలుపద్ధతులు వాడుకలు వంశక్రమమున వచ్చినయలవాట్లు భావము లాజనులకు ముఖ్యములు. వృద్ధిగాంచిన మానసముచేఁ బూర్వము గావింపఁబడిన మార్పులవా రొప్పుకొని వాటినిగాపాడు చున్నారు. కాని వర్తమానమం దది చేయుచున్న మార్పులమాత్ర

మంగీకరించకున్నారు. స్థూలపురుషునకు మానసపురుషుఁడు పిచ్చివానివలెఁ గాన్పించును. పూర్వము హిందువులలో నేకజన్ములు ద్విజన్ములను భేదములుండినవి. స్థూలమానవుఁడే యాయేకజన్ముఁడన వచ్చును. వాఁడు స్వభావముయొక్క హీనకృత్యములఁ జేయును. దాని యుత్తమ కృత్యములకై పునాది నేర్పరుచుచున్నాఁడు. ద్విజన్మయొక్క ప్రకాశత యతనికి సులభసాధ్యముకాదు.

అట్టి మనుజుఁడు ప్రాచీన మతాంధోళములు తన యాచార భావములలో నెంతవరకు విజ్ఞానమును బ్రవేశబెట్టగలవో యంత విజ్ఞానమును మాత్రమే స్వీకరించుచున్నాఁడు. తన సంఘవిధానమందు ఫలశూన్యమైనను, పురోహితునకు మతాచార్యునకు మర్యాదగల స్థితిని కల్పించుచున్నాఁడు. ఆపురోహితుని మతాచార్యుని పూర్తిగా నమ్ముచున్నాఁడు. కాని విజ్ఞానికి పురోహితస్థానముగాని యాచార్యస్థానము గాని యివ్వక సన్యాసమిచ్చుచున్నాఁడు. అట్టివిజ్ఞానిని సంఘమందుఁ జేర్చుకొనక వెలినుంచుచున్నాఁడు. ఆసన్యాసి విద్యుస్థంభమువలె సంఘభవమునకు వెలిగానుండి యధ్యాత్మిక విద్యుచ్ఛక్తి నాకర్షించి సంఘమును సేవించవలసి యున్నాఁడు.

వృద్ధి సహజధర్మమని, మార్పు తప్పనిసరియని మనస్సునకుఁ బోధింపఁజేయుటచే నాస్థూల మనుజునకుఁ గొంతవృద్ధి తేవచ్చును. జడముపై మానసమొందిన విజయమునకు నైరోపునందిట్టి సాధనములవలన వృద్ధిఁజెందుచున్న జనసంఘములు తార్కాణములు. కాని స్థూలస్వభావము కక్షవహించకమానదు. ఆవృద్ధిభౌతికమై, బాహ్యవృద్ధిగానుండుటవలన నెక్కువతీవ్రముగాఁ బ్రయత్నించుటచే గొప్పయలసట, శ్రమ, ఘోరపతనములు సంభవించును.

స్థూలజనునకుఁ గొంతవిజ్ఞానము సహితము కలిగింపవచ్చును. జీవితమునకు సంబంధించిన సర్వవృత్తులేర్పాట్లు మతసంబంధములని భావముకలిగించుటచే నిదిసంభవించఁ గలదు. ఆసియాఖండమునట్టి మతసంఘముల స్థాపనజడముపై విజ్ఞానముపొందిన గొప్పవిజయము. ఇందులోపము లేకపోలేదు. ఇదిమతసంబంధమైన చిత్తవృత్తిని మాత్ర

మే కలిగించును. ఇది విజ్ఞానముయొక్క బాహ్యరూపము. మిక్కిలి ప్రకాశమానములగు దాని యుత్తమప్రాదుర్భావములు సహితము కొంతకాలమాన్నత్యమిచ్చినను, జనసంఘమునుండి పెక్కండ్రవెలి బుచ్చి, సాంఘికబలముతగ్గించి, హీనదశకుఁ దెచ్చుచున్నవి. నిజమునకు మానసికవృత్తిగాని, విజ్ఞానప్రేరేపణగాని, ప్రత్యేకించి స్థూల స్వభావమును వంపఁజాలవు. మనుష్యజాతియందు స్థూలస్వభావము పూర్తిగా మారవలెనన్న వాటి పరస్పర సమ్మేళనమత్యావశ్యకము. కాని యీరెండు కలసిమెలసి పనిచేయుట కడుదుర్లభము.

మానసికజీవితమునకు సౌందర్యనీతి బుద్ధివిషయములపై నాసక్తియెక్కువ. స్వచ్ఛమైనమానసము పరిపూర్ణత్వమునకై ప్రయత్నించును. సూక్ష్మమై ప్రకాశమానమగు నాత్మయెల్లప్పుడు యోచనలతో నిండియుండును. అనంతుని నూతనాకృతులకై ప్రయత్నించనీ, ప్రాచీనాకారములఁ బునర్జీవములఁ జేయనీ, పూర్ణసౌందర్యముయొక్క పూర్ణనడవడికయొక్క, పూర్ణసత్యముయొక్క యోచనలు స్వచ్ఛమైన మానసమునకు ముఖ్యములు. కానిజడముయొక్క యడ్డుతోఁ బోరాట దానికిఁ దెలియదు. శక్తిచాలకఁ బోరువిడచిన విడుచును.లోఁబడిన లోఁబడును. స్థూలజీవితమును బరిశీలించి పోరాటమునకుఁగల షరత్తుల నొప్పుకొని, గెలిచి, కొంతకాలముకృత్రిమవిధానమును స్థాపించును. కాని స్వభావమట్టివిధానమంగీకరించకఁ జెడఁగొట్టుచున్నది. వికారమొందించుచున్నది. పడఁగొట్టుచున్నది. అంతలది ప్రాణశూన్యమగు లక్ష్యార్థమై పడిపోవుచున్నది. మానసికస్వప్నములు కొన్నిమట్టుకే నిలచియున్నవి. అవి జనులచే సంతోషముతో నంగీకరింపఁ బడుచున్నవి.

యోచించువాని స్వభావమునకుఁ బ్రత్యక్షజీవితమునకు విశేషభేదమున్నప్పుడు మిక్కిలి స్వేచ్ఛతోఁ దనలోఁ దాఁబనిచేయుటకు జీవితమునుండి మానసము వెలిచేయఁ బడుచున్నది. ప్రకాశమానములగు సందర్శనముల జీవించుకవియు, తనకళలలో మునిగియుండు శిల్పియు, నిర్జనప్రదేశములందు శాస్త్రముల యోచించు వేదాంతియు,

పరిశోధనయందు శ్రద్ధవహించు పండితులుఁ పూర్వమందును బ్రస్తుతమందును బుద్ధికిసంబంధించిన సన్యాసు లనఁబడుదురు. వారు మనుష్యజాతికిఁ గావించిన మహోపకారములు చాలఁగలవు.

అట్టి యేకాంతమెల్లప్పుడు పనికిరాదు. జీవితమందు మనస్సు ప్రవేశించి కష్టసుఖముల సహించునప్పుడే పరిపూర్ణత్వమొందుటకు శక్తితోఁ బనిచేయఁగలదు. స్థూలజీవితమందుఁ గష్టములతోఁ బోరాటవలన మనుష్యునకు నీతివృద్ధిగాంచును. నీతిశాస్త్రము లేర్పడఁగలవు. జీవితముతో సంబంధమెక్కువ కానుకాను గళలు జీవత్వమొందును. యోచన స్థిరపడును. శాస్త్రానుభవములపై వేదాంత భావములు రూఢమగును.

మనుష్యుఁడట్టి జీవితమును స్వార్థపరుఁడై వ్యష్టిమానసము కొఱకు స్వీకరించవచ్చును. జాతీయాభివృద్ధికి, స్థూలజీవిత విషయములకు విముఖుఁడు కావచ్చును. ఇట్టి స్వార్థపరతమ ఎపిక్యూరియనుల (Expicurean) శిక్షావిధానమం దెక్కువగానున్నది. స్టోయిక్కు (Stoic) శిక్షావిధానమందు సహితము లేకపోలేదు. అల్ట్రూయిజంవారు (Altruism) కూడ తరుచు స్వార్థపరులై దేశమున కుపకారము చేయుచున్నారు. ఇదిసహితము పూర్ణసంసిద్ధి కానేరదు. తనభావములను సంసిద్ధులను వెదఁజల్లి, మత వేద రాజకీయ మార్గాల సమస్తజాతికిఁ గలిగించి తనస్థితికి లేవనెత్తినప్పుడే మనస్సుపూర్తిగా వృద్ధిజెందినదని చెప్పవచ్చును. అట్టిపనిలో జయమురాకపోనీ ప్రారంభమే శక్తిదాయకము. నిర్మాణహేతువు. జీవితవృద్ధికై చేయఁబడు మానసికపోరాట మనస్సునకన్న నుత్తమమైన దానిచే జీవితము జయింపఁబడుచున్నదనుటకు సూచకము.

ఆయుత్తమసంగతే విజ్ఞానస్థితి. అదినిత్యమైనదానితో సంబంధించియున్నది. గనుకనది పూర్తిగాన స్థిరమైనదానికి వెలిగానుండునదికాదు. పరిపూర్ణసౌందర్యమెట్టిదో యను మానసికస్వప్నము విజ్ఞానికి సకలవస్తు రూపాంతర్గతమైన, యావస్తువులపై నాధారపడిన నిత్యానంద సౌందర్యప్రేమల యందనుభవమునకు వచ్చుచున్నది. పరిపూర్ణసత్యమెట్టిదో యను నాస్వప్నము, వృద్ధికి గమ్యస్థానము,

వివిధతత్వములకు మూలము, స్వయంభువు, స్వయంవ్యక్తమగు నిత్యవివిధత్వమం దనుభవమునకు వచ్చుచున్నది. పరిపూర్ణ కర్మ మెట్టిదోయను నాస్వప్నము, సర్వవస్తువ్యాపకమై బ్రహ్మాండరూపమునఁ బరిణమించిన సర్వశక్తియగు నాత్మనియామకత్వధర్మమందుఁ దెలియఁబడుచున్నది. తేజోమయమగు నాత్మయం దెల్లప్పుడు జరుగుచున్న సృష్టిప్రయత్నము సర్వజ్ఞుఁడు నీశ్వరుఁడగు నాత్మయందు సదాయుండు సత్యమే.

మానసిక జీవితము బండబారిన స్థూల వ్యాపారముతో కలసి వర్తించుట కష్టసాధ్యమైనప్పుడు, సత్యముగాఁ గనుపించక భ్రమపుట్టించునట్టియుఁ బ్రేమభరితముగాక వికారరూపమైనట్టియు, సత్యధర్మముగాక పాపభూయిష్టమై కనుపించు ప్రపంచమందు విజ్ఞానజీవితము స్థూలవ్యాపారముతోఁ గలియుట మరెంతకష్టమో? గనుకనే సన్యాసులు, ఋషులు స్థూలజీవితమునుండి వైదొలగుచున్నారు. వారికిఁ బ్రపంచము ప్రమాదభూయిష్టముగాన జ్ఞానభరితముగాఁ దోచుచున్నది. దైవ మెచ్చటనో స్వర్గములోనున్నట్లు, ప్రపంచజీవితములకు వెలినున్నట్లు వారికిఁ దోచును. కాబట్టి విజ్ఞానజీవితము స్వచ్ఛతకై నిర్జనత్వ మపేక్షించి ప్రపంచమునకు దూరమగుచున్నది. అట్టి త్యాగము స్థూలజీవితమునకు మహోపకారమొనర్చుచున్నది. తన యల్పోద్దేశముల మమకారముల యహంకార సంతుష్టుల విడచినవారికి నమస్కారములఁ బెట్టించుచున్నది. వారిని గౌరవించమని బలవంతము జేయుచున్నది.

మిక్కిలి శ్రేష్టమగు విజ్ఞానశక్తియొక్క వ్యాపార మీప్రపంచమందడ్డుటకు వీలుపడదు. విజ్ఞానజీవితము సహితము స్థూలములోనికి దిగి స్థూలమును దన పరిపూర్ణతకై సాధనముఁ జేసుకొనఁ గలదు. వివిధాకారముల నిరాకరించి, ద్వంద్వములకు లోనుగాక నన్నిటియం దాప్రభువునే నిత్యానంద సౌందర్యప్రేమ సత్యములనే యన్వేషించును. ఆత్మయం దన్నివస్తువు లున్నవని యన్నిటియం

దాత్మయున్నదని, యాత్మే సర్వమాయె నని చెప్పెడు వేదాంత సూత్రము పరిపూర్ణ యోగ రహస్యము.

కాని విజ్ఞానజీవితము, మానసికజీవితమువలెఁ బ్రపంచాభివృద్ధికై పాటుపడక వ్యష్టిరూపమైన జీవవృద్ధికై యీబహిరంగసృష్టిని యుపయోగింపవచ్చును. ఆత్మసమస్తమం దేకమై యుండుటచే, నాత్మకు సర్వము సమానమగుటచే, గార్యవిధానముకంటె తత్ఫలము లకంటె జ్ఞానప్రాప్తియే ముఖ్యమగుటచే, నీనిరాకరణ మెట్టి యుపాధినైన నెట్టికార్యమునైన నుపయోగించి, తనపని నెరవేరినపిదప దానియందు మమకారములేక విడచిపోవుటకు స్థిరపడుచున్నది. గీతా భావ మిదియని పలువురుగ్రహించి యున్నారు. లేదేని యంత స్థితప్రేమానందములు, దయదాక్షిణ్యసత్కర్మానురూపమున, నంత స్థితసత్యము జ్ఞానదానరూపమున వెదజల్లునేగాని, స్వతసిద్ధమైన పాపపుణ్యములకు సుఖదుఃఖములకు సత్యాసత్యములకు రణరంగమగు నీప్రపంచమును మార్చుటకుఁ బ్రయత్నించవు.

కాని వృద్ధిప్రాపంచికజీవితమునకు ముఖ్యమగుటచే, వృదిరూపమగు దేవుని యావిర్భావము స్వభావమునకు నిజలక్షణమగుటచే నీహద్దు సహితము పనికిరాదు. స్థూలజీవితమును తనస్థితికి మార్చుట విజ్ఞాన జీవితమునకు సాధ్యమై యున్నది. అది దానికి విధింపఁ బడినపని. గనుకనే శ్రమపడి స్వముక్తిని సాధించిన గొప్పయేకాంతులేగాకఁ బరులకు ముక్తిసాధించిన గొప్ప విజ్ఞానబోధకులుకూడ నుండిరి. మఱియు వారికన్నఁ బరమోత్తములనఁబడి, స్థూలజీవితశక్తులకన్న విజ్ఞానశక్తిబలవత్తరమని తెలసి, స్థూలముయొక్క మార్పునకై ప్రేమతోఁ బాటుపడిన మహాత్ములుకూడఁగలరు. సాధారణముగా వారిప్రయత్నము మనుష్యులకు మానసిక ధార్మికమార్పుల మాత్రమే తెచ్చినది. కాని యది మనజీవితమునకు సంబంధించిన పద్ధతుల విధానములమార్చి వాటిని విజ్ఞానప్రవేశమున కర్హములఁ జేయఁ గలదు. ఈప్రయత్నములే మనుజుల లక్ష్యోద్ధారాభి వృద్ధియందు నుత్తమమార్గ ప్రదర్శకములు. వానిలోఁ బ్రతిది పైకినేఫలమిచ్చినను

# III

భూమిని స్వర్గార్హముగఁ జేసి మందమగు స్వభావముయొక్క యోగాభివృద్ధిని త్వరపెట్టినది.

హిందూదేశమునఁ గడచిన వెయ్యిసంవత్సరములో మానసిక వృద్ధిని బొందలేమి విజ్ఞానస్థూలజీవితములు కలసిమెలసి వర్తించినవి. సర్వసాధారణమైన వృద్ధిప్రయత్నములు విడచి విజ్ఞానము స్థూలముతో బంధుత్వము జేసెను. కాషాయవస్త్రములవంటి బహిరంగచిహ్నముల ధరించినవారికి జ్ఞానాభివృద్ధికి హక్కుగలదని నిరూపింపఁబడెను. అట్టి బహిర్జీవితమే మనకు గమ్యస్థానమని తలంచఁబడెను. అట్టి జీవితముగలవారే పూజార్హులనఁబడిరి. సాధారణ సాంఘికాచారములకు సహితము విజ్ఞానజీవితముయొక్క బహిర్లక్షణములు తోడుచేయఁబడి సంఘమునకు మతావరణ కలిగింపఁబడెను. కాని చలనరహితమగు తమస్సునకు సంఘజనులు పాత్రులైరి. అట్టి పాత్రత పెక్కు యాధిక్యతలఁ బాడుచేసెను. మతకట్టుబాటు స్థిరపడెనుగాని దాని నిజతత్వము నశించి దినచర్యక్రింద మారెను. నూతనమతములు మతశాఖలాకట్టుబాట్లకు మార్పు తేఁ బ్రయత్నించెను గాని వాటివలన వెనుకటిపద్ధతులు కొంచెము మాత్రమే మారెను. క్రొత్తదినచర్యయేర్పడెను. కాని స్వతంత్రమనోవ్యాపారము నశించినది. అది పాఱఁదఱుమఁ బడినది. స్థూలజీవిత మజ్ఞానభూయిష్టమై భారముగఁ దోచెను. దానినుండి తప్పించుకొనుటే యావశ్యకమని కనుపించెను.

హిందూయోగములు సంధిఁ జేయఁ బ్రయత్నించినవి. వాటికి వ్యష్టి పరిపూర్ణత్వమే ముఖ్యమని తోచెను. సర్వసాధారణవృత్తుల విడచుటే యావశ్యకమాయెను. జీవితమును సన్యసించుటే సంసిద్ధియని యెంచఁబడెను. గురువు కొద్దిపాటి తనశిష్యగణమునకే జ్ఞానబోధచేసెను. విపులవిధానమునకై ప్రయత్నము చేయఁబడినను వ్యష్టిమనుజుని విమోచనమే ముఖ్యమాయెను. సాంఘికవృద్ధి విడువఁబడెను.

ఇట్టి సథింవలన యీకాలమునకు లాభము కలుగకపోలేదు. హిందూదేశస్థుల విజ్ఞానపోషకులఁ జేసెను. పెద్దకోటవంటి యీ దేశమున విజ్ఞానము చుట్టుయున్న శక్తులకు వశముగాక, పూర్ణపవిత్రత గోల్పోక, కాపాడఁబడినది. ఇదిసంధిచే కాని పూర్ణవిజయము కానేరదు. అందువలన స్థూల జీవితమునకున్న దివ్యమగువృద్ధి బీజము డుగంటెను. విజ్ఞానజీవిత మున్నతస్థితిలోఁ గాపాడఁబడెను గాని ప్రపంచమున కనుపయోగకరమాయెను. కాబట్టి యోగులకు సన్యాసులకు స్థానమైన యీ దేశమున దైవప్రేరితమై త్రోసివేయబడిన మానసికవృద్ధితో బలాత్కారముగాఁ గలుపఁబడెను. అట్లుజరుగుటచేఁ దనకుఁ గొఱతగానున్న మానసవృద్ధిని తిరిగి పొందుటకు వీలు చిక్కుచున్నది.

జీవుఁడన వ్యష్టిరూపుఁడేగాక, సమిష్టియందుకూడ కలఁడని మనము మఱియొకమారు గ్రహించవలెను. వ్యష్టిపరిపూర్ణత్వమే, వ్యష్టిమోక్షమే యీశ్వరోద్దేశము కాదని యెరుగునది. మన స్వాతంత్ర్యమం దితర మానవస్వాతంత్ర్య మిమిడియున్నది. మన పరిపూర్ణత్వమునకుఁ బ్రయోజన మేమనగా నీశ్వరతత్వము మొదటఁ దనలోఁ దానెరిగి దానిని విపులముగ వెల్లడించి సర్వవ్యాపకమగున ట్లందఱకుఁ దెలియఁ దెలుపుటే.

కాబట్టి త్రివిధజీవితములఁ జర్చించుటచే నేర్పడిన తీర్మానమే త్రివిధసోపానముల, సర్వసాధారణ స్వభావక్రియా విధానములఁ దరచుటచే సహిత మేర్పడుచున్నది. అందువలన మనయోగ సంకలనమునకుఁ బ్రయోజనము కలదని గ్రహించుచున్నాము.

ప్రపంచస్థితికిఁ నాత్మకొట్టకొన. జడముపునాది. మానస మీ రెంటిని కలుపు కొలికిపూస. ఆత్మ నిత్యమైనది. జడమానసములు దానివృత్తులు. ఆత్మదాగియున్నది. బహిర్గతము కావలసియున్నది. దేహమానసము లాత్మవెల్లడగుట కుపకరణములు. ఆత్మయో గేశ్వరుని స్వరూపవిగ్రహము. అట్టి విగ్రహమును తిరిగి స్థూలమందుదృభ

వింపఁజేయుటకు మనోదేహములు సాధనములుగా సృజింపఁబడినవి. సమస్తసృష్టి, యంతర్గతమగు సత్యమును గ్రమముగా వెల్లడించు ప్రయత్నమై యున్నది. అది దివ్యవిగ్రహమును తిరిగి యుద్భవింపఁజేయుటలోఁ గ్రమక్రమముగా విజయము గాంచుచున్నది.

స్వభావసృష్టి జనసంఘమునకుఁ గ్రమపద్ధతిని నెమ్మదిగా దేనినిచ్చుచున్నదో దానినే యోగము వ్యష్టిమనుజునకు శీఘ్రగమనమువలన సిద్ధింపఁజేయుచున్నది. దానిశక్తుల నన్నింటిని త్వరపెట్టుచున్నది. దాని సామర్థ్యముల నన్నిటికిఁ దీవ్రప్రకాశత నిచ్చుచున్నది. ఇట్లుస్వభావము విజ్ఞాన జీవితమును శ్రమపడి వృద్ధిచేయుచుండఁగాఁ జన యధోస్థితుల వృద్ధికొఱకు విజ్ఞానమునుండి జారిపడవలసివచ్చును. కాని యేకాగ్రతనొందిన యోగమార్గము సరాసరి మానసపరిపూర్ణత్వమును దెచ్చుటేగాకఁ తనకిష్టమైనచో దేహపరిపూర్ణత్వము సహితము తేవచ్చును. స్వభావము తనయందుమాత్రమే యీశ్వరుని వెతుకుచున్నది. యోగముస్వభావము నతిక్రమించి సృష్టికిఁ ప్రభువైన సర్వేశ్వరునిగని యతీతదివ్యతేజశ్శక్తులతో వెలువడుచున్నది.

తుద కారెంటికిఁ బ్రయోజన మొక్కటే. సామాన్యజనులందఱు యోగపరిచితులగుటే స్వభావము తన యాలశ్యములపై దాపరికములపైఁ దుద కొందు విజయము. ప్రస్తుతమం దది శాస్త్రవృద్ధిచే (science) మానవజాతిని మానసికవృద్ధికిఁ దగినదానిగాఁ జేయుచున్నట్లు యోగముచే మనుష్యజాతిని రెండవజన్మ కనగా విజ్ఞానస్థితికిఁ దగినదానిగాఁ జేయవలసి యున్నది. మానసికజీవితము స్థూలజీవితము నుపయోగించి దానిని పరిపూర్ణత్వమున కెట్లుదెచ్చుచున్నదో యట్లే విజ్ఞానము స్థూలమానసముల నుపయోగించి వానిని పరిపూర్ణత్వమునకుఁ దెచ్చును. అట్టిసంసిద్ధిఁగాంచిన కాలములే సత్యకృతయుగము లనఁబడును. ఆయుగములలో సత్యము బహిరంగవిగ్రహమం దావిర్భావ మొందుచున్నది. ఆయుగములలో గొప్పకార్యముజరుగును. ఆకార్య మేదియనగా స్వభావము మనుష్యజాతియందు

బ్రకాశతఁగాంచి, తృప్తినొంది, యానందించి, తనప్రయత్నము సిద్ధించగా స్థిమిత మొందుచున్నది.

స్వభావోద్దేశ్యమును మనుష్యుఁడు గ్రహించవలసియున్నది. ఆలోకమాతయొక్క యుద్దేశము గ్రహించి సరసముగ నుపయోగించవలెను. ఆమెకున్న బలవత్తరమైన సాధనముల నుపయోగించి యామెయొక్క శ్రేష్ఠమగు లక్ష్యార్థ మొందవలెను.

---

# యోగసంకలనము.

## ఉపోద్ఘాతము.

## IV

### యోగవిధానములు.

స్వభావపరిణామ మందేస్థూలమనోవిజ్ఞాన విభాగములఁ బ్రయోజనములఁగాంచితిమో వానినే వివిధయోగవిధానముల ముఖ్యవిషయములందు సహితము జూడఁగలము. వివిధాభ్యాసములఁదద్భావములఁ గలిపి సమన్వయించఁ జూచితిమా స్వభావముచే నిర్మింపఁబడిన మూలమే వానిసంకలనమునకు సహితము స్వతసిద్ధమూలమగుచున్నది. ఒకవిషయమందు మాత్రము యోగము స్వభావసృష్టినతిక్రమించఁ గలదు. తనసృష్టివిలాసమందు దైవమును గ్రహించి కౌఁగలించుట యాలోకమాతకు యభిప్రాయము. ఉత్తమయోగస్థితులయందామె తన్నతిక్రమించి ప్రపంచవిలాసమునకు వెలియై యాత్మనుయాత్మచే గ్రహించుచున్నది. కాబట్టి యిది మిక్కిలి శ్రేష్ఠమని యోగమునకు ముఖ్యప్రయోజనమని కొందఱి యభిప్రాయము.

స్వభావము తాను నిర్మించిన దానిచేతనే సృష్టినతిక్రమించవలెను. వ్యష్టిహృదయము స్వచ్ఛమగు తనరాగములఖుంచ నూని

బ్రహ్మానందాఖండ నిర్వాణములఁ బొందుచున్నది. వ్యష్టిమానసము తనసాధారణవృత్తుల మానసాతీతజ్ఞానముగా మార్చి వాచామగోచరునితో నేకమగుచున్నది. తనవ్యష్టిని గోలుపోయి యఖండమునందు లీనమగుచున్నది. అహంకారయుక్తుఁడగు వ్యష్టిజీవుఁడు స్వభావసృష్టిజనితానుభవమువల్లనే స్వభావ జన్యములలోఁ బనిచేసి యహంకారవిరహితస్వాతంత్ర్యమును బొందును.

యోగమునకుముందు మూఁడంశముల నెరుగవలెను. యోగసిద్ధికి దేవుఁడు, స్వభావము, జీవుఁడను ముగ్గురుండవలెను. వీరినే యఖండము, బ్రహ్మాండము, ఖండమని చెప్పుదురు. జీవస్వభావముల విచ్చలవిడిగాఁ బనిచేయవిడచితిమా జీవుఁడు స్వభావముచే బంధింపఁబడి, దాని నుందగమన మతిక్రమించఁజాలఁడు. స్వతంత్రుఁడైన దైవము సహాయపడవలెను. అతని యనుగ్రహముచే బంధమోచనకలిగించకున్న నూర్ధ్వగమన మసాధ్యమగును.

దీనినిబట్టి సమస్త యోగశాస్త్రము లీశ్వరుఁడున్నాఁడని చెప్పుచున్నవి. మనప్రయత్నము లతనికొఱకే యనియు, సహాయమతఁ డొసర్చు ననియుఁ జెప్పుచున్నవి. భక్తియోగమున భగవంతున కెంతప్రాముఖ్యతకలదో భక్తున కంత ప్రాముఖ్యత కలదు. భక్తుఁడు భగవంతుని వెతుకును. భగవంతుఁడు భక్తుని వెతుకును. జ్ఞానాన్వేషణ తత్పరుఁడగు మనుజుఁడు, జ్ఞానస్వరూపియగు నీశ్వరుఁడు జ్ఞానశక్తుల నీశ్వరార్థ ముపయోగించుట యను మూఁడంశములు లేకున్న జ్ఞానయోగమేలేదు. ప్రేమించుజీవుఁడు, ప్రేమస్వరూపుఁడైన నీశ్వరుఁడు విజ్ఞానరాగసౌందర్యశక్తుల నీశ్వరార్థ ముపయోగించుట యను మూఁడంశములు లేకున్న భక్తియోగమే లేదు. కర్మేష్టియగు జీవుఁడు, కర్మఫలదాయకుఁడగు నీశ్వరుఁడు, క్రియాశక్తుల నీశ్వరునికై వినియోగించుటయను మూఁడంశములు లేకున్న కర్మయోగమేలేదు. పరమోత్తమస్థితి యఖండమై దోచినను ప్రత్యక్షానుభవమునకు సమస్త మీతత్రియాత్మకముగాఁ గాన్పించక మానదు.

మనుష్యుని వ్యష్టిజ్ఞాన మీశ్వరుని కలయుటె యోగసార మనఁబడును. ప్రపంచనాటకముకంటెను భిన్నమైనదానిని యాత్మతోఁ బునస్సంధానము జేయుటే యోగము. తత్సంధానము బహువిధములనున్న పురుషుని యేస్థితిలోనైన సంభవింపవచ్చును. స్థూలమందు దేహమూలమున రావచ్చును. ప్రాణమందు నాళవ్యాపారమూలమున జరుగవచ్చును. మానసమందు రాగబుద్ధివ్యాపారముల రావచ్చును. లేదా జీవునకుఁ బ్రత్యక్షమున నఖండసత్యానందప్రబోధమూలమునఁ గలుగవచ్చును. సంధానవిధాన మెట్టిదో తదనుగుణ్యమైన యోగ మభ్యసించవలెను.

హిందూదేశమందున్న యోగవిధానముల వివిధాభ్యాసముల విడచి వాని ముఖ్యాంశముల మాత్రమే పరిశీలించిన, నాయోగములనిచ్చెనమెట్లవలెఁ బైకెక్కుట కేర్పడియుండును. అందు స్థూలదేహము క్రిందిమెట్టు. వ్యష్టిజీవుఁడు పరమేశ్వర సంధానమొందుట చివరమెట్టు. హఠయోగము పరిపూర్ణత్వముకొఱకు అన్నమయ ప్రాణమయ కోశముల సాధనములఁ జేసుకొనుచున్నది. అది స్థూలదేహ సంబంధి. రాజయోగము మనోమయకోశభాగముల సాధనముచేసుకొని కారణదేహమున లక్ష్య మిడుచున్నది. కర్మభక్తి జ్ఞానత్రయమార్గము చిత్తహృదయ బుద్ధులలో నొకదానితోఁ బ్రారంభించి దానినిమార్చి ముక్తికొఱకుఁ బ్రయత్నించుచున్నది. దాని విధానము వ్యష్టిదేహస్థిత మానుషపురుషునకు సర్వశరీరవ్యాపియై సర్వనామరూపాతీతుఁడగు పురుషునకు మధ్యప్రత్యక్షమున జరిగెడు వ్యాపారము.

అన్నమయ ప్రాణమయకోశముల జయించుటే హఠయోగమునకు ముఖ్యము. స్థూలదేహమున నన్నమయ ప్రాణమయ కోశములు కలసియున్నవి. వానిసమతూనికై మనుష్యునందు జరుగవలసిన స్వభావముయొక్క వ్యాపారములకు బునాది. స్వభావనిర్మితమగు నీసమతూనికై సాధారణ జీవయాత్రకుఁ జాలియున్నది. హఠయోగమున కది చాలదు. కారణ మేమన నీస్థూలయంత్రమును

# IV

స్వల్పజీవయాత్రకాలమున నడుపుటకు, సర్వసాధారణకర్మలు జేయుట కెంత ప్రాణశక్తి కావలయునో యంత శక్తిమాత్రమే యివ్వఁబడినది. హఠయోగ మీస్వభావమును మార్చుచున్నది. మరియొక తూనికెను నిర్మించుచున్నది. తన్మూలమున నంతప్రాణశక్తిప్రవేశించుటకున్దూలమర్హమైన దానిగాఁ జేయుచున్నది. స్వభావము వ్యష్టికికావలసిన కొద్దిపాటి ప్రాణశక్తినే తీసుకొన్నది. అంతకుమించిన ప్రాణశక్తిని మనుష్యుఁడు భరింపఁజాలఁడు. హఠయోగ మందీక్రొత్తసమతూనికె సమిష్టి ప్రాణము శరీరగతమగుచుండ వ్యష్టిప్రాణమును సమిష్టిప్రాణములో లీనముజేయుచున్నది.

హఠయోగాభ్యాసమున కాసనప్రాణాయామములు ముఖ్యములు. ప్రాణసముద్రమునుండి దేహమందుఁ బ్రవేశించు ప్రాణశక్తులఁ గ్రియారూపమునఁ బరిణమింపకుండ నిలుపుకొనలేని శరీరాశక్తతే చలన మందురు. ఆసనము స్థూలదేహచలనమును నశింపఁ జేయుచున్నది. విపరీతమైన యారోగ్యమిచ్చును. దేహబంధములఁ ద్రెంపి శరీరమునకున్న యలవాట్ల పోఁగొట్టును. భూమ్యాకర్షణ శక్తిని సహితము జయించవచ్చునని హఠయోగ సాంప్రదాయమునందుఁ జెప్పఁబడియున్నది. వివిధాభ్యాసములచే హఠయోగి శరీర మాలిన్యములఁ బోఁగొట్టి నాళముల శుద్ధిజేసి వాయుసంచారమునకు నిరోధము లేకుండఁ జేయుచున్నాఁడు. దీనినే ప్రాణాయామమందురు. ప్రాణశక్తుల బహిర్వ్యాపారము శ్వాసరూపమై యున్నది. హఠయోగికిఁ బ్రాణాయామము వలన రెండుపయోగములు కలవు. (1) స్థూలదేహపరిపూర్ణత్వము దెచ్చుట, సాధారణస్థూలవిషయములనుండి ప్రాణము విమోచనగాంచును. మంచిదేహారోగ్యము, దీర్ఘయౌవనము, పూర్ణాయువిచ్చును. (2) ప్రాణమయ కోశములో నిద్రించుచున్న కుండలీశక్తిని మేలుకొలిపి యద్భుత సిద్ధులఁ గలిగించుట. ఈఫలములే మరికొన్ని హఠయోగాభ్యాసములచే స్థిరమగుచున్నవి.

హఠయోగసిద్ధులు కంటికింపుగాఁ గనుపించును. సాధారణ జనుల సమాకర్షించును. హఠయోగమున మహాశ్రమపడి యేమిఫల

మొందుదుమో ప్రశ్నించుకొనుము. ఆయుర్వృద్ధి, స్థూలజీవితానుభవ సంపూర్తి సాధించెదము. కాని హఠయోగమునకొక లోపమున్నది. కష్టసాధ్యమైన వివిధాభ్యాసములకు విశేషకాలముపట్టును. ప్రయాస మెక్కువ. జనసామాన్యముతో సంపర్కము మానవలసి వచ్చును. పొందినసిద్ధులు ప్రపంచోద్ధరణమునకు వినియోగార్హములుగాకుండును. ఈసిద్ధులే రాజయోగతాంత్రిక యోగములవల్ల సహితముగ రాఁగలవు. ఆయుర్వృద్ధి, దీర్ఘయౌవనము, మంచి దేహారోగ్యము మొదలగు సిద్ధుల లోభులవలె దాచుకొన్న నేమి ప్రయోజనము? ప్రపంచోపయోగమునకుఁగాని సిద్ధులేల? హఠయోగము గొప్ప సిద్ధుల నిచ్చుగాని వ్యయప్రయాసములు హెచ్చు. ప్రయోజన శూన్యము.

రాజయోగమున కింతకన్నఁ బ్రయోజనము కలదు. స్థూలదేహపరిపూర్ణత్వమునకుఁ బాటుపడక నది మానసిక పరిపూర్ణత్వమునకై, మనస్స్వాధీనమునకై, యింద్రియ నిగ్రహమునకై ప్రయత్నించును. ఈవృత్తులకు స్థానమగు చిత్తమందు లక్ష్యమిడుచున్నది. హఠయోగమువలెనే ప్రతివిధమున దేహశుద్ధికై స్థిమితమునకై పాటుపడును. సాధారణమనుష్యునకు దుఃఖములు కష్టములు పెక్కులు కలవు. కారణ మేమన ప్రభువైన పురుషుఁడు తన పరిచారకుల వశమయ్యెను. ఇంద్రియములు రాగములు కోరికెలు భోగములు పురుషుని వశము చేసుకొన్నవి. ఈభానిసత్వమునకు మారుగా స్వరాజ్యము రావలెను. అక్రమమునుగంటి క్రమపద్ధతి స్థాపింపఁబడవలెను. రాజయోగమునకు మొదటిపని యాత్మశిక్ష. దానివలన మానసప్రశాంత మేర్పడి నిగ్రహము రాఁగలదు. సత్యమభ్యసించి యహంకారమును విడచి హింసఁజేయక పవిత్రతకలిగి దివ్యపురుష ధ్యానము చేసి నిర్మలమానసమును సంతోషభరిత హృదయమును స్థాపించును.

ఇది మొదటిమెట్టుమాత్రమే. తరువాత సర్వసాధారణమనోవృత్తు లింద్రియవ్యాపారములు స్థిమితమొందవలెను. ఉత్తమస్వాతంత్ర్యమొంది జీవుఁడూర్ధ్వగామియగుటకీ స్థిమితమావశ్యకము. కాని స్థూలమునకు లోఁబడుటచే మనస్సున కశక్తత కలిగిన దన్నమాట

రాజయోగము మఱువలేదు. కనుకనే హటయోగాభ్యాసములగు యాసనప్రాణాయామముల నభ్యసించుచునే యున్నది. వివిధాసన ప్రాణాయామములనభ్యసింపక దనకు వలయు నొకదానిని మాత్ర మేగ్రహించుచున్నది. ఈవిధముగా హటయోగభారమును విడచి, శీఘ్రఫలదాయకములగు హటయోగవిధానముల మాత్రమంగీకరించి, ప్రాణమయ కోశమందు చుట్టలుచుట్టలుగాఁ బడియుండి సర్పాకారమగు కుండలీశక్తిని నిద్రలేపుచున్నది. తదుపరి మనశ్శాంతిని పుట్టించి యేకాగ్రతచే యుత్తమలోకస్థితికి లేవనెత్తి సమాధినిష్ఠను పొందించును. హద్దులలోఁ బనిచేయు జాగ్రద్వ్యాపారములనుండి నైతొలగి యుత్తమజ్ఞానస్థితులనొందు మనస్సునకు సామర్థ్యము సమాధివలనఁ గలుగుచున్నది. బహిర్జ్ఞానజనిత కల్లోలముల నడచి స్వచ్ఛమగు మానసిక వ్యాపారము కలుగఁజేసి విజ్ఞానమయస్థితిలోఁ బ్రవేశబెట్టును. అప్పుడు జీవుఁడు విజ్ఞానియగును. ఇదేగాక దేనిని మన వేదాంతశాస్త్రము బ్రహ్మాండశక్తియని బ్రహ్మాండమందు దివ్యక్రియావిధానమని చెప్పుచున్నదో యట్టి యేకాగ్రమగు జ్ఞానశక్తినిచ్చు సామర్థ్యము పుట్టించుచున్నది. ఈసామర్థ్యము వలన, సమాధినిష్ఠలో నిదివరకే బ్రహ్మాండాతీతమైన జ్ఞానము సంపాదించినయోగి, జాగ్రదావస్థలోఁ బ్రపంచమునఁ దనక్రియల కెట్టి జ్ఞానమావశ్యకమో యావిజ్ఞానమును బొందును. పురాతన రాజయోగవిధానము స్వారాజ్యమునేగాక సామ్రాజ్యమును పొందఁగోరెను. స్వారాజ్య మనగా జ్ఞానముచే సర్వస్థితుల స్వాధీనము చేసుకొనుటమాత్రమే. సామ్రాజ్య మనగా సర్వస్థితుల వశీకరణమునకుఁ దోడు జ్ఞానముచే బహిర్వ్యాపారమును చుట్టు యావరణమును స్వాధీనముచేసుకొనుట.

హటయోగ మన్నమయ ప్రాణమయ కోశములతోఁ బనిచేయుచు, స్థూలజీవితమును బరిపూర్ణదశకుఁ దెచ్చి దానినిదాటి మనోమయకోశములోఁ బ్రవేశించునట్లే, రాజయోగము మనోమయ కోశముతోఁ బనిచేయుచు మానసికజీవితమును బరిపూర్ణస్థితికిఁ దెచ్చి

దానినిదాటి విజ్ఞానమయకోశమునఁ బ్రవేశించును. కాని రాజయోగమునకు సహిత మొక లోపముకలదు. ఈయోగము సమాధినిష్ఠాధిక్యత కల్పించుచున్నది. మన మానసికవిజ్ఞానమయ ఫలములఁ దెచ్చి పంచిపెట్టవలసియున్న స్థూలజీవితమునకుఁ దూరమగుచున్నది. ముఖ్యముగా నీవిజ్ఞానస్థితి సమాధిలోనే గడుపఁ బడుచున్నది. కాని విజ్ఞానజీవితమును దాని యనుభవములను జాగ్రదవస్థలోనికి దించి యుపయోగించుట మనకోరిక. అట్లు చేయక రాజయోగము మఱి యొక లోకమును గల్పించుకొని క్రిందకు దిగక యందు నిలచిపోవుచున్నది.

భక్తిజ్ఞానకర్మయోగత్రియీమార్గము దేనిని రాజయోగము విడచిపెట్టెనో దానికై పాటుపడుచున్నది. మనోమయకోశమును శిక్షించి సంపూర్ణపరిపూర్ణత్వమునకుఁ దేవలయు నను రాజయోగ మతముతో నేకీభవించక యామానసదేహభాగములగు హృదయము బుద్ధి, చిత్తమను ప్రత్యేక తత్వములయొక్క సాధారణవృత్తుల మార్చి యీశ్వరునందు తదేకధ్యానకలిగించును. ఈయోగత్రియమార్గము శరీరమానసపరిపూర్ణత్వమును నిరాకరించి దివ్యజ్ఞాన ప్రాప్తికిఁ బవిత్రతే ముఖ్యమనుచున్నది. మన పూర్ణయోగశాస్త్రమునుబట్టి యిదియొక లోపమే. ఈమార్గమున మఱియొక లోపము కూడకలదు. సమానములగు నీత్రివిధయోగములఁ బ్రత్యేకప్రత్యేకముగా నభ్యసించువా రన్నిటికి సమన్వయము తెచ్చుటకు మారుగా నొకరి నొకరు ద్వేషించుచున్నారు.

జానయోగము విచిత్రమగుఁ బరమాత్మను దెలుసుకొనుటకుఁ బ్రయత్నించును. దాని విధానము విచారించి వివేకమొందుట. ఈ ప్రపంచవైచిత్ర్యమును బరీక్షించి, విభాగించి, ప్రతివస్తువుతో నేకీభావము నిరాకరించి సర్వము ప్రకృతిజన్యము మాయామయమని వేరుపెట్టుచున్నది. ఆవిధమున స్థిరము, నిత్యము నిర్మలమగు నాత్మతో నేకీభావము దెచ్చును గాని లోకముల నెల్ల భ్రమయని నిరాక

రించుచున్నది. పునరావృత్తిలేని వ్యష్టిజీవుని యైక్యము మాత్రమే యొప్పుకొనుచున్నది.

జ్ఞానయోగమువలన వచ్చు ఫలమట్టి కేవలవ్యష్టి పరిపూర్ణత్వమే కాదు. ఆత్మపరత్వము లేక ధారాళముగ నభ్యసింపఁబడిన జ్ఞానయోగము వ్యష్టిపరిపూర్ణత్వ మెట్లొసగుచున్నదో యట్లే యీబ్రహ్మాండస్థితిని పరాత్పరుని కొఱకు మాత్రమేగాక నీశ్వరార్థము సహితము జయింపఁ జేయుచున్నది. దీనియర్థము తనలో నాత్మను గ్రహించుటేగాక సమస్తభూతములందాత్మ కలదని గ్రహించుట. మార్పులు చెందుచున్న నీప్రపంచవైచిత్ర్య మంతయు నీశ్వరవిలాసమని, నీశ్వరునకు భిన్నమైనదికాదనియు గ్రహించుట. ఇట్టి వివేకము ముందు విశేషవృద్ధికిఁ గారణమగుచున్నది. ప్రాపంచిక వివిధవ్యక్తిరూపము లీశ్వరజ్ఞాన కార్యములని, జ్ఞానస్వరూపుఁడగు నీశ్వరుని స్వస్వరూపమందును ప్రపంచవైచిత్ర్యవిలాసమందును గ్రహించుటే యీవిశేషవృద్ధి. అట్టి విధానము మానుషవ్యక్తిని నీశ్వరస్థితికి లేవనెత్తును. విజ్ఞాన మొసగును. జ్ఞానావిర్భావమునకై మనుష్యజాతిపడు మహాశ్రమకు ఫలమున్నదని సమర్థించును.

భక్తిమార్గము బ్రహ్మానందప్రేమల ననుభవములోనికిఁ దెచ్చును. బ్రహ్మాండమును ప్రేమించి యనుభవించువాఁడు సగుణేశ్వరుఁడని నిరూపించును. బ్రహ్మాండమప్పు డీశ్వరవిలాసమనితోచును. అట్టి విలాసమునకు మనుష్యజీవిత మంత్యస్థితి. ఆత్మ తిరోధానములకు నాత్మ ప్రత్యక్షములకు స్థానము. భక్తియోగము సాధారణ మానుష జీవిత సంబంధముల రాగములతో నింపియన్నిటి నుపయోగించుకొనును. వానిని యస్థిరమగుఁ బ్రాపంచిక విషయముల కుపయోగించక సర్వసౌందర్యప్రేమానందభరితుని కొఱకు వినియోగించును. ఈశ్వరసంబంధములు తీవ్రముగా వృద్ధియగుటకుఁ బూజలు ధ్యానములు జరుపఁబడుచున్నవి. భక్తియోగమునకు సమస్తరాగములు పనికివచ్చును. తీవ్రమగు క్రోధముసహితము ముక్తినిచ్చునని

చెప్పఁబడినది. ఈయోగము సహితము ప్రపంచవిముఖత్వము కలిగించి ప్రపంచాతీతునందే తదేకధ్యాస నిల్పుచున్నది.

ఇందుసహితము వ్యష్టిఫలమే కలుగకపోదు. ఈయోగము తెచ్చు మొదటివిశేషమేమనగా నీశ్వరప్రేమయొక్క విలాసము జీవేశ్వర సంబంధమందు మాత్రమేగాక భక్తులలోఁ బరస్పరపూజలయందుఁ బరస్పరానురాగములయందు వ్యక్తమగుచున్నది. రెండవ విశేషమేమనగా నీశ్వరప్రేమయొక్క విలాసము మనుష్యులందే గాక సమస్తజంతుజాలములందు గ్రహింపఁ బడుచున్నది. ధారాళముగా నభ్యసింపఁ బడెనేని యీయోగము మానుషరాగముల నింద్రియముల రసగ్రహణముల నీశ్వరస్థితికి లేవనెత్తును. విజ్ఞానమిచ్చును. మానవజాతి ప్రేమానందములకొఱకుఁ బడుపాట్లు న్యాయమని సమర్థించును.

కర్మమార్గము పరమేశ్వరేచ్ఛకు సర్వమానుష కార్యముల నర్పించును. అహంకార శూన్యముతో నహికఫలాపేక్ష రాహిత్యముతో స్వార్థపరత్వత్యాగముతోఁ గర్మమార్గము ప్రారంభమగును. ఇట్టి త్యాగముచేఁ గర్మమార్గము, మనకర్మల నిజముగాఁ జేయునది బ్రహ్మాండ మహాశక్తియనియు, నట్టిశక్తినమేతుఁడగు నీశ్వరుఁడు కర్మలనియామకుఁడనియు, జీవుఁడు పైవేషమనియు, నిమిత్తమాత్రుఁడనియు వ్యక్తిగల కర్మస్థానమనియుఁ బ్రబోధ కలుగుటకు మనోచిత్తముల శుద్ధిచేయుచున్నది. ఈబ్రహ్మాండశక్తికి, నీయీశ్వరేచ్ఛకుఁ గర్మనిష్క్రియ నిరూపణ మాధీనమై యున్నది. మనకర్మలు కర్మఫలములు తుదకుదాని కర్పింపఁ బడుచున్నవి. దృశ్యమాన ప్రపంచమందు జీవునకుఁగల బంధవిమోచనమే దీనియుద్దేశము. గర్మయోగ మితర యోగములవలె దృశ్యమాన ప్రపంచ బంధ ముక్తిగావించి పరమునొందింప నుపయోగఁ బడుచున్నది. ఇందుసహితము వ్యష్టిఫలావశ్యకత లేకపోలేదు. సర్వశక్తులలో సంభవములలో వృత్తులలో నీశ్వరునిఁగాంచుటయు, స్వతంత్రుఁడహంకార వర్జితుఁడగు జీవుఁడు బ్రహ్మాండ కార్యములలోఁ బాలుగొనుటయుఁ

గర్మయోగోద్దేశమై యున్నది. ఇట్లాచరింపఁబడిన కర్మయోగము మానుషచిత్తమును నీశ్వరస్థితికిఁ దెచ్చును. విజ్ఞానమిచ్చును. మానుషజాతి స్వాతంత్ర్యమునకై మనుష్యపరిపూర్ణత్వమునకై పాటుబడుచున్న మహాశ్రమను సమర్ధించును.

ధారాళదృష్టి కీత్రివిధమార్గము లొక్కటే. దివ్యప్రేమ, పూర్ణపరిచితము వలనఁ బ్రేమింపఁ బడువస్తువుయొక్క పూర్ణజ్ఞానమిచ్చును. అందుచే నది జ్ఞానమార్గమగుచున్నది. ఈశ్వరసేవ కలిగించుటచే నది కర్మమార్గమగుచున్నది. అదేవిధమున పూర్ణజ్ఞానము పూర్ణప్రేమానందములఁ దెచ్చును. తెలుసుకొనబడినయీశ్వరకార్యవిధానము నంగీకరింపఁ జేయును. అతనియందుఁ బూర్ణప్రేమపుట్టుటచే, నతని కార్యకరణ మెట్టిదో వ్యక్తమగుటచే, సర్వకర్మ లతని కర్పింపఁ బడును. ఈత్రయీమార్గమున వ్యష్టిసమిష్టి రూపుఁడైన నీశ్వరునియొక్క యఖండజ్ఞాన ప్రేమసేవలు కలుగుచున్నవి.

# యోగసంకలనము.

## ఉపోద్ఘాతము.



### విధానసంకలనము.

ప్రతియోగమతము చిక్కగానుండు మానుషాంశములతో సంబంధించి, యట్టి యంశములకు సాధ్యమగు మహోన్నత్వముల వెలిబుచ్చఁ బ్రయత్నించుటచే, ధారాళమగు సర్వవిధానసంకలనము వలనఁ బరిపూర్ణయోగము సిద్ధించును. కాని వానిస్వభావములలో నిరాశ, విధానములలోఁ బహుళత్వము, భావములలోఁ జిరకాల విరోధముండుటచే సంకలనము సులభసాధ్యముకాదు.

విచక్షతలేక మతములఁ గలపినఁ గల్లోలమేకాని సంకలనమేర్పడదు. విధానభారము శ్రమయిచ్చుటచే మన స్వల్పశక్తులకుఁ

కొద్దిపాటి యీజీవితకాలములో వేఱువేఱుగా మతముల నభ్యసించుటకు వీలులేదు. కొన్నివేళల హఠయోగము రాజయోగము వేఱువేఱుగా నభ్యసింపఁ బడుచున్నవి. విచిత్రమగు రామకృష్ణ పరమహంసుని జీవితమునఁ బ్రపిద్ధమమునసే దివ్యజ్ఞానప్రాప్తికై సరాసరి నడచుచు మోక్షమును బలాత్కారముగాఁ బరిగ్రహించు నట్టిమహత్తరమైన విజ్ఞానశక్తి కనుపించెను. అంతటనొక విధానానంతరము మఱియొక యోగమవలంబించి యతిశీఘ్రకాలములో వాని నిజతత్త్వము గ్రహించి, భక్తిచేత నంతర్జనిత విజ్ఞానమును వివిధానుభవములోఁ బ్రవేశపెట్టుటచేతను స్వభావసిద్ధజ్ఞానముయొక్క యప్రయత్న విలాసముచేతను ద్వైతజ్ఞానానుభవముల నొందినాఁడు. అట్టి వానిఁ బ్రమాణముగాఁ బుచ్చుకొనుటకు వీలుపడదు. అది ప్రత్యేకోద్దేశము కలది. ఆ మహానుభావుని యసమానమైన గొప్పయను భవముచే మనుష్యజాతి కిప్పుడత్యావశ్యక మైనట్టియు, మతశాఖాభేదములచే భిన్నమైన ప్రపంచము దేనికొఱకు శ్రమపడుచున్నదో యట్టిసత్యము (అనగా శాఖోపశాఖలు పరిపూర్ణసత్యములయొక్క భిన్నరూపములనియు, వివిధశిక్షలుత్తమోత్తమానుభవదాయకములనియు,) స్థాపింపఁబడెను. మనకు ముఖ్యము "ఈశ్వరుని దెలిసి కొనుట, యగుట, పొందుట." ఇది తక్కినవాని నన్నిటిని దెచ్చును. ప్రయత్నించి మనము పొందవలసిన దిదియొక్కటే. దీనిఁ దెచ్చుకొంటిమా యీశ్వరేచ్ఛాను గుణ్యముగాఁ దక్కిన రూపావిర్భావములు కలుగుచున్నవి.

మనమనుకొన్న సంకలనము సర్వమతముల నూరకే కలుపుటచేతను, గ్రమముగ నొకటితరువాత నొకటియభ్యసించుటచేతను గలుగనేరదు. యోగశిక్షల బహిరాకారముల నిరాకరించి వాని సర్వసామాన్యమగు ముఖ్యరహస్యమును గ్రహించుటచే సంకలనము స్థాపింపఁబడుచున్నది. యోగవిధానముల స్వభావవిధానముల మొదట మనము పరిశీలించి పరీక్షించినపుడు మనకున్న యుద్దేశమిదియే. ఇప్పుడు తిరిగి దానినే స్థాపింపసాహసింతము.

# V

స్వతస్సిద్ధ సంకలనముగల, స్వభావశక్తి యుక్తమగు నొక ప్రసిద్ధయోగపద్ధతి ప్రస్తుతము హిందూదేశమందుఁ గలదు. అది ప్రత్యేక యోగము. ఇతరయోగ మతముల సంకలనము కాదు. దానిని తంత్రమార్గమందురు. అందలికొన్ని విధానములు తాంత్రికులు కానివారికిఁ దంత్రమార్గమం దపనమ్మిక పుట్టించినది. ముఖ్యముగా వామమార్గమను భాగము పాపపుణ్యముల నతిక్రమించి, వానికిమారుగా ధర్మమునుస్థాపించక, నీతిబాహ్యమైన యాత్మ భోగములయందుఁ బరిణమించెను. కాని మొదటతంత్రము నిజమైన భావముపైఁ గొంతమట్టుకేర్పడిన మార్గమే. దక్షిణమార్గము వామమార్గము దాని రెండుభాగములు పూర్ణానుభవముపై నేర్పడినవే. దక్షిణ వామశబ్దముల కర్థము ప్రాచీన యంతరార్థమునుబట్టి జ్ఞానమార్గమని యానందమార్గమని చెప్పవచ్చును. జ్ఞానమార్గమున మనుష్యస్వభావము తనశక్తుల భూతముల నంతస్థభావములఁ బరిశీలించి స్వాతంత్ర్య మొందుచున్నది. ఆనందమార్గమున మనుష్యస్వభావము తనశక్తుల భూతము లనంతస్థభావముల ననుభవించి సంతోషించుటచే స్వాతంత్ర్య మొందుచున్నది. తుదకీ రెండుమార్గములు నిజతత్త్వమును గోలుపోయి వికారమొంది పడిపోయినవి.

ఐనప్పటికిఁ బ్రస్తుతవిధానముల నభ్యాసమువదలి ముఖ్యాంశమునకై వెతకితిమా వేదోక్తయోగ విధానములకన్నఁ దాంత్రికవిధానము వెలినిగ్రహించగలము. మనమింతవరకుఁ బరిశీలించిన మతములు వేదాంత సంబంధములు. వానియాధిక్యత జ్ఞానమందున్నది. వానివిధానము జ్ఞానవిధానము. అట్టిజ్ఞానము బుద్ధికి గోచరింపకపోయినను హృదసంబంధియై భక్తిరూపముననో చిత్తసంబంధియై కర్మరూపముననో యుండవచ్చును. వీనికన్నిటిలో యోగేశ్వరుఁడు పురుషుఁడు. అతఁడు జ్ఞానాత్మ, సర్వజ్ఞుఁడు, ద్రష్ట, పరిపాలకుఁడు తంత్రమందీశ్వరి ప్రకృతి. అదిస్వభావాత్మ, శక్తి, పనిచేయుచున్న నిచ్ఛాశక్తి. అట్టియిచ్ఛాశక్తియొక్క మర్మములను, విధానములను, దంత్రములను, దెలిసియుపయోగించితాంత్రికయోగినిగ్రహముపరిపూర్ణత్వము విమోచనము స్వాతంత్ర్యము పొందఁగలఁడు. స్వభావ సృష్టియం

దున్నఁ గష్టములకు వెఱగుపడి పాఱిపోక వానినెదిరించి, పట్టి, జ యించును. కాని తుదకుఁ బ్రకృతిస్వభావమువలెనే తాంత్రికయోగ ము నిజతత్త్వమును మఱచి పడిపోయినది. దాని మొదటి విశుద్ధభా వము నశించినది. ఇప్పటికి దానిరహస్య విధానములఁ గ్రమముగా నాచరించిన శక్తిదాయకము లే.

శక్తిపూజ సర్వసిద్ధులకు ముఖ్యమని తాంత్రికభావమును బట్టి కొంత నిజముమట్టుకే మనకు తేలుచున్నది. వేదాంతభావమునుబట్టి శక్తి భ్రమయనియుఁ బ్రశాంతనిర్వికార పురుషుని వెదకుటే యీ శక్తినుండి తప్పించుకొనుట తద్విరోధభావము మనకుఁ దేలుచున్నది. కాని పరిపూర్ణభావమునుబట్టి జ్ఞానాత్మ (Conscious soul) యీ శ్వరుడనియు, స్వభావాత్మ (Nature soul) పనిచేయుచున్న యీశ్వరశక్తియనియుఁ దేలుచున్నది. పురుషుఁడు సత్తనఁబడును. సత్తనగా శుద్ధమై యనంతమై వ్యక్తిగల స్వాయంభువత్వము. ప్రకృతి (శక్తి) చిత్తనఁబడును. చిత్తనగా నాపురుషుని శుద్ధమై యనంతమై వ్యక్తిగల, స్వాయంభువత్వము యొక్క మహా త్మ్యము. ఈ రెంటికి సంబంధము విరుద్ధములగు క్రియా నిష్క్రి యలందున్నది. స్వాయంభువుఁడనను జ్ఞానజనితానందమందు శక్తిలీ నమైనప్పుడు నిష్క్రియత్వము వచ్చును. పురుషుఁడు తనశక్తియొక్క క్రియారూపమునఁ బ్రహించినప్పుడు క్రియజరుగుచున్నది. అదే సృష్టి. అదేయగుటవలన వచ్చినయానందము. ఆనందమే సృజించున దియు, సృష్టిని యనుభవించునది యైనయెడల దానివిధానము తప స్సు. పురుషుని జ్ఞానబలము తనయనంత సామర్థ్యస్థితియందు లగ్న మై సత్యసంకల్పముల (విజ్ఞానమును) పుట్టించుటే తపస్సు. ఆసత్య సంకల్పములు సర్వజ్ఞత్వ సర్వశక్త్యత్వముగల స్వాయంభువత్వము నుండి పుట్టుటచే సంసిద్ధిపొందక తప్పవనినమ్మకము కలదు. మనః ప్రాణస్థూలరూపమునఁ బరిణమించుట వానికిధర్మమని నమ్మించును. తపస్సునకుగలఁ సర్వశక్తిత్వము సంకల్పము తప్పక సంసిద్ధిగాం చుట యను విషయములు సమస్త యోగములకుఁ బునాదులు. మనుష్యులందు వీనిని చిత్తము (Will) భక్తి (faith) యందురు.

# V

ఈచిత్తము జ్ఞానపదార్థమగుటచేఁ దనంతటఁదా ఫలదాయకము. ప్రత్యక్షమున కింకను గోచరముకాని సత్యసంకల్పము స్వల్పజ్ఞానమందుఁ బ్రతిఫలించుటే యీభక్తి, "యోయచ్ఛ్రద్ధస్సఏవసః." (మనుజునకు దేనియందు భక్తికలదో దేనిని దృఢముగా సంకల్పించునోయది యగుచున్నాఁడు) యను గీతావాక్యమున కిదియర్థము.

యోగ మనుభవసిద్ధమగు మానసిక శాస్త్రమునకన్న (Psychology) వేఱుకానందున మానసిక శాస్త్రానుగుణ్యముగా మనము మొదట దేనిని ప్రారంభించవలసియున్నదో స్వభావము యొక్క యాయుద్దేశమును దెలుసుకొనుచున్నాము. అది శక్తిమూలమునఁ బురుషుఁడొందు యాత్మసంసిద్ధి. కాని స్వభావముయొక్క వని యుత్తమాధమమని ద్వివిధము. వానినే దివ్యము దివ్యేతరమందురు. ఈభేదము నామమాత్రమే. దైవేతరమన్నది లేనేలేదు. స్వభావమందన్ని వస్తువులున్నవి. దైవమందు సమస్తవస్తువులున్నవి. కాని వ్యవహారార్థమీభేద మంగీకరించవలెను. దేనిని మనమెఱుగుదుమో, యేది మనలోనమ్మకము మారునంతవరకుండునో యాయధమస్వభావము (Lower Nature) జ్ఞానయుక్తమై తుదకు భిన్నమై హద్దులలోఁబడి యహంకారము నొందుచున్నది. మనముపొందఁగోరుచున్న యుత్తమస్వభావము (Higher Nature) విభాగముల హద్దులవిడచి జ్ఞానయుక్తమై దివ్యజీవితమునొందుచున్నది. అధమమునుండి యుత్తమమునకుఁ బోవుదారి యోగమార్గమనఁబడును. అధమస్థితిని త్యజించి యుత్తమస్థితిలోనికి తప్పించుకొనుటచే నీమార్గము సిద్ధించవచ్చునని సామాన్యముగా నందఱనుకొనుచున్నారు. కాని యధమస్థితిమాఱి యుత్తమమునకు లేవనెత్తబడుట వలన సహితమీ మార్గము సిద్ధించును. పరిపూర్ణయోగోద్దేశమిది.

ఈ రెండు విధానములందు నధమస్థితియందున్న నేదోయొక దానిమూలముననే యుత్తమస్థితికి మనమెక్కవలసియున్నది. వివిధ యోగములు వివిధనిర్గమ మార్గములు కలిగియున్నవి. ఆవి యధమ స్వభావవృత్తులఁ గొన్నిటిని ప్రత్యేకముగా నెన్నుకొని

వానిని యీశ్వరునివైపునకుఁ ద్రిప్పుచున్నవి. కాని మనలో జరుగుచున్న స్వభావముయొక్క సాధారణకార్య విధానము పరిపూర్ణ బహుముఖత్వము కలది. ఆకార్య విధానమందు మనతత్వములు చుట్టు యావరణమును మార్చుచున్నవి. ఆవరణముచే మార్చఁబడుచున్నవి. సమస్తజీవితము స్వభావముయొక్క యోగమైయున్నది. మనము వెతుకుచున్న యోగముస్వభావముయొక్క సంపూర్ణ కార్యమై యుండవలెను. స్వభావము ననుసరించు సాధారణమనుష్యునకును యోగికిని భేదమేమనగా, యోగి భిన్నత్వముతో నహంకారముతోఁ బనిచేసెడు నధమస్వభావముయొక్క సంపూర్ణకార్యమునకు మారుగా, నేకత్వముతో దేవునితోఁ బనిచేయు నుత్తమ స్వభావముయొక్క నంపూర్ణకార్యమును దెచ్చి పెట్టుకొనుటకుఁ బ్రియత్నించుచున్నాఁడు. మనయుద్దేశ్యము ప్రపంచమునుండి తప్పించుకొని దైవమువద్దకుఁ జేరుటమాత్రమేయైన యోగసంకలన మవసరములేదు. అది కాలహరణము. ఏలనన దైవసాన్నిధ్యమొందించు ననంతమార్గములలోఁ నొకదానిని గనిపెట్టుటే మనకప్పుడు ముఖ్యమై యుండును. కాని మనబహుముఖ స్థితిని దేవుని స్థితిలోనికి మార్చుటే మనయుద్దేశ్యమైన యోగసంకలనము కావలసివచ్చును.

మన మలబించవలసిన పద్ధతియేదనగా వ్యక్తిగలమనస్థితికంతకు దైవ స్పర్శసంబంధములఁగలిగించవలెను. మనసమస్తస్థితిని తనలోనికిమార్చుటకు దేవుని మనలోనికిఁబిలువవలెను. ఒకయర్ధమందప్పుడు మనలోనున్న నిజమైన పురుషుఁడగు దేవుఁడే సాధనమునకు సాధకుఁడు యోగమునకు సర్వాధికారి యగుచున్నాఁడు. అతనివలన నధమస్థితి మార్పునకు మూలస్థానముగాఁ స్వకీయ పరిపూర్ణత్వమునకు సాధనముగాఁ జేయఁబడుచున్నది. తపోబలమనెడు మనలోని జ్ఞానశక్తిదివ్య స్వభావముయొక్క సంకల్పమందు లగ్నమై యాత్మజ్ఞానమిచ్చుచున్నది. సర్వజ్ఞుఁడు సర్వశక్తుఁడగు నీశ్వరుఁడు భిన్నములోనికిదిగి సమస్తాధమ స్వభావమును శక్తిసమేతముగాఁ జేసి మానుషవ్యక్తి క్రియలకుమారుగాఁదనక్రియలఁ బొందుపరుచు చున్నాఁడు.

# V

మానసికశాస్త్రమునుబట్టి యీవిధాన మహంకార జీవుఁడు తనకున్న సమస్తసాధనసంపత్తితో వృద్ధిఁగొలుకు ననంతకర్తృఁడగు నీశ్వరునకు లోఁబడుటయును మార్పు దెచ్చుచున్నది. ఇది దగ్గిరమార్గముకాదు. సులభసాధ్యము కాదు. దానికి మహత్తరమైన నమ్మకముకావలెను. సంపూర్ణధైర్యము తీవ్రమైన యోర్పుయుండవలెను. అందు మూఁడు సోపానములు కలవు. అంత్యసోపాన మందుమాత్రమే సంపూర్ణానంద మున్నది. అది విపులము పరిపూర్ణ మగు నీశ్వర సాన్నిధ్య మొందుటకు జీవుని ప్రయత్నము. ఉత్తమస్వభావమును బొంది, తుదకు మార్పుఁ జెందుటకై దైవప్రేరణచే నధమస్వభావముచేయుచున్న గాఢప్రయత్నము. ఈశ్వరశక్తి గోచరముగాక, దాగి మన యశక్తతకు మారుగాఁ దానిలచి మననమ్మకము ధైర్యము క్షీణించినపుడు కాపాడుచున్నది. అది గ్రుడ్డివారికి దృష్టి కుంటివారికి పర్వతోల్లంఘనశక్తి నివ్వఁగలదు. మనకుఁ దోడ్పడి సహాయమొసగు ధర్మ మున్నదని బుద్ధికి వ్యక్తమగును. పడిపోకుండ మనలఁ బట్టి మనకుఁ బ్రభువు, మనుజునకు స్నేహితుఁడు సృష్టికిఁ దల్లిగలదని హృదయమునకు గోచరించును. కాబట్టి యీమార్గము బహు కష్టసాధ్యమైనది. దానికిగల యుద్దేశ్యప్రయత్న పరిమాణముతోఁ బోల్చిచూచిన మిక్కిలి సులభమైనది. నిస్సందేహమైనది.

అధమస్వభావమును మార్చప్రయత్నించునపు డీయుత్తమస్వభావకార్యమునకు మూఁడు లక్షణములున్నవి. మొదటి లక్షణము, ప్రత్యేక యోగవిధానము లందువలెనుత్తమస్వభావము క్రమానుగుణ్యమగు స్థిరపద్ధతిని పనిచేయక, మనుష్యునిస్వభావమును బట్టి యొకవిధమైన స్వేచ్ఛతోఁ, గ్రమవృద్ధిగల తీవ్రతతోఁ బనిచేయుచున్నది. ఒకయర్థమం దీమార్గమున నెవరియోగవిధానము వారిదే. కాని యందఱకు సమానముగాఁ బనికివచ్చు ధారాళమైన విధానములు దీనికిఁ గొన్నికలవు. అవి మామూలు క్రిందకువచ్చు పద్ధతినేర్పరుచుటకుఁ గాక యొకవిధమైన సంకలనయోగశాస్త్రము నేర్పరుచుటకు శక్తినిచ్చుచున్నవి.

రెండవ లక్షణ మేదియనగా నీవిధానము పరిపూర్ణావిధాన ముగనుక పరిణామముచే మున్నేర్పడిన స్వభావమునున్న దానినున్న ట్లంగీకరించి, ముఖ్యాంశముల విడనాడక సర్వమును దివ్యమూర్పు నొందించును. మనలోని సమస్త మీామహత్తరమైన శిల్పిచేస్వీకరిం పఁబడి, ప్రస్తుతమేది యస్పష్టముగాఁ బ్రదర్శింపఁ బడుచున్నదో యది నిర్మాంవిగ్రహముగా మార్పఁబడుచున్నది. సదా వృద్ధిజెందుచు న్న యాయనుభవమందీ యథమస్వరూపమెట్టిదో తెలియఁబడుచు న్నది. అందు సమస్తమెంత వికారము స్వల్పముతుచ్ఛమై పైకిఁ గానుపించినప్పటికి నీశ్వరస్వభావ సమరసమందొక వికారమొందిన యసమాపక కార్యముగాఁ దోచును. కమ్మరి తనకొలిమిలో ముత కలోహమును మించనూదునట్లు మనపూర్వులు దేవతల నిర్మించిర ను వేదఋషులు చెప్పినదాని కర్థమిదే యని తెలుసుకొనుచున్నాము.

మూఁడవ లక్షణ మే దనగా నీశ్వరశక్తి సమస్తజీవితమును బూర్ణయోగమునకు సాధనముగా నుపయోగించును. సమస్తానుభవ ము, ప్రపంచావరణముతో వెలి సంబంధ మెంత హీనమైనను, విషా దకరముగానున్నను, బనికివచ్చును. ప్రతియంతరానుభవ మెంతయు ధఃపతనముగాని, సహింపరాని దైన్యముగాని,పరిపూర్ణ మార్గమునకు సోపానమగుచున్నది. మనము కళ్లుతెఱచినపక్షమునఁ బ్రపంచ మం దీశ్వరవిధానము, హైన్యమందాతని ప్రకాశత, బలహీనతయందా తనిశక్తి దుఃఖమంచాతని సంతోషము కనిపెట్టుదుము. ఉత్తమాధ మకార్యకరణమం దీశ్వరవిధానము సమమనిఁ తెలియఁగలము. అధ మకార్యకరణమందిది మంనమై తెలియఁబడక నవ్యక్తస్వభావానుగు ణ్యముగ నవలంబింపఁ బడును. ఉత్తమకార్య కరణమం దదిస్వకి యజ్ఞానము కలిగి (Self conscious) తీవ్రతనొందుచున్నది. సమస్త జీవితము దేవుని తనలోఁ బ్రత్యక్షము జేసుకొనుటకుఁ జేయఁబడు స్వభావముయొక్క యోగమైయున్నది. ఏస్థితి యందీ ప్రయత్న మాత్మజ్ఞాన పరిపూర్ణత్వ మివ్వఁగలదో యట్టి స్థితిని యోగము తెలుపుచున్నది. క్రింది సర్గమందు చెల్లాచెదరై కలియనట్టి విషయ ము లనేకముగఁ జేర్చి తదేకాగ్రతను బొందించుటే యీాయోగము.

పరిపూర్ణవిధానము పరిపూర్ణ ఫలమిచ్చును. మొదటపూర్ణమైన యీశ్వరజ్ఞానము కలుగవలెను. విమర్శింపశక్యము కాని విషయిక జ్ఞానమేగాక, దాని పూర్ణజ్ఞానమున కత్యావశ్యకమైన బహువిధాకార విషయికజ్ఞానము సహితముండవలెను. ఆత్మయందే కత్వజ్ఞానమేగాక యనంతవృత్తులఁ బ్రపంచముల భూతములం దేకత్వజ్ఞానముసహితము కలుగవలెను.

గనుకనే భిన్నత్వమందు ద్వంద్వములయందు సహితము స్వాతంత్ర్య మివ్వఁ జాలిన సాయుజ్యముక్తియనఁబడు, వ్యష్టిజీవుని సర్వాంగములకు నీశ్వరస్పర్శ మెడతెగక గలిగించునట్టి స్వాతంత్ర్యమేగాక సచ్చిదానందమందు సమస్తజ్ఞానస్థితి యీశ్వరునితో సమానస్థితికి వచ్చుటయను సాలోక్యముక్తియేగాక, ప్రధమస్వభావ మీశ్వరాకారముగా మారుటయను సాధర్మ్య ముక్తిసహితము వచ్చిన నది పరిపూర్ణముక్తియగుచున్నది. అన్నిటికి తుదిముక్తియేదనగా నస్థిరమగు నహంకార బంధమునుండి వ్యక్తిని తప్పించి, ప్రపంచమందు వ్యష్టిమానవునందు సమానముగా నున్నట్టియుఁ బ్రపంచములోఁ ప్రపంచమునకు వెలిని యేకముగా నున్నట్టియుఁ బురుషునితో నైక్యమగుట.

ఇట్టి పూర్ణజ్ఞానస్వాతంత్ర్యములచే భక్తియోగజ్ఞానములకుఁ బూర్ణసమరస మేర్పడును. ఎందుచే ననగా నహంకారబంధము పూర్తిగా వదలి పోవును. అన్నిటిలోన నన్నిటికి వెలినియుండు నద్వితీయునితో నేకత్వము కలుగును. సంసిద్ధి సిద్ధినొందుచున్న జ్ఞానమునకుఁ బ్రతిబంధకము కానందున యానందమందే కత్వము, భక్తి యందు సమరసబహుళత్వము పొందుచున్నాము. భగవంతునితో నేకత్వ మొందిననున్నతస్థితియందు సహితము విలాసచర్యతో సంబంధము సాధ్యమైయుండును. అట్టి ధారాళత్వముచే జీవయాత్రను విడువనవసరము లేకనే జీవయాత్రనడుపుచున్నను స్వాతంత్ర్యమొంద గలుగుటవలన, యహంకారములవదలి ప్రపంచముపై వర్షింపఁబడు

నీశ్వరకార్యమునకు మనశరీరమానసముల ద్వారములఁ జేయు చున్నాము.

ఈశ్వరస్థితి స్వతసిద్ధముగా స్వేచ్ఛకలదేగాక, పవిత్రత, యానందము, పరిపూర్ణత్వము కలది. మన యందీశ్వరుని ప్రతిఫలించునట్టియు, జీవితరూపమున సత్యధర్మముల వర్షించునట్టియుఁ బూర్ణపవిత్రత పరిపూర్ణ ముక్తికి హేతువగుచున్నది. దానిఫలము పరిపూర్ణానందము (కటాక్షము). అట్టి కటాక్షమందీశ్వరుని విగ్రహములనఁబడు నీసమస్తమందున్న యానందము, ప్రపంచాతీత యానందము సాధ్యమగును. మానుషత్వమందుఁ బ్రత్యక్షమగుచున్న నీశ్వరజాతియే యనునట్లు మనుష్యజాతికి సంపూర్ణ పరిపూర్ణత్వమొసగును. ఇదిస్థితి ప్రేమానందములపై జ్ఞానవిలాసముపై నాధారపడి యున్నది. అది పూర్ణయోగమువల్ల సహితము కలుగుచున్నది.

స్థూలమానసిక పరిపూర్ణత్వముసహితము పరిపూర్ణమందిమిడియున్నది. గనుకరాజహఠయోగసిద్ధులుతుదకుమనుష్యజాతిపొందఁగల పెద్దసంకలన ధర్మమందిమిడియుండవలెను. ఎట్టైన యోగముచే మనుష్యజాతి యేమనశ్శరీరసామర్థ్యానుభవ వృద్ధులఁబొందునో తత్సర్వ మీపరిపూర్ణానుభవమందిమిడియుండవలెను. స్థూలమానసపరిపూర్ణజీవితమున నుపయోగపడని పక్షమున వీనిచేఁ బ్రయోజనము లేదు. అట్టి స్థూలమానస పరిపూర్ణజీవిత స్వభావమెట్టి దనగా స్థూలమానసిక విలువలలోనికి విజ్ఞాన స్థితి పరివర్తన మొందుట. ఈవిధమున స్వభావముయొక్క త్రివిధసోపాన సమ్మేళనము, స్వభావము నిర్మించుకొనుచున్న త్రివిధ మానుష సమ్మేళనము మనకుఁగలుగుచున్నది. మూలసాధన మగు స్థూలజీవితమును, మధ్యసాధనమగు మానసిక జీవితమును, విముక్తిగాంచిన మనస్థితిలోనికిఁ బరిపూర్తి మొందిన కార్యవిధానములోనికిఁ జేర్పఁ గలము.

మనము పొందఁ గోరుచున్న పరిపూర్ణత్వము, వ్యష్టిజీవునందే మన మిమిడియున్న యెడల సాధ్యము కాదు. ఈశ్వరపరిపూర్ణత్వమనగా వ్యష్టిసమిష్టి ద్వారములఁ బ్రేమయందు జీవితమందు మనస్థితి

యందు మనలఁ దెలుసుకొనుటే. కాబట్టి మన మొందిన స్వాతంత్ర్య మితరులకు వ్యాపింపఁ జేయుట ముక్తికిఁ బరిపూర్ణత్వమునకు నావశ్యకము. అట్లు స్వాతంత్ర్యము వ్యాపింపఁ జేయుటకై యెడ తెగకఁ జేయఁబడు ప్రయత్నము మనుష్యజాతియొక్క పరిపూర్ణస్వాతంత్ర్య సంసిద్ధి కుపయోగపడును.

ఇట్టి విపులవిజ్ఞాన పరిపూర్ణత్వముచే సర్వసాధారణమైన స్థూలజీవితమును, మనుజుఁడు తనయొక్క జాతియొక్క మానసన్యాయవృద్ధికై చేయు ప్రయత్నమును దివ్యముగా మార్చుటే వ్యష్టి సమిష్టికార్యమునకు ముఖ్యము. అట్టి పరిపూర్ణత్వమంత స్థితస్వర్గ రాజ్యమును బహిర్గత స్వర్గరాజ్యముగాఁ బునర్నిర్మాణ మొనరించుటే. ప్రపంచమందున్న సర్వమతములు చిరకాలమునుండి పలు విధముగాఁ జెప్పుచున్న స్వప్నము సిద్ధించుటే.

విపులమగు పరిపూర్ణసంకలనము మనుష్య జాతియందు దాగి నివశించియున్న యీశ్వరుని యెవరిదృష్టి చూడఁగలదో వారి కర్తవ్యమైన ప్రయత్నమై యున్నది.





# యోగసంకలనము.



## మొదటిఅధ్యాయము.



## సాధనచతుష్టయము.



యోగసిద్ధి సాధనచతుష్టయముచే సంపాదింపఁ బడును. (1) శాస్త్రము (2) ఉత్సాహము (3) గురువు (4) కాలము సాధనచతుష్టయమనఁబడుచున్నవి. ప్రతిమనుజుని హృదయమందు దాగియున్న నిత్యమగు వేదరహస్యమే పూర్ణయోగమున కుత్తమశాస్త్రము. నిత్యజ్ఞానపరిపూర్ణపద్మము మనలో ముకుళించి యున్నది. ఎప్పుడు మానసము నిత్యమగు దానిని వెతుకుచున్నదో, యెప్పుడు హృదయము భిన్నాకారములఁ దగిలి బంధింపఁబడక ననంతునికొఱకు విరాళిఁ జెందుచున్నదో యప్పుడు క్రమానుసంధానముచేఁ ద్వరలో నొక దళము తరువాత నొకదళము విచ్చుచున్నది. తదాదిగా సమస్తజీవితము, యోచన, సామర్థ్యవికాసములు, సర్వానుభవములు, జీవుని బంధములఁ ద్రెంపుచు నంతరాయములఁబోఁగొట్టు యాందోళనములగుచున్నవి. అనంతు నెన్నుకొనువాని ననంతుఁ డెన్నుకొనుచున్నాఁడు. ఏదిలేకున్నఁ బ్రబోధకలుగదో జీవుఁడు వికాసమొందఁడో యట్టి యీశ్వర సంస్పర్శవానికి రాఁగలదు. అదియొకసారికలిగిన

సిద్ధి తప్పదు. మనుష్యున కొక జీవిత మందే యీజయము కలిగినఁ కలుగవచ్చును. వర్తమాన సృష్టిలో జీవుఁడు నిలుచు వివిధస్థానములం దోర్పుతోఁ బ్రయత్నించుటచేఁ గలిగినఁ గలుగవచ్చును.

జీవునియం దిదివఱకే లీనమై దాగియుండని యెట్టి జ్ఞానమును మనస్సునకు బోధచేయఁజాలము. వెలిమనుజునకు సాధ్యపడెడుసమస్త పరిపూర్ణత్వమం తర్గతజీవుని నిత్యపరిపూర్ణత్వమును దెలుసుకొనుటే. మన మీశ్వరుని దెలుసుకొనుచున్నాము. ఈశ్వరుఁ డగుచున్నాము. అంతర్యమున కిదివరకే మన మతఁడు. సమస్త ప్రబోధలు వెల్లడి కొఱకే. సమస్తసంభవములు వికసించుట కొఱకే. ఆత్మసంసిద్ధి యిందలి రహస్యము. ఆత్మజ్ఞానమే యందులకు సాధనము.

అట్టి వెల్లడి శృతశబ్ద మూలమునఁ గలుగుచున్నది. ఆమాట మనలోనే వినఁబడవచ్చును. వెలినుండి రావచ్చును. ఈరెండు విధములు దాగియున్న జ్ఞానమునకుఁ బనికల్పించు విధానములే. ఆలోపలిమాట సర్వజనహృదయ నివాసియగు జగద్గురునిమాటకావచ్చును. ఇతర గురువులతో నవుసరము లేనివారు కొందఱుదుగానుండిరి. ఏల ననగాఁ దక్కినయోగము తన్నిత్యస్పర్శవలన వికాసమొందును. జ్ఞానపద్మము హృదయపద్మ నివాసియొక్క దేదీప్యమానమగు శక్తిచే లోనుండి వికసించుచున్నది. లోనుత్పన్నమగు నాత్మజ్ఞానము చాలి బహిర్గురువుతోఁ బుస్తకములతో నవుసరము లేనివారు గొప్పవారె. వా రరుదు.

సాధారణముగా నీశ్వర ప్రతినిధియనఁబడు బహిర్వాక్య మాత్మవికాస కార్యమందు సహాయపడుట యావశ్యకము. అది ప్రాచీన వాక్యము కావచ్చును. లేక యధునిక గురువాక్యము కావచ్చును. అంతస్స్థిత శక్తిపుట్టి మేల్కొనుట కీప్రతినిధివాక్య మొక కారణమని కొందఱందురు. సర్వశక్తుఁడు సర్వవ్యాపకుఁ డగు నీశ్వరుఁడు ధర్మసూత్రము నిలుపుటకై దీని నంగీకరించెనని పరిగణింపఁబడుచున్నది. కృష్ణోపనిషత్తునందు దేవకీనందనుఁడు ఘోరఋషియొద్ద నుపదేశమంది జ్ఞానసిద్ధిగాంచినటులఁ జెప్పఁబడినది. అట్లే రామకృష్ణుఁడు ముఖ్య

ప్రకాశతను స్వప్రయత్నముచేతనే పొందినను, వివిధయోగాభ్యాసములకొఱకు ననేక గురువుల సేవించెను. కాని గురువులేనివిద్యకూడదను సూత్రమును బ్రతిపాదించుట కట్టుచేసెనని యతనిసంధానవిధాన వేగము తెలుపుచున్నది.

సాధకున కీప్రతినిధి బలమత్యావశ్యకము. ప్రాచీనయోగుల యనుభవపూరితమగు శాస్త్రముచే యోగము నడుపఁ బడునపుడు గురుని సహాయమువల్లగాని స్వప్రయత్నమువల్లగాని యోగమభ్యసించవచ్చును. ఎట్లైన నేర్పఁబడిన తత్త్వమును మననముఁ జేయుటచేతను, స్వానుభవములోని కట్టె తత్త్వమును దెచ్చుకొనుటచేతను, నిర్ణయింపఁబడిన విధానముల సంసిద్ధిచేతను యోగము వృద్ధిజెందుచున్నది. ఇది శ్రేష్టమైన యభ్యాసము కాదు. ఇదివరకు నడుపఁబడిన రాజమార్గమగుటచే క్షేమకరము-ఫలప్రదము.

శాస్త్ర మెంతధారాళమై మహత్తరమైనను బరిపూర్ణజ్ఞానముయొక్క కొంతభాగమునే దెల్పునని పూర్ణయోగసాధకుఁడు జ్ఞాపకముంచుకొనుట యావశ్యకము. అతఁడు శాస్త్రము ననుసరించవచ్చును. కాని శాస్త్రము గొప్పదైనను దానిచేఁ గట్టుబడకూడదు. పూర్ణమై, విపులమై, సర్వజనోపయోగమగు శాస్త్రమతనికి మిక్కిలి శ్రేష్టమగు ఫలమివ్వఁగలదు. అతనికి వివిధప్రబోధలఁ గలిగించుటకునుత్తమానుభవములఁ దెచ్చుట కది తోడ్పడవచ్చును. హిందువుల యాచార మనుసరించునేని వానియోగము వేదగీతోపనిషత్తులచే నడుపఁబడవచ్చును. లేక నితర మతగ్రంథముల తత్త్వానుభవమును తనవృద్ధికిఁ దోఁడుచేసుకొని ప్రాచీనుల యనుభవమందుత్తమమైన దానిచే భవిష్యత్తును సారవంతముచేయును. కాని తుదకు తానుపయోగించు వాక్యముయొక్క హద్దులనుదాటి తనజీవునియందే నివశించువాఁడు కావలెను. యోగి శబ్దబ్రహ్మను దాటవలెనని గీతలోఁ జెప్పఁబడియున్నది (శబ్దబ్రహ్మాతివర్తి). ఇదివరకు విన్నదాని నికవినబోవుచున్నదానిసహితము త్యజించవలెను (శ్రోతవ్యస్య శ్రుతస్యచ). యోగి యొకగ్రంథముయొక్క సాధకుఁడుగాని వివిధ

గ్రంథములయొక్క సాధకుఁడుగాని కాడు. అనంతముయొక్క సాధకుఁడు.

మతగ్రంథము లేగాక మఱియొక శాస్త్రమున్నది. అదియొక శాస్త్రకట్టు. విధానము. సాధకుఁ డేర్పరుచుకొన్న యభ్యాసయోగ మార్గము. ప్రతిమార్గమునకు శాస్త్రము కలదు. అది లిఖితమో యనుశ్రుతమో కావచ్చును. అట్టి లిఖితానుశ్రుతశాస్త్రములకు హిందూదేశమున గొప్ప గౌరవముకలదు. సమస్తయోగపద్ధతులు స్థిరపడిన శ్లైంచఁ బడుచున్నవి. గురువట్టి యనుశ్రుతశాస్త్రమును గ్రహించి యనుభవములోనికిఁ దెచ్చుకొని ప్రాచీనమార్గముల శిష్యుని నడిపించుచున్నాఁడు. నూతనాభ్యాసము క్రొత్తయోగబోధ క్రొత్త విధానము వచ్చినయెడల నది శాస్త్రానుగుణ్యముగా లేదనువాదము తఱుచు వినఁబడుచుండును. నిజమందుకాని యోగులయభ్యాసమందుఁ గాని యట్టికాఠిన్యము లేదు. ప్రారంభకున కుపయోగపడునట్టి యనేక శతాబ్దములనుండి స్థిరపడి క్రమస్థితిఁ గాంచినట్టి యనుభవజ్ఞానముల లిఖితానుశ్రుతశాస్త్రములు దెలుపుచున్నవి. అవి గొప్ప యుపయోగాధిక్యతలఁ గలిగియున్నవి. కాని వృద్ధికి మార్పులకు విశేష స్వేచ్ఛసాధ్యమై యున్నది. రాజయోగమువంటి శ్రేష్ఠమైన శాస్త్రముసహితము పతంజలి విధానమునకంటె వేఱుమార్గముల నభ్యసింపఁ బడవచ్చును. భక్తి యోగజ్ఞానములలోఁ బ్రతి మార్గము భిన్నభిన్నములై వేఱుమార్గముల గమ్యస్థానమునఁ గలుసుకొనుచున్నవి. యోగము దేనిపై నాధారపడియున్నదో యట్టి ముఖ్యజ్ఞానము స్థిరపడేయున్నది. కాని క్రమపద్ధతులు విధానములు విధులు మారవలసి యున్నవి. ముఖ్యధర్మము స్థిరపడియున్నను, ప్రతిమనుష్యుని స్వభావానుగుణ్యముగాఁ బ్రత్యేకయవసరములఁ దృష్టి చేయవలసి యున్నది.

పరిపూర్ణయోగము లిఖితానుశ్రుతశాస్త్రబద్ధముకాదు. అది ప్రాచీన జ్ఞానమును స్వీకరించి భవిష్యద్వర్తమానములకుఁ గ్రొత్తపద్ధతినివ్వఁ బ్రయత్నించుచున్నది. అనుభవమందుఁ బూర్ణస్వే

చ్ఛయు జ్ఞానమును గొప్పమాటలతోఁ దిరిగి చెప్పుటయుఁ బరిపూర్ణయోగ స్థాపనకు ముఖ్యములు. సమస్తజీవితమును దనలో నిమిడ్చుకొనఁ బ్రయత్నించుచుఁ, బూర్ణయోగము రాజమార్గమున బోవుచున్న యాత్రికునివంటిదిగాక, క్రొత్తగా నరణ్యమును ఛేధించి దారిచేయు మార్గాన్వేషి యనవచ్చును. ఏలనన, యోగము చిరకాలముక్రిందనే జీవితమునకు వెలియైనది. వేదకాలపు మనపూర్వులు దానికై యవలంబించిన ప్రాచీనపద్ధతులు మనకుఁ గడుదూరములు. అగమ్యములు. అసాధ్యములు. అప్పటినుండి యిప్పటికి బహుకాలము గడచినందున నాపద్ధతులకు నూతన ప్రారంభ మియ్యవలసి యున్నది.

ఈపూర్ణ యోగమందు మన మనంతుని వెతుకుటేగాక మనుష్య జీవితమందు వ్యక్తముకమ్మని యాయనంతుని వేడుదుము. మన పూర్ణయోగ శాస్త్రము ప్రతిగ్రహయోగ్యుఁడగు జీవునకు మితిలేని స్వాతంత్ర్యమున కవకాశమియ్యవలెను. ప్రతివ్యష్టి మానుజుఁడు సర్వవ్యాపకుని స్వయంప్రకాశుని తనలో స్వేచ్ఛతో నిమిడ్చుకొనుటే విజ్ఞానజీవితమునకు ముఖ్యవిషయము,

విధివిధానములు భిన్నలములైనకొలది సర్వమతములకు నైక్యత సంభవించునని తెలుపుచు నట్టి యేకత్వపరిపూర్ణత్వము ప్రతి మనుజుఁడు స్వయముగాఁ దన కొకమతము ప్రత్యేకము కలిగియున్నచో వచ్చునని వివేకానందుఁడు చెప్పియున్నాఁడు. మతశాఖలచే ననుశృతవిధులచే బద్ధుడు గాక యీశ్వరసంబంధములతోఁ దన స్వభావమును స్వేచ్ఛగా సంధానముచేయుటవలన నట్టి యేకత్వపరిపూర్ణత్వము రాగలదని సహితము చెప్పియున్నాఁడు. స్వభావమున తిక్రమించు దానికొఱకు నూర్ధ్వగతినొందుచున్న తనస్వభావము యొక్కవృద్ధికై పాటు బడుచుఁ, బ్రతిమనుష్యుఁడు తన స్వకీయమగు యోగమార్గమునే యనుసరించినప్పుడు పరిపూర్ణయోగసమాప్తి సిద్ధించును. స్వేచ్ఛయంత్యధర్మము. కడపటి పరిసమాప్తి.

ఈలోపున సాధకుని యభ్యాసభావముల నడిపించు సాధారణ మార్గములఁ గొన్నిటి నేర్పరచవలసియున్నది. ఈమార్గములు మామూలుకిరింద నాచరింపఁబడు స్థిరవిధానమును స్థాపించక, వృద్ధి ప్రియత్నములకుఁ బనికివచ్చు సాధారణపద్ధతుల, సాధారణధర్మముల సత్యముల రూపమొందవలెను. సర్వశాస్త్రములు ప్రాచీనానుభజన్యములు. భవిష్యదనుభవమునకు సహకారులు. శాస్త్రము సహకారియేకాని యర్థమార్గదర్శి. అదిచూపుడు స్థంభమువలె రాజమార్గముల జేర్లఁ దెలిపి ప్రయాణీకునకు గమ్యస్థానమెద్దియో యేమార్గమున నడువ వలెనో సూచించును. మిగిలినది స్వప్రియత్నము స్వానుభవము గురుని శక్తిననుసరించి యుండును.

అనుభవముయొక్క వృద్ధి వేగము విపులత్వము ఫలతీప్రిత ప్రారంభమున ముఖ్యముగా సాధకుని స్వప్రియత్నాభిలాషల ననుసరించి యుండును. యోగవిధాన మనగా బహిరాకారములలో వస్త్వాకర్షణలలో మునిగియున్న యహంకారజన్యజ్ఞానమునుండిజీవుని మరలించుటే. అట్లు మరలించుటచే స్వయంప్రకాశుఁడు సర్వవ్యాపకుఁడగు నీశ్వరుఁడు వ్యష్టిరూపములోనికిఁ బ్రవహించి దానిమార్చఁగల నుత్తమ స్థితిని యోగము జీవున కిచ్చుచున్నది. కాబట్టి మొదటసిద్ధి నిర్ణయించు విషయమా మార్పునుదెచ్చు తీవ్రతే. అది జీవుని యంతర్ముఖుని గావించు బలము. హృదయమం దభిలాషయొక్క శక్తి, చిత్తము యొక్కబలము, మనసుయొక్కయేకాగ్రత, విని యోగపడిన శక్తిని నిలుపుకొనుట, యాతీవ్రతను దెల్పుచున్నవి. "ప్రభునిపై గల నాయభిలాష నన్ను దిన్నది." యను బైబిలులోని వాక్యము చెప్పుటకు నిజమైన సాధకుఁ డర్హుడు కావలెను. ఈశ్వరునికొఱకైన యీయభిలాషే యుత్సాహము. దివ్యఫలసిద్ధికొఱకు సర్వస్వభావమున కుండవలసిన యభిలాషయే యిది. ఈశ్వరసంసిద్ధికొఱకు హృదయమున కుండవలసిన వ్యాకులత యిదే. ఈయుత్సాహ మహంకారమును మ్రింగుచున్నది. అహంకారజన్యస్వరూపబంధముల దెరింపి తా నన్వేషించుదాని ప్రవేశమునకై విపులత్వ మిచ్చుచున్నది.

ఇది పరిపూర్ణము కొఱకుఁ బనిచేయుచున్న శక్తియొక్క కొంతభాగమే. ఒక విధముగా నొకదాని నొకటి వెంబడించునట్టియుఁ బ్రత్యేకము విభజింప శక్యముకానట్టియు మూఁడుమెట్లు పూర్ణ యోగవిధానమునకుఁ గలవు. అవి యేవన (1) స్వయంప్రకాశ మొందుటకు నీశత్వమొందుటకుఁ బ్రయత్నించుట (2) మానవశక్తి నిమార్పుటకుఁ బ్రకాశించుదాని మనలోఁ బ్రవేశపెట్టుట (3) మార్పుజెందిన మన మానుషత్వమును ప్రపంచమందు దివ్యస్థానముగా నుపయోగించుట. కొంతమట్టుకైన నీశ్వరసాన్నిధ్య మెంతకాలము స్థాపింపఁబడదో యంతవరకుఁ బురుషప్రయత్నము హెచ్చుగా నుండును. అట్టి సాన్నిధ్య మేర్పడిన కొలది తన యహంకార ప్రయత్నమును మించునట్టి తనదికాని యొకశక్తి తనలోఁ బనిచేయుచున్నదని సాధకుఁడు తెలుసుకొనవలసియున్నది. ఈశక్తికిఁ గ్రమముగా లోఁబడుట నేర్చుకొని తనయోగము దానికి వశముచేయవలసి యున్నది. తుదకు తన యిచ్ఛాశక్తు లుత్తమ శక్తితో నేకమై స్వార్థపరత్వముగల యహంకారమునకు సాధ్యముకాని నిష్పక్షపాత వివేకముతో, దైవికఫలసంధానముతోఁ దన మనఃప్రాణస్థూలముల మార్పునట్టి యీశ్వరేచ్ఛాశక్తులయందు లీనమగుచున్నవి. ఇట్టి యేకత్వమాత్మ లీనత్వము సమాప్తమగు నప్పుడే ప్రపంచములోని యీ దివ్యస్థానము మహత్తరమైన మానుషజాతీయ యోగమందుఁ బ్రత్యక్షమునఁ బనిచేయుట కుత్తమ శక్తియొక్క సాధనముగా నేర్పడుచున్నది.

నిజమునకు సర్వదా పనిచేయునది యుత్తమశక్తి. స్వప్రయత్న స్వాభిలాషల వ్యక్తి మనకేలఁ గలుగు ననగా ప్రపంచానుభవములకుపయోగపడు సాధారణ మనోవృత్తులయందుఁ బనిచేయుచున్న దివ్యశక్తితో నహంకారమానస మైక్యమగుటచేఁ గలుగుచున్నది. ఏలననగా మనలోఁ బనిచేయుచున్న బ్రహ్మాండశక్తులు మన వనుకొనుచు ప్రపంచమున నహంకారముతోఁ బనిచేయుచున్నాము. మనఃప్రాణస్థూలాకార మందతీతునియొక్క నిర్మాణవృద్ధి

కార్యకరణము తన స్వకీయ చిత్తజ్ఞానశక్తి వ్యాపార మనుకొనుచు నహంకారముతోఁ బనిచేయుచున్నాము. అహంకారము సాధన మాత్రమనియుఁ బై విషయములు సాధన మగు నహంకారమున కుఁ జెందక యతీతునితో భేదములేని మన యుత్తమ పరిపూర్ణాత్మ కుఁ జెందు నను నర్థమంను మాత్రమే మనవని వ్యక్తిఁ బుట్టించునదే వికాసాభివృద్ధి. తన యిచ్ఛ యుపకరణ మాత్రమనియు, తన వివే కము పసివాని యవివేక మనియు, తనశక్తి పిల్లవాని యశక్తతయ నియుఁ దననిర్మలతకపటపవిత్రతయనియు నహంకార మెప్పుడు నేర్చు కొని తనకతీతమైన దానినెప్పుడు నమ్ముచున్నదో యప్పుడే దానికి విముక్తి. అహంకారము దేనియం దనురాగము పూర్తిగాఁ గలిగి యుండెనో వెలికిమాత్రమున్నట్లు గన్పించు నామానవ స్వాతంత్ర్య ము స్వేచ్ఛత యహంకారమునకు వైత్రైన పెక్కుసూచనలకుఁ బ్రే రేపణలకునది లోఁబడుటను మరుగుపరుచుచున్నవి. అహంకార విసర్జ నమే దానిసంసిద్ధి. తన్నధిగమించుదానికి లోఁబడుటే దానిమోక్ష ము. పూర్ణ స్వాతంత్ర్యము.

కాని యనుభవసిద్ధమగువృద్ధికిమూఁడు మెట్లులోఁబ్రతిదానితో నుపయోగావసరములు కలవు. మొదటినుండి శ్రేష్టతముని మానసి కముగా హృదయమందు గుర్తించినప్పటికి నాగుర్తుపట్టుట, ప్రత్యక్షా నుభవముగా మారుట కభ్యంతరపెట్టు స్వతసిద్ధములగు కొన్ని విష యములు కలవు. వ్యష్టిజీవుని చిత్తము దృఢముగా తీవ్రముగా నీశ్వ రునిపై నిలిపి తనతోఁబోరి ప్రయత్నము చేయవలసినకాలము కొం చెమో గొప్పయో కావలసియున్నది. మనోశక్తులు హృదయాను రాగములు కోరిక లీస్థూలము బలవంతముపైఁ గ్రమస్థితికిఁ దేఁబడి క్రమశిక్ష నొందవలెను. ఉత్తమమున కధమము లోఁబడుటచే నప్పు డు త్యాగమంగీకరింపఁ బడును.

సాధకుని చిత్తము (Will) మొదట నహంకార శక్తులతోఁ బనిచేసి వానిని మంచిగామార్చి తన్నంగీకరించురీతిని శిక్షించవలెను. వృద్ధిచెందుచు సాధకుఁడు స్వచిత్తము స్వప్రయత్నము స్వశక్తులను

పయోగించును. కాని యుత్తమ బలమునకు వ్యక్తితో లోఁబడి యాయుత్తమశక్తికిఁ బ్రతినిధులుగా వీని నుపయోగించును. మఱి కొంత వృద్ధిజెందిన కొలది యవిభిన్నములు స్వాంతములుగాక వ్యష్టి జీవునియందుఁ బనిచేయుచున్న బలశక్తులయొక్క కార్యములగు చున్నవి. ఇంకను జన్మస్థానమునకుఁ బ్రవాహమునకు మధ్య నంత రము విశేషముగా నుండును. తుదకు భేద ముడిగి వ్యష్టిజీవునియందు సమస్త మీశ్వరకార్య మగుచున్నది.

పూర్ణయోగమునకు శాస్త్రము ప్రతిమనుజుని హృదయ మందు దాగియున్న యనంతవేద మెట్లగుచున్నదో యట్లే దాని కుత్తమగురువు మనలో దాగియున్న జగద్గురువే. అతఁడు తనజ్ఞాన దీప్తిచే మనయంధకారముఁ బోఁగొట్టుచున్నాఁడు. అదే యతని యాత్మప్రబోధయొక్క ప్రకాశాభివృద్ధి. తనకు స్వభావములగు స్వేచ్ఛ యానందము ప్రేమ శక్తి నిత్యత్వములఁ గ్రమపద్ధతిని వెల్లడించి మనకుదివ్యప్రమాణలబ్ధ్యాగముల స్థాపించి మనయధోస్థితి చే నుత్తమమును బ్రతిఫలింపఁజేయు వాఁడతఁడే. తనమహిమను మన లోఁ బ్రవహింపఁజేసి వ్యష్టి జీవునకు సర్వవ్యాపకాతీతునితో నేక త్వమొందుటకు సామర్థ్య మొసగును.

వాని విధాన మెట్టిది? వాని పద్ధతియేమి? ఆతని కొక విధానము లేదు. స్వభావమునకు సాధ్యమైన ప్రతివిధానమతనిదే. స్వభావమున కలవడిన యుత్తమవిధానముల స్వతసిద్ధముగ నిర్మిం చుటే యతని పద్ధతి. అట్టి విధానము లతిస్వల్పకార్యములకు సహి తము వర్తించును. అతనియోగ మందుపయోగించఁ దగనియతి స్వల్పవిషయముగాని యత్నించఁ దగినయత్యధికవిషయము గాని లేదు. అధికారియొక్క సేవకుఁడనను, శిష్యుఁడనను నహంకార గర్వములతోఁ బనిలేదు. పైనుండి సర్వమతని కొఱకుఁ జేయఁ బడు చున్నది. కాని తన లోపముల గురించి నిరుత్సాహ మొందనక్కర లేదు. తనలోఁ బనిచేయుశక్తియనంతము. నిర్గుణము.

యోగరాట్, ప్రభువు, ప్రకాశత, భోక్త, సర్వపరిత్యాగ ప్రయత్నములకు గమ్యస్థానమగు నీయంతర్గురుని పోల్చిగుర్తించుట పరిపూర్ణమార్గమునకు మిక్కిలి ముఖ్యము. సమస్తమునకు వెలినున్న నిర్గుణశక్తి ప్రేమవివేకములతఁడని భావించనీ, యఖండమై సృష్టియం దావిర్భవించి సృష్టినాకర్షించు వాఁడని భావించనీ, వ్యష్టిమానవుని యుత్తమాత్మ సర్వజనుల యుత్తమాత్మయతఁడని భావించనీ, మనలోఁ బ్రపంచములోనుండు దివ్యపురుషుఁ డతఁడని భావించనీ, యతని యనంతనామరూపములలో నొకదానిచేఁ గాని మనస్సు గ్రహింపఁదగిన యెట్టి లక్ష్యార్థముచేగాని యతని భావించనీ, యెట్లు భావించననొకటే. ఈవిషయము లన్ని యతఁడే నని తుదకు మనము గ్రహింతుము. అతనిఁ దెలుసుకొనుటకు మనోద్వారము స్వభావానుసారముగ వెనుకటి పరిణామానుసారముగ నుండవలెను.

ఈయంతర్గురువు మొదట స్వకీయమానస ప్రయత్న తీవ్రముచే స్వప్రయోజన ప్రయత్న తీవ్రముచే నహంకార జన్యాపేక్షలచే మరుగుపడి యుండును. శుద్ధి కానుకాను నహంకారయుక్తప్రయత్నాందోళనము తగ్గి ప్రశాంతాత్మజ్ఞానమున కవకాశము రానురాను వృద్ధిఁజెందుచున్న యంతఃప్రకాశమునకు మూలమేదో పోల్చి దానిగుర్తింతుము. మనపోరాటల ప్రయత్నముల జయాపజయముల భావమేమో తెలుసుకొనిన, మనచిక్కుల దుఃఖముల యర్థమేమో యెరిగిన, మనపతనములు హానులు మనకుఁ జేయు సహాయమేదో గ్రహించిన, గూఢములు విరుద్ధములగు మనసమస్తవ్యాపారములు యొక ప్రయోజనమునకై నడిపింపఁ బడుచున్నవని తెలుసుకొనిన, యోగమార్గమందుఁ బ్రవేశించకముందే మనపరిణామసృష్టి జీవితమందు మార్పు తెచ్చినదని కనిపెట్టిన, వెనుకచూపుచే నాయంతఃప్రకాశమును బోల్చఁగలము. తరువాత దానిని వెనుకచూపుతోఁ గాక తక్షణమే తేజోమయుఁడగు నాదీక్షదర్శియొనరించు మన భావనిర్మాణమందు, నాసర్వవ్యాపకశక్తిగావించు మన యిచ్ఛావృత్తుల నిర్మాణమందును, సర్వమును సమాకర్షించి లోభరించు నాయానం

దప్రేమలుచేయు మన యనురాగముల నిర్మాణమందును బోల్పఁ
గలము.

మన యంతరాత్మలయందును మన సమస్తబహిస్థితియందు నీయద్వితీయునిచూచి తెలుసుకొని, యై, సంసిద్ధినొందుటే మనభూలోకవాసమునకు రహస్యము, గమ్యస్థానము. మనసమస్తవిషయములందును మనకు వెలినిగాన్పించు సర్వమందు నతనిభావించుటే వ్యష్టిజ్ఞాన పరిపూర్ణత్వము. మన మతనికి వశమై మనలో సమస్తమం దతని వశము జేసికొనుటే సర్వాధికారము సామ్రాజ్యము. ఇట్లు వశముజేసుకొని, క్రియానిష్క్రియల, ప్రశాంతశక్తుల, నేకత్వభిన్నత్వముల ననుభవములం దతని భోగించుటే యహంకారజీవుఁడు వ్యక్తి లేక బ్రియత్నించు సౌఖ్యము. పూర్ణయోగాభిప్రాయమునకుఁ బూర్ణనిరూపణ మిదే. బ్రహ్మాండస్వభావము తనలో దాచినట్టి కనిపెట్ట శ్రమపడుచున్నట్టి సత్యమును స్వానుభవములోనికిఁ దెచ్చుటిదే. ఇదే మానుషజీవుని దివ్యజీవునిగా స్వభావజీవితమును దివ్యజీవితముగా మార్చుట.

మనలో నివసించు రహస్యప్రభువును గనిపెట్టి దివ్యజ్ఞానప్రేమలనఁబడు దివ్యశక్తికిఁ బాత్రులమై మార్పుకొఱకు దానినమ్మియుండుట యీ పరిపూర్ణసంసిద్ధికిదృఢమైనమార్గము. అట్లుచేయుట మొదట నహంకారజ్ఞానమునకు బహుకష్టము. ఒకవేళఁ జేసినను బూర్తిగాఁ జేయుట దుర్లభము. మొదట నేల కష్టసాధ్య మనగా భావేంద్రియజ్ఞానహృదయానురాగసంబంధము లహంకారయుతములగు నలవాట్లు రావలసిన వ్యక్తిని పొందించు మార్గముల మూయుచున్నవి. తరువాత నేలకష్ట సాధ్య మనగా నీమార్గమునకుఁ గావలసిన నమ్మిక యర్పణ ధైర్యము లహంకారాచ్ఛాదిత జీవునకు సులభసాధ్యములు కావు. ఈశ్వరునిపని యహంకారమానసములు కాంక్షించి యొప్పుకొను పనికాదు. ఎందుచే ననగా నది సత్యస్థాపనకొఱకసత్యమును, సుఖప్రాప్తికొఱకు దుఃఖమును, బరిపూర్ణసిద్ధికొఱకసంపూర్తిని యుపయోగించుచున్నది. అహంకారజీవుఁడు తానెచ్చ

టికి నడిపింపఁ బడుచున్నాఁడో యెరుగఁజాలఁడు. నడుమ్పుటను దిర స్కరించి నమ్మకము బాసి ధైర్యము వదలుచున్నాఁడు. ఈలోపము లవలన నష్టము లేదు. మనలోని యాదిప్యగురువు మన తిరస్కార ముల లెక్కింపడు. మనభక్తిలోపముచే విరక్తినొందఁడు. మన బల హీనతచే విముఖుఁడు కాఁడు. పరిపూర్ణ మాతృవాత్సల్యత గురుని పరిపూర్ణ సహనము లతనికిఁ గలవు. అతనిచే నడిపింపఁబడుటకు మన మంగీకరింపని యడల మన కావ్యక్తిమాత్రము నశించునుగాని దాని ఫలము సంప్రాప్తముగాక మానదు. మన మట్లంగీకరించక పోవుటకుఁ గారణ మతఁడు దేనిమూలకమునఁ దనయాత్మను వెల్లడిం చఁ బ్రయత్నించుచున్నాఁడో యట్టి మన యధమ స్వభావమునుండి యుత్తమాత్మను విభజింప నేరకుండుటే. దేవుఁడు మన స్వభావాను సారముగాఁ బనిచేయునుగాని యత్యద్భుతములఁజేయఁడు. ప్రపంచ మందువలెనే మనలో సహితము దేవుని జూడఁజాలము. నమ్మకము పుట్టుటకు మనుజుఁ డద్భుతములఁ గోరుచున్నాఁడు. తాఁజూడఁగలు గుటకు మిఱుమిట్లు గొలుపు ప్రకాశతఁగాంక్షించుచున్నాఁడు.

తనలో గోచరించని దానిని మనుష్యుఁడు నమ్ముట కష్టము. కాని తనకు వెలియందాకారముదాల్చిన దానినమ్ముట సులభము. బహుజనుల జ్ఞానాభివృద్ధికి వెలియూతయావశ్యకము. బహిరంగమైన దేవుని విగ్రహముదాని కవుసరము. అవతార గురువులు మానుష ప్రతినిధుల గాంక్షించుచున్నది. మనుజుని యవుసరమును బట్టియీ శ్వరుఁడు దేవతగాను దివ్యమానుషముగాను కేవల మానుషముగా నావిర్భవించును.

ఇట్టి యవుసరముండుటచేతనే హిందువుల జ్ఞానశిక్ష యిష్ట దేవతావతార గురుమూలకమై ప్రబలుచున్నది. ఇష్టదేవతయనగా నీచమగు శాబరశక్తికాదు. పరంజ్యోతియగు బ్రహ్మాండేశ్వరుని నామరూప విశేషము. సర్వమతములవారీశ్వరుని నామరూపముల నేదో యొకదాని నుపయోగింతురు. మానుషజీవున కిట్టి యావశ్యకత కలదనుట తేటతెల్లము. దేవుఁడే సమస్తము. సమస్తమును ఖించిన

వాఁడు. సర్వమును మించినవాని మనుష్యుఁ డెట్లు తెలుసుకొనఁ గలఁడు. సర్వమే యతనికిఁ దెలిసి కొనుట సాధ్యముకాదు. అతఁడు హద్దులలోఁ బనిచేయవలసి యున్నాఁడు. తనయావరణ హద్దులలోని వానితో మాత్రమే సమరసత్వ మొందఁగలఁడు. అట్టి సమస్తమం దింద్రియజనితజ్ఞానమునకు సాధ్యముకానట్టియుఁ దెలిసికొనుటకుఁ గడు దుస్తరమైనట్టియు విషయములు కలవు. గనుకనే తనవంటి యాకా రమందుఁగాని తనకు వెలియాకరమందుఁ గాని దేవుని గ్రహించవల సిన వాఁ డాయెను. ఈశ్వర సంధానము సాన్నిధ్యము కలుగుటకుఁ దన యుత్తమ స్వభావానుగుణ్యముగ నాయాకార మండవలెను.

మనుష్యజాతికి సంబంధించిన యీశ్వరానుభవ మివ్వఁజాలిన మానుషమధ్యవర్తిని యతని స్వభావము కాంక్షించుచున్నది. కృష్ణుఁడు క్రైస్తువు బుద్ధుఁడు మొదలగు నవతారము లిందు కేర్పడి నవే. వీరిని సహితము గ్రహించఁ జాలనప్పుడు ప్రత్యక్ష గురువుగా నీశ్వరుఁడు పరిణమించును. దివ్యావతారమును గ్రహించలేనివారు జగద్గురు వీశ్వరప్రతినిది యను నామాంతరములిడి యుత్తమనునుజు నంగీకరింతురు.

పరిపూర్ణ యోగసాధకుఁడు తన స్వభావానుసారముగ నీసమ స్తసాధనముల నుపయోగించవలసినదే. వాని లోపములఁబాఱఁదో లినా దేవుఁడు నాయవతారము నాగురువని ఘోషించు నహంకార మానసధోరణులఁ బరిత్యజించవలెను. దివ్యజ్ఞాన పరిపూర్ణత్వము శాఖాభిమాన మతోన్మాదములకుఁ గడుదూరము.

పరిపూర్ణ యోగసాధకుఁ డీశ్వరుని సమస్తనామరూపములఁ దనభావమందుండు దానితో నైక్య మొందించువరకుఁ, దనయిష్టదై వము నితర దేవతలందుఁ జూచువరకు, నవతరించినవానియందు సమ స్తావతారములఁ జేర్చువరకు, సమస్తబోధల్ని నిత్యజ్ఞానసమగసమం దైక్య మొందువరకుఁ దృప్తినొందఁడు.

తనలోని దేవత్వప్రబోధ కొఱ కేర్పడిన యీబహిస్సాధనముల యుద్దేశ్యము మఱువఁడు. అంతర దేవత్వప్రబోధకలుగ కేదియు సమాప్తికానేరదు. మనలోని కృష్ణక్రైస్తవ బుద్ధులప్రబోధకలుగని పక్షమున కృష్ణక్రైస్తవ బుద్ధుల వెలి పూజప్రయోజనము లేదు. తక్కిన సాధనము లన్నియు మార్పుచెందని మనుష్యస్థితికినియంతర ప్రబోధకును మధ్య నేర్పడిన వంతెనల వంటివి.

పూర్ణయోగగురువులోనున్న యంతర్గురుని విధానమే సాధ్యమైనంతవరకు నవలంబించును. శిష్యుని స్వభావానుగుణ్యముగా వానిని నడిపించును. బోధప్రమాణము బలము గురువున కివి త్రివిధోపకరణములు. వివేకవంతుఁడగు గురుడుఁ దనభావముల స్వీకరింపసంసిద్ధుఁడైన శిష్యుని మనస్సులో బలాత్కారముగాఁ బ్రవేశపెట్టఁడు. లో దైవముయొక్క సంరక్షణవల్లఁ బెరుగు విత్తనములవలె ఫలమిచ్చుదానినే ప్రవేశపెటును. బోధచేయుట కంటె ప్రబోధకలిగించుటకతఁడు మిక్కిలి ప్రయత్నించును. స్వభావవిధానముచేత నవర్గళవికాసముచేతను సామర్థ్యానుభవముల వృద్ధికై పాటుబడును. దాటశక్యముకాని విధిస్థిరమైన ధర్మసూత్రమనుమాట విడచి యేవిధానమునైన సాధనముగా నిచ్చుచున్నాఁడు. అదియొక హద్దుగానేర్పడకుండ గుడ్డిపద్ధతిగాకుండ జాగ్రత్తపడుచున్నాఁడు. వానిపని యెదనగా దివ్యతేజస్సునుమేలుకొలిపి దేనికిఁ దాను సాధననిమిత్తమాత్రమగుచున్నాడో యట్టి దివ్యశక్తికిఁ బనికలిపించుట.

బోధకన్న బ్రమాణాచరణములు ముఖ్యతరములు. అవి బహిఃకార్యము కాదు. నడవడిక కాదు. వీనివలన బ్రత్యేకోపయోగమున్నప్పటి కంత ముఖ్యములుకావు. సమస్తజీవితమును స్థితిని గార్యకరణమును నడుపునట్టి యంతస్సితదివ్యసంబంధ ప్రమాణాచరణమే ముఖ్యము. ఇది సర్వజనోపకరమైన ముఖ్యవిషయము. తక్కినవి వ్యష్టిమానవునకుఁ బ్రత్యేకసందర్భములకు జెందినవి. దీనినే సాధకుఁడుగ్రహించి తనలోఁ మరలఁ బుట్టించుకొనవలెను. కాని స్వతసిద్ధ

మగు సరియైన ఫలముల నివ్వఁజాలని, ఫలించని బహిరాచారణమును సరించకూడదు.

ప్రమాణమునకన్న మహత్తు (బలము) ముఖ్యతరము. బలమనగా గురువునకు శిష్యునిపైఁగల వెలియధికారముకాదు. గురువునకుఁ గల మహత్తును రహస్యముగా నితరజీవునందుఁ బ్రవేశబెట్టఁజాలు గురుసామీప్య సాన్నిధ్య సంస్పర్శశక్తియే యీబలము. గురునకిది యుత్తమలక్షణము.

గురుస్థానమును దనంతట తాఁ దెచ్చిపెట్టుకొనకుండుటే పరిపూర్ణయోగగురునకు ముఖ్యలక్షణము. అతఁడు సోదరులకు సహాయపడు సోదరుఁడు. పిల్లవాండ్రకు దారిజూపు పిల్లవాఁడు.

ఏసాధకున కీసర్వసాధనములు కలవో వాఁడు తప్పకగమ్యస్థానమొందును. అతనికి పతనము సహిత మారోహణమునకు సాధనమే. మరణము సంసిద్ధికిదారి. ఈమార్గమునఁ బ్రవేశించితిమా చావుపుట్టుకలు వృద్ధివిధానములు ప్రయాణసత్రములు.

మిగిలిన సాధనము కాలము. మనుష్యప్రయత్నమునకుఁ గాలము శత్రుమైనను మిత్రమైనను గావచ్చును. అది యడ్డులేక ద్వారమో యుపకరణమో కావచ్చును. కాని యదియెల్లప్పుడు జీవునకు సాధనమే యగుచున్నది.

స్థితిగతులు శక్తులు కలిసి పనిచేయు స్థానము కాలము. అహంకారజీవున కది శత్రువు. అభ్యంతరము. ఈశ్వరునకది యుపకరణము. కాబట్టి మనప్రయత్నము స్వార్థపరత్వ మొందినఁ గాల మభ్యంతరమై కాన్పించును. స్వార్థపరత్వము నడ్డెడు సర్వశక్తుల మన కెదురుగా నిలుపును. ఈశ్వరకార్యముతో మనపని యేకీభవించినప్పుడు కాలము మనకు ద్వారము. సాధనము. ఈరెం డేకీభవించిన గాలము భటుని పగిది యుపకరణమగును.

సాధకుఁడు కాలము నెట్లు పరిగణింపవలె ననగాఁ దన సంసిద్ధికిముం దనంత కాలమున్న దని యోర్పుతో వేచియుండవలెను. కాని సదా వృద్ధి నొందుచున్న యధికారమును వేగముగా నిప్పుడే గ్రహించగలశక్తిని వృద్ధిజేయవలెను.





# యోగసంకలనము.



## రెండవఅధ్యాయము.



## ఆత్మసమర్పణము.



సమస్తయోగము నూతనజన్మ యనఁబడును. సర్వసాధారణ
మైన స్థూలజీవితమును విడిచి యున్నతస్థితిలో జన్మించుట. ఆవిపుల
స్థితి యావశ్యకమని మెలుకువ కలిగినతోడనే యీనూతనజన్మ
ప్రారంభించును. లోన నిట్టి గొప్పమార్పు నొందుచున్న జీవుఁడు
వివిధమార్గములఁ దానిఁ బొందుచున్నాఁడు. తెలియకనే ప్రబోధ
కలిగించు స్వతస్సిద్ధమగు స్వభావవృద్ధిచేతను, మతబలముచేతను,
వేదాంతశాస్త్రాకర్షణచేతను మందప్రకాశముచేత నాకస్మిక విభ్రాం
తిచేతను, బహిస్థితిగతులచేతనం తరయావశ్యకతచేతను, మనోబంధ
ములఁ ద్రెంపఁజాలు నొకమాటచేతను, దీర్ఘాలోచన చేతను, మార్గ
మందభ్యాస పరుఁడగు దూరస్థపరిమాణముచేతను, ప్రతిదినసాంగ
త్యబలముచేతను, నూతనజన్మప్రారంభమగుచున్నది. స్వభావపరిస్థి
తుల ననుసరించి యది సంభవించును.

ఏమార్గమున నదివచ్చినను, మనోచిత్తనిశ్చయ మాత్మసమ
ర్పణ ముండవలెను. చిత్తముచే గ్రహింపఁబడి, హృదయముచే

నాకర్షింపఁబడి యీ నూతన భావాంగీకారము, బీజమువలె సమస్త యోగఫలములుగల మహత్కార్యమైయున్నది. పరమందున్న యున్నతస్థితియొక్క భావ మెంతబాగుగ గ్రహింపఁబడినను, కోరదగినది చేయదగినది యదియొక్కటే యని హృదయచిత్తములు తెలుసుకొనువరకు ఫలప్రదాయి కానేరదు. యోగ మివ్వనున్న నీగొప్ప మార్పు చంచల చిత్తమునకు, స్వల్పశక్తి శకలమునకు, సంశయాత్మకు సాధ్యముకాదు. ఈశ్వరు నన్వేషించువాఁడు తన్నతనికే పూర్తిగా సమర్పణము జేయవలెను.

బలవత్తరమగు శక్తిచే నీమార్పు సంపూర్ణ మాకస్మికముగా వచ్చినయడల మఱి యేవిధమైన కష్టముండదు. ఎన్నిక భావమును వెంబడించును. కొన్నివేళల భావముతోఁ గలసివచ్చును. ఎన్నిక ననుసరించి యాత్మసమర్పణ ముండును. మొదట మార్గమందు గమనము స్థిరముగాకఁ జలనమొందుచున్నను, మార్గము స్పష్టముగాఁ గానుపించకుండినను, గమ్యస్థానముయొక్క జ్ఞాన మసంపూర్తిగనుండినను, మార్గమందు మాత్ర మిదివరకే ప్రవేశము కలిగినది. గురువు స్వయముగా నావిర్భవింపకఁబోయినను, మానుషప్రతినిధి రూపముతోఁ గాన్పించకపోయినను, గురు విదివరకే పని ప్రారంభించినాఁడు. ఎట్టికష్టములు సంశయములురానీ, జీవిత ప్రవాహమును మార్చినశక్తిని స్వాధీనపరచుకొనఁ జాలవు. ఒకపరియాయము స్థిరపడినపిలుపుమారదు. ఉత్పన్నమైన వస్తువు చెడిపోదు. మన స్థితిగతుల బలము క్రమపరిశ్రమకు సంపూర్ణ యాత్మసమర్పణమునకు మొదటినుండి యభ్యంతరము కలిగించినను, మనస్సున కొక యలవాటు కలుగుటచే దాని విడువక మరలమరల నాముఖ్యవిషయము నేవృద్ధిచేయుచున్నది.

కాని సర్వదా యిది ప్రారంభపద్ధతికాదు. తరుచు సాధకుఁడు క్రమముగా నడిపింపఁ బడును. మనస్సుయొక్క మొదటి మార్పునకును, దేనివైపునకది తిరిగినదో యావిషయము నారోపించుటకును, మధ్య విశేషమంతర మున్నది. తెలివిగల దృఢమైన

శ్రద్ధమాత్రము మొదట యుండవచ్చును. లేక నాభావమం దాకర్షణ, యసమాప కాభ్యాస ముండవచ్చును. లేక యుత్తమస్థితికై ప్రయత్నించు నొకనియందు భక్తిచేఁ బ్రేరేపింపఁబడి తనస్వభావమున కంగీకారముగాక తనకు బలవంతముగా విధింపఁబడిన ప్రయత్నము కావచ్చును. ఇట్టి విషయములఁ జిరకాల మభ్యసించినఁగాని తిరుగులేని సమర్పణ మేర్పడదు. కొన్నివేళల నాసమర్పణ మేర్పడకనే పోవచ్చును. కొంత వృద్ధి యుండవచ్చును; దృఢప్రయత్నము విశేష పవిత్రీకరణము ముఖ్యములు కాని యనేకానుభవము లుండవచ్చును. కాని జీవితము సంసిద్ధుఁడగుటలోఁ గడచిపోవచ్చును. ఏదియోయొక స్థితికి రావచ్చును; తరువాత మనస్సు తగినంత ప్రేరేపణ లేకఁ దనకు సాధ్యపడిన హద్దులలో మాత్రము ప్రయత్నించి సంతుష్టి జెందవచ్చును. యోగశాస్త్రమందుఁ బదభ్రష్టత్వ మని పిలువఁబడు నధోజీవితములోనికిఁ బడినఁ బడవచ్చును. ముఖ్యవిషయమందు లోపముండుటచేత నీపతనము తటస్థించుచున్నది. బుద్ధియందు శ్రద్ధకలదు. హృదయమం దాసక్తి యున్నది. చిత్తమందు ఘట్టి ప్రయత్నము లేకపోలేదు. కాని జీవుఁ డీశ్వరునిచే బంధింపఁబడలేదు. జీవుఁడు శ్రద్ధాసక్తి ప్రయత్నముల మాత్ర మంగీకరించెను. పరీక్ష జరిగియుండును. బహుశహా ఈపరీక్ష మిక్కిలి యాతురతతో జరిగియుండును. కాని జీవున కేది యత్యావశ్యకమో యా యాత్మసమర్పణముమాత్రము లేదు. అట్టి యసంపూర్ణయోగము సహితము వ్యర్థముకాదు. ప్రస్తుత మదిచెడినను, ప్రారంభస్థితిమాత్రమే ప్రారంభజ్ఞానము మాత్రమే వచ్చినను, జీవుని భవిష్యత్తు నిర్ణయింపఁ బడినది.

ఈజీవితకాలమున మనకున్న యన్నివీల్ల నుపయోగించఁ దలచిన, గమ్యస్థానమువైపునకు కొంచెము నడచుటేగాక దానిఁ జేరుటకు గల యవకాశమును వినియోగించఁ దలచినఁ బరిపూర్ణాత్మసమర్పణ మత్యావశ్యకము. యోగవిజయమునకుఁ గల రహస్యమేమనగా, యోగము జీవితకాలములోఁ బ్రయత్నించఁ దగిన విష

యములలో నొకటియనక ముఖ్యవిషయ మదేయనియు, జీవితకాలములో ముఖ్యభాగ మనక యావజ్జీవిత మదేయనియుఁ దలచుటే.

సారాంశమునకు యోగ మనగా స్థూలమృగ మానసజీవితమునుండి వైతొలగుట. కాబట్టి యథాస్థితికై వినియోగింపఁబడిన మన శక్తులు మన ముందటి ప్రయోజనమునకు నాత్మార్పణమునకు శత్రువులు. ప్రతిశక్తిని ప్రతికార్యము నథాస్థితినుండి విడతీసి యుత్తమ నియోగమున కర్పించితిమా యదియంతయు మనమార్గమున కుపయోగపడినదే. మనవృద్ధికి భంగకారులగు శక్తులబారినుండి తప్పింపఁబడినదే. ఈపరిపూర్ణమార్పునకుఁ గల కష్టమే యోగికుండు నభ్యంతరములలో సగమునకు మూలము. మనస్వభావము, దానిచుట్టునుండు యావరణము విజ్ఞాన పునర్జన్మ నడ్డి తదేకధ్యాసను జెడఁగొట్టు నలవాట్లతో నిండియున్నవి. మనుష్యుఁడనగా నొక యర్థమందుఁ గొన్ని ముఖ్యభాగములతోఁ గోరికలతో సంబంధములతోఁ బంధింపఁబడిన శరీరనాడీమానసికాభ్యాసముల సంఘాతమే కాని వేరుకాదు. యోగమందుఁ జేయవలసిన పనియే మనగా స్థూలమానస పురుషుఁ డనఁబడు మన వెనుకటి నిర్మాణమును భేదించి దివ్యమానుషత్వమనఁబడు నూతనక్రియా ప్రపంచమును నూతన లక్ష్యస్థానమును మనలో నిర్మించవలెను. వెనుకటి విషయక్రమమందుఁ గల శ్రద్ధపై మానససంతృప్తి వృద్ధులపై నేకాగ్రత పొందియున్న యామనోలక్ష్యమును లయమొనర్చి యీశ్వరుని జూడఁగల యీశ్వరునే యన్వేషించఁగల గాఢలక్ష్యముగా మార్చుట మొదటి యవసరము. పునర్జన్మమెత్తని యింద్రియ మానసమునకు (Sense-mind) భౌతికప్రపంచముకంటె తక్కువ సత్యముగాఁ దోఁచు నీనూతన లక్ష్యమునకు లోఁబడి, దైవమునకుఁ దగిన వాహనములగునట్లు శక్తుల నన్నిటిని యర్పణముజేసి, మన యథస్థితి యీనూతన లక్ష్యమునకుఁ గప్పము కట్టునట్లు బలవంతపెట్టుట రెండవయవసరము. ఇది సులభసాధ్యముకాదు. లోకమందుఁ బ్రతివిషయము స్థిరపడిన యలవాటు నదియొకధర్మమని యనుకరించి, పరి

పూర్ణమార్పు నెదుర్కొనుచున్నది. కాని మనము ప్రయత్నించుచున్న మార్పునకన్నఁ బూర్ణమైనదిలేదు. గనుక మనలోని సమస్తమీలక్ష్యము వైపునకు సదా మరలించి "యది పరబ్రహ్మము. మనుష్యు లిచ్చట పూజించునదికాద"ను నుపనిషద్వాక్యము జ్ఞప్తికి దెచ్చి, యిదివరకుఁ దనదిగాఁ జెప్పఁబడిన సర్వమును సన్యసించఁ బ్రయత్నించుటకుఁ బ్రేరేపించవలెను. మనస్సు మనస్సుగా నుండుటమాని మానసమునకుఁ బరమందుండు విషయము కావలెను. ప్రాణము మారవలసి యున్నది. తన వెనుకటి స్థితిని మరచునట్టిది కావలెను. దేహముకూడ మారవలసినదే. ప్రస్తుత మేదై యున్నదో యాగోల బెట్టు మృగము యడ్డుబెట్టు మొద్దుగాక జీవుని నవుకరుఛాయగా మారవలెను.

ఈపనియందుఁ గల కష్టము తీక్షణమగు సులభమార్గముల వెతుక నారంభించును. మతములు యోగమతము లిహపరజీవితముల వేరుపరచుట కిదే కారణము. ఐహికశక్తులు వ్యాపారములు దైవసంబంధము లెంతమాత్రము కావని దేవత్వమునకు విరుద్ధము లని తలచఁబడెను. దైవశక్తులు వ్యాపారములు పూర్తిగా మరియొక లోకవ్యక్తికి సంబంధించినవని యిహమునకుఁ జెందవని భావింపఁబడెను. గనుకనే దేవుని రాజ్యము దయ్యపురాజ్యమని, భూలోకజన్మ దైవజ్ఞానమని, మాయకులోఁబడుట బ్రహ్మమం దేకాగ్రత నొందుట యను భేదము లొప్పుకొనఁబడినవి. అట్టి సందర్భమున సులభమార్గ మేమనగా నిహమునువదలి పరమందుఁ జొరఁబడుటే. కొన్ని విశేషయోగమతములకు బహుముఖ్యమైన ప్రత్యేక యేకాగ్రతయప్పుడు రాఁగలదు. అట్టి యేకాగ్రతవలనఁ బ్రపంచమును త్యజించుటచే సంపూర్ణ యాత్మసమర్పణము రాఁగలదు. అధోవృత్తుల స్వాతనమగు నుత్తమజీవితమును దెలిసికొనునట్లు శిక్షింపనవసరము లేదట. శరీరపోషణకుఁ గావలసిన వృత్తులఁ గొన్నిటిని, యీశ్వర సంధానమున కావశ్యకమైన మఱికొన్నిటిని యుంచి తక్కిన వానిని జంపి స్థిమిత మొందించినఁ జాలునట.

పూర్ణయోగభావ మీసులభమార్గము నొప్పుకొనదు. దగ్గర మార్గ మవలంబించుటకును, మనకున్న యభ్యంతరముల జారనిడచి సహాయమొనర్చుకొనుటకు నీయోగమార్గ మంగీకరింపదు. దూరస్థుఁడై రహస్య మందున్న నీశ్వరునకు, వృద్ధికాని మనశుద్ధజీవుని నర్పించుటకు మాత్రమేగాక మనభవము భవ్యములర్పించుటకు, మనకున్న సమస్తము సర్వప్రపంచ మతనికొఱకు జయించుటకు బైలుదేరితిమి. మనము భజించు యీశ్వరుఁడు బ్రహ్మాండమున కతీతమైన సత్యముకాదు. బ్రహ్మాండమం దావిర్భవించినవాఁడు. ఆయావిర్భావము పనిచేయు స్థలము జీవితము. జీవితమందే దానిఁ దెలిసికొని యనుభవించవలెను. అట్టి యంగీకారము మనపోరాట కెట్టి కష్టములఁ దోఁడుచేసినఁ జేయనిండు. మనకుఁ వ్రతిఫల మేమనగా నీవిధమున మార్గము కఠినతరము చేయఁబడినను బ్రయత్నము బహుముఖమైన యొకస్థితికివచ్చిన దరువాత విశేషఫలము పొందఁగలము. ఎప్పుడు మనమానసము ముఖ్యలక్ష్యమందు స్థిరత్వమొందునో, మన చిత్త మావిషయమందే యేకాగ్రత చెందునో యప్పుడు జీవితము మనకు సహకారియగుచున్నది. దాని వివిధాకారములు ప్రచారములులోనున్న నగ్నికి నాహుతి కాఁగలవు. మనపరిపూర్ణత్వమునకుఁ దోడ్పడమని జ్ఞానమును వృద్ధిచేయమని బలవంత పెట్టుదుము.

పరిపూర్ణయోగసాధకునకు నిషేధింపఁబడిన సులభకరణము సాధారణ యోగాభ్యాసముచే నేర్పడుచున్నది. యోగాభ్యాసము మనకున్న విపుల బహుముఖత్వమును వెల్లడి చేయుచున్నది. సాధారణమనుజునకుఁ దనమనోస్థితి బహుస్వల్పమైనది. స్వల్పకోరికలు, మేధోసౌందర్యతృష్ణలు, కొన్నిరుచులు, కొన్ని యసందర్భాలోచనలమధ్య కొన్ని ముఖ్యభావములు, కొన్ని ముఖ్యావసరములు, శరీరారోగ్యము, రోగము, కొన్నిసుఖదుఃఖములు, కొన్ని శరీరమానసవిరూపములు పంచకూళ్లకషాయముగా మిశ్రమ మొందినవే సాధారణ మనుష్యజీవితము. బహిరంగమున కాదిమమనుజుఁ డెట్లుండెనో యట్లే సాధారణమనుజుఁ డంతరస్థితియందు వృద్ధిలేని మొర

టుగానున్నాఁడు. కాని యోగ మనగా జీవుని యగాధత్వములో మునుగుట. లోతుకుదిగిన కొలది దేనిని జయించుటకు మనము ముందు తెలుసుకొనవలెనో యట్టి ప్రపంచబహుముఖత్వముచేఁ జుట్టఁ బడితిమని తెలుసుకొందుము. ఈప్రపంచబహుముఖత్వము మనుజుఁడు తాను వృద్ధిజెందునపుడు కర్తృత్వములేక నిదివరలోఁ దెలిసికొని యున్నాఁడు. దానినే యోగమందుఁ గర్తృత్వము వహించి తెలిసికొను చున్నాఁడు. ముఖ్యముగా మనము కనిపెట్టునది యేమనగా మనలోఁ బ్రతిభాగము, బుద్ధి యింద్రియమానసము కోరికలు హృదయము శరీరము ప్రత్యేక నిర్మాణములు. ప్రత్యేక బహుముఖవ్యష్ట్యత్వములు కలవి. తమలోఁదాముగాని, యితరములతోఁ గాని ముఖ్యాధారమగు జీవునితోగాని యేకీభవించవు. అది మెఱుగు పెట్టని కల్లోలము. దానిలో దివ్యమగు క్రమపద్ధతిఁ బ్రవేశబెట్టవలెను. ఇంతేగాక ప్రపంచములో మన మొంటరిగానుండ లేదని తెలిసికొందుము. జీవునకుఁ గల ప్రత్యేకత్వము భ్రమయని తెలిసికొందుము. మనకు మనము స్వాతంత్ర్యులమై యుండలేదు. మన మానసము స్వీకరింపఁగల వృద్ధిజెందగల యంత్రము. వెలినుండి యందు విశేషపదార్థము సదా ప్రవహించుచున్నది. మన యుద్దేశ్యములలో ననురాగములలో సగముకన్న నెక్కువ మన స్వంతములు కావు. ఇతరులనుండి కాని యావరణమునుండి కాని మతుకపదార్థరూపముననో తయారైన వస్తురూపముననో మనలోఁ బ్రవేశించును. గనుకనే మన ప్రత్యేకమోక్షమున కున్న గష్ట మెక్కువ.

సాధారణ యోగమార్గమందుఁ బరస్పర విరోధముగల యీవస్తువులతోఁ బనిచేయు పద్ధతి బహుసులభము. దివ్యత్వ మొందుట కేదోయొక ముఖ్యవిషయము మాత్ర మెన్నుకొనఁబడి తక్కినవి స్థిమిత మొందింపఁ బడుచున్నవి. భక్తుఁడు హృదయమందుఁ బ్రేమగుణమును గ్రహించి దేవుని బ్రేమగుణము దేకాగ్రత నొందుచున్నాఁడు. యోచనాఁ దర్కములవాఁడు పరిగణింపఁడు. హృదయమునుండి యుత్పన్నములగు భక్తి దైవప్రేరణల (inspiration)

మాత్రి మంగీకరించుచున్నాఁడు. జ్ఞాని యుక్తాయుక్తవివేకాయత్త మానససామర్థ్యముల స్వీకరించి, ప్రకృతికార్యములనుండి విడఁదీయుటకుఁ దనకు సహాయపడు నాత్మభావము నేకాగ్రతఁ బొందుచున్నాఁడు. హృదయానురాగ విలాసముల జీవితవృత్తుల జ్ఞానిగణింపఁడు. శరీరప్రాణ సామర్థ్యవిషయమైతే వానికిగల యవసరములఁ జాలినంత తగ్గించవచ్చును. ఆవిధముననే మనజీవితమందు చుట్టుయావరణమునుండివచ్చు కష్టముల స్థూలవిజ్ఞాన మేకాంతము నిర్మించుటచేఁ దొలగింపఁబడుచున్నవి. తా నేకాంతమందుండుట, దేవునితో నేకాంతమందుండుట, దైవభక్తులతో నేకాంతమం దుండుట యీయోగమునకు లక్షణములు. ఇట్లు ప్రత్యేక మేకాగ్రతవలన చిక్కు తీరుచున్నది.

అయితే పరిపూర్ణ యోగసాధకునకు బహిరంత ర్యేకాంతము లతని వృద్ధిలోని కాలభాగములు. జీవిత మంగీకరించి తనభారము వహించుటేగాక ప్రపంచభారములో గొప్ప భాగము సహితము వహించును. గనుకఁ బరిపూర్ణ యోగసాధకుని యోగము యుద్ధము వంటిది. తనకుఁ బ్రత్యేకము సంబంధించిన యుద్ధమేగాక. గొప్ప రాజ్యముపై దండెత్తిన సాంఘికయుద్ధము వంటిది. తనలోనున్న యహంకారజనితాక్రమముల నసత్యముల జయించుటేగాక ప్రపంచమందున్న యాశక్తులకివి ప్రతినిధులనికూడ జయించవలెను. ఈప్రతినిధ్యత్వమువలన వానికి నిరోధించు సామర్థ్యము పునరుత్పత్తి శక్తి కలుగుచున్నది. తనయంతరస్థితి విపులమై తన్నేగాక నితరుల సహితము తనలో నిమిడ్చుకొనుటచేఁ దావిజయముగాంచినను మరల మరలఁ దరచు యావిజయమునే పొందవలసియున్నది. తనయవయవముల పోరాటమును బలవంతముగా దొమ్మిపై నాపఁగూడదు. జ్ఞానమును భక్తితోఁ బ్రేమను శక్తితో నతీతప్రశాంతమందుండు జీవుని నిష్క్రియత్వను దివ్యసహకారియగు దివ్యయోధునిక్రియత్వము తో సమరసత్వము తేవలెను. ఇప్పటికాతఁడు తార్కికవివేకము, యింద్రియములు, హృదయము, కోరిక, స్థూలదేహము పెట్టెడి యడ్డుతో

మాత్రమే పనిచేయవలసియున్నది. ఆపనిచేయుపద్ధతివేరు. దివ్యజ్ఞాన ప్రాప్తికి దివ్యావిర్భావమునకు నీయుపకరణముల నన్నిటి నంగీకరించి వానివిరోధముల మాన్పి పూర్ణముగా వృద్ధిచేసిమార్పుచేయవలెను. గనుక వాఁడు ప్రత్యేకైకాగ్రతను ఫలప్రాప్తికాగానే విడిచిపెట్టఁదగిన తత్కాలిక యుపకరణముగా మాత్రముపయోగించును.

ఏకాగ్రత యోగమునకు మిక్కిలి ముఖ్యమైనది. కాని పూర్ణయోగస్వభావ మెట్టిదనిన నొకవిషయముపై భావచిత్తరాగముల యేకాగ్రత ప్రత్యేక ముపయోగించక సర్వ మెవ్వఁడో యట్టి యద్వితీయునిపైఁ దనసర్వముఖములచే నేకాగ్రతనొందించుట. ఇది పరిపూర్ణ యోగమునకు ముఖ్యస్వభావము. ఆయోగాభ్యాసములన్నియు దీనిచే నిర్ణయింపఁబడుచున్నవి.

మన సమస్త మీశ్వరునిపై నేకాగ్రత నొందించుట యోగలక్షణమైనను మనస్థితి యొక విషయమునకుఁ బూర్తిగా వినియోగింపఁబడని బహుముఖత్వ మొందియున్నది. చిక్కుగల నీయంత్రమందొక బలవత్తరమగు మరగ్రహించి తా నుద్దేశించిన కార్యము కొఱ కాయంత్రమును నడుపవలెను. మన యెన్నికకు దారిచూపు నదిస్వభావమే. మానుషస్వభావము మహోన్నత విపులత్వ మొంది యధోస్థితివిడిచినది. అధోవ్యాపారములందు స్వభావము కోరికనే బలవత్తరమైన మాటగా స్వీకరించుచున్నది. కాని మనుష్యున కేమి యాధిక్యతకలదనగా నతఁ డొక మనోమయపురుషుఁడు. కామమనబడు (desire) ప్రాణమయ రాగమయ శక్తిని దిద్ది యతిక్రమించుటకు త్తమ మానసిక వ్యాపారమును మనుష్యుఁ డుపయోగించఁగలఁడు. చతుష్పాదులు ప్రాణరాగమయ భూతములు. మనుష్యులకు జంతువులకుఁ దారతమ్యము వివేచన (reason) యందున్నది. కాని యింతమాత్రమే కాదు. అంత కెక్కువ లేదనరాదు. వివేచన తనకంటె విపులము ఘనమగు దానియొక్క ప్రత్యేకవృత్తి. దానిప్రాముఖ్యత యెట్టిదన జంతువునకు దారిఁజూపు నధోతేజమునకు బదులు క్రమక్రమముగానచ్చునట్టి యూర్ధ్వప్రకాశమును మనుజుఁడు స్వీక

రించునటులఁ జేయును. వివేచన లేకపోయినను జంతువునకొక విధమైన యోచన, యిచ్ఛ, బలవత్తరమైన యనురాగములు కలవు. కాని యివియన్నియుఁ గామమూలములగు నధోనాడి కాసంఘము చేతను నాడీప్రాణప్రేరణలచేతను నడుపఁబడుచున్నవి. మనుష్యుఁడు తన యాత్మవృద్ధికై వికాసమొందిన చిత్తభావానురాగముల గ్రహించి కామముయొక్క హీనవ్యాపారముల వానికిఁ గ్రసముగా స్వాధీనముచేయును. తన యధోస్థితిని వికసింపఁజేసి స్వాధీనపరుచుకొను కొలది యతఁడు మనుష్యుఁడగుచున్నాఁడు. జంతువు కానేరఁడు. అనంతునితో సంబంధముచే వికాసమొందిన చిత్త మెప్పుడు కామమునకు బదులుగా స్వీకరింపఁబడునో, తనచిత్తమునకు గాక సర్వవ్యాపకుఁడగు నీశ్వరుని చిత్తమునకు వ్యక్తితో నెప్పుడు లోఁబడునో యప్పుడు దేవుఁడను నుత్తమ పురుషు నధిరోహింపఁ బ్రారంభించును.

వికాసమొందిన భావచిత్తహృదయము లేకమై జ్ఞానకర్మరాగస్థానముగు గొప్పవిషయముపై నేకాగ్రత నొందుటే మనయోగమునకుఁ బ్రారంభము. ఆవస్తువు మనలో వృద్ధిపొందుచున్న తేజస్సునకు మూలమై యుండవలెను. తెలిసియో తెలియకనో మనము పొందనిచ్ఛగించు నీశ్వరుఁడదే. ఈశ్వరభావవ్యక్తి దృష్టిజ్ఞానములందు భావ మేకాగ్రత నొందుట; యీశ్వరాన్వేషణానుభవ వశీకరణములందు హృదయ మేకాగ్రత నోఁదుట; యీశ్వరుఁడేదియైయుండెనో యేదిగాఁ బ్రత్యక్ష మగుటకు నెత్నించుచుండెనో యట్టిదాని సంప్రాప్తి సంసిద్ధులయందు చిత్త మేకాగ్రత నొందుట యీయోగమునకు ద్వారము.

మనకుఁ దెలియనిదానిపై నెట్లేకాగ్రత కుదురును? మనకు దెలిసిన సమస్త మనుభవమునకుఁ బూర్తిగావచ్చువర కేకాగ్రతలేనిది యీశ్వరుని తెలియఁజాలము. శాస్త్రములు చదివి వేదాంతపరిశీలన జేసి బుద్ధిజనిత దివ్యజ్ఞానమునకై మనుజుఁడు ప్రయత్నించవచ్చును. కాని యీశ్వరుఁ డెట్టివాఁడో తెలియకపోయిన నతఁడెట్లు వర్ణింపఁ

బడెనో యెట్లు భావింపఁబడెనో మాత్రము తెలిసికొనుచున్నాఁడు. ఈమానసిక శిక్షబలవత్తరమైన యోగమునకు మొదటి సోపానమే కాని యందఱికిఁ బనికిరాదు. తార్కిక జ్ఞానమే యోగమునకు ముఖ్యమైనయెడల యోగము కొందఱికే సాధ్యమగుచున్నది. కాని మనలోఁ బని ప్రారంభిచుట కూర్ధ్వతేజమావశ్యకము. అది మనస్సున కూతనిచ్చుటకు చాలియున్నది. సంకల్పమం దీశ్వరభావము చిత్తమం దీశ్వరధ్యాన హృదయమందు భక్తి నిచ్చుచున్నది. ప్రారంభమున నీసంకల్పము చాలకపోవచ్చును; యీధ్యాన యసంపూర్తిగా నుండవచ్చును; యీభక్తి యల్పమగుటచేఁ చెలించుచుండవచ్చును. కాని నిశ్చలమగు నాత్మార్పణ ముండిన నదిచాలును. కాబట్టి తెలిసినవారు మనుష్యున కేర్పడిన దేవమార్గముల తగ్గింపనొప్పుకొనరు. ఎంత యిరుకుద్వారమైన మూయరు. చీకటిగల యెంత స్వల్పమార్గమైన బిగించరు. సమర్పణమున్నచో నెట్టి నామమైన రూపమైన విగ్రహమైన నివేదనమైనఁ జాలుననిరి. ఈశ్వరుఁడు హృదయమును గ్రహించి సమర్పణ మంగీకరించును.

సమర్పణకుగల భావము విపులమై గొప్పదయ్యె నాపూర్ణఫల మిచ్చును. పరిపూర్ణజ్ఞాన ప్రాప్తికొఱకు చాలినంత విపులమగు నీశ్వరభావముతోఁ బూర్ణయోగసాధకుఁడు ప్రారంభించవలెను. దేనియందు సమస్తభూతములు చరించునో నివశించునో కలసి యేకమగునో యట్టి యనంత పరిపూర్ణయేకత్వము మనలక్ష్యార్థమై యుండవలెను. ఆయేకత్వ మేక కాలమున సగుణనిర్గుణము లగుచున్నది. బ్రహ్మాండమందుఁ దనకుఁ దావ్యక్తితో నావిర్భవించుటం జేసి యది సగుణము. సమస్త భూతములకు శక్తులకు మూలకారణములగు ననంత స్థితిగాన నది నిర్గుణము. అట్టి యేకత్వమందు భావమేకాగ్రతఁ బొందఁగలదు. అట్లేకాగ్రతఁ బొందిన భావమున కీయేకత్వము మానసికముగఁ దెలియఁబడుటేగాక సమస్తమందుండుట ప్రత్యక్షమునఁ జూడఁబడి మనలో ననుభవింపఁబడుచున్నది. అది

సమస్తమందుండి సమస్త మతిక్రమించెడి యేకస్థితి. సమస్తకర్మల ననుభవములఁ గాపాడి సకలచరాచర పరిణామవృద్ధికిఁ దోడ్పడు నేకజ్ఞానము. ఆయేకత్వమందే హృదయము సహిత మేకాగ్రతనొందఁగలదు. హృదయము దానిని యఖండ ప్రేమానందరూపమున స్వాధీనము జేసికొనుచున్నది. ఈయానందస్థితి సమస్తానుభవములందు జీవునకుఁ దోడ్పడుచున్నది. అహంకారమునకు సహితము తోఁడై పోరాటములందు కఠినపరీక్షలందు కాపాడి తుదకు దుఃఖనివృత్తికలిగించును. ఆవ్యక్తిగలప్రేమ సమస్తవిషయములవానివాని మార్గములనే తన యేకత్వమునకుఁ గొనిపోవుచున్నది. ఆయేకత్వమందే చిత్తముసహిత మేకాగ్రత పొందఁగలదు. అప్పుడాచిత్తము సమస్తబలములకు మూలమైనడిపి సంసిద్ధినొందించు శక్తిరూపము నొందుచున్నది. నిర్గుణమందీశక్తి స్వయంప్రకాశమానమై సమస్త ఫలభరితమై సిద్ధి పర్యంతము బనిచేయుచున్నది. సగుణమందీశ కి సర్వజ్ఞుఁడు సర్వశక్తుఁడైన యోగేశ్వరుని నిర్మించువరకుఁ బనిచేయుచున్నది. సగుణత్వమును గమ్యస్థాన మొందించుటకీ యోగీశ్వరు నేడియు నడ్డఁజాలదు. ఈనమ్మకముతో సాధకుఁడు ప్రారంభించవలెను. ఏలనన మనుజుఁడు నమ్మి సర్వప్రయత్నములఁ జేయుచున్నాఁడు. ప్రత్యక్షానుభవము రాగానే యానమ్మకము పరిపక్వమై జ్ఞానమందు సమాప్తి జెందును.

హైన్యమైనకామము (desire) మన యూర్ధ్వప్రయత్నమందు స్వతసిద్ధముగాఁ బ్రవేశించకమానదు. కారణ మేమనగా వికాసమొందిన చిత్తము దేనిని చేయవలసిన కార్యమని యెంచునో, పొందవలసిన ఫలమని ప్రయత్నించునో హృదయము దేనిని యానంద శ్రేష్టమని స్వీకరించునో బంధింపఁబడుటచేఁ దప్పించుకొనుటకుఁ బోరుచున్నదో యది యహంకార జన్యకామబాధితమై ప్రయత్నించుచున్నది. మార్పు జెందవలె నన్న నీకామము మొదట నంగీకరింపఁబడవలసినదే. ప్రథమమున నది సమస్తేతరకాంక్షల వదలి యీశ్వరకాంక్షయం దేకాగ్రత నొందుట నేర్చుకొనవలెను.

తరువాత నది తనకొఱకుగాక ప్రపంచముకొఱకుఁ తనలోని యీశ్వరునికొఱకుఁ, ప్రపంచమం దీశ్వరసంసిద్ధియనఁబడు నేకత్వముకొఱకుఁ గామించుట నేర్చుకొనవలెను. తరువాత తన యహంకారానుగుణ్యముగఁ గాంక్షింపక నీశ్వరానుగుణ్యముగఁ గామించుట నేర్చుకొనవలెను. తన స్వకార్యవిధానము, స్వకీయస్వప్నము, తనకు దోఁచిన న్యాయభావములందుఁ బట్టుదలవదలి, స్వార్థత్యాగియగు మార్గదర్శకునినమ్మి, యీశ్వరేచ్ఛానుగుణ్యముగ నడచుట నేర్చుకొనవలెను. ఈవిధమున శిక్షఁబొందె సమస్తాభ్యంతరములకు మూలమగు నీగొప్ప పీడ తన దివ్యప్రీతిరూపముగా మార్పఁబడుటకు దగినదై యుత్తమ స్థితియందు లీనమగుచున్నది.

త్రివిధోపకరణము లనఁబడు భావహృదయచిత్తములకు నేకాగ్రితతో లక్షింపఁబడిన విషయము స్వాధీనమైనప్పుడు దేహమానసపరిపూర్ణత్వము పూర్తిగా సంభవించును. అట్టి దేహమానసపరిపూర్ణత్వ మహంకార సంతుష్టికొఱకు వినియోగింపఁబడక యీశ్వరవిగ్రహకార్యములకుఁ దగిన దేవాలయము లోపములేని పరికరమగుచున్నది. అట్లొంపఁబడి పరిపక్వ మొందింపఁబడిన యీయుపకరణము స్వార్థపరత్వశూన్యకార్యమునకుఁ దగినదైనకొలది యీపని బలముగాఁ జేయఁబడుచున్నది. కోరిక, యహంకారము నశించగానే దిప్రత్యక్షమునఁ దనలో ననుభవింపఁబడినదో దానినే యితరులందుఁ బ్రపంచమందుఁ బ్రత్యక్షమునఁ గాంచుటకు జీవిత ముపయోగింపఁబడుచున్నది. అట్లు ప్రత్యక్షానుభవమునకు వచ్చునదే మనుష్యజాతికి గమ్యస్థానమగు దివ్యానందము, బలము, స్వేచ్ఛ, ప్రేమ, యేకత్వము.

ఇట్టి యేకాగ్రితతో నెడతెగని యాత్మసమర్పణతో మనము ప్రారంభింతము. ఏకాగ్రతనొందు విధానము ముందుఁ జెప్పెదము. ఆవిధమున నేకాగ్రితసిద్ధి నొందుటే యాత్మసమర్పణసంసిద్ధి. సమస్త వస్తువులందు భూతములందు సంభవములందు నీశ్వరుని యెప్పుడుచూడఁగలమో యప్పు డీశ్వరునియందు భావముయొక్క-

యేకాగ్రత పూర్తియగును. సమస్తరాగములు సర్వభూతములందుం డీశ్వరప్రేమగాఁ బరిణమించినప్పుడు, సమస్తవస్తువులందా కార్యవిధానమును సదా తెలిసి యంగీకరించినప్పుడు హృదయముయొక్క యేకాగ్రత పూర్తియగుచున్నది. చంచలములగు నహంకారప్రేరేపణలకు మారుగా నీశ్వరప్రేరేపణల మన మెప్పుడెరిగి యొప్పుకొందుమో యప్పుడీశ్వరునియందు చిత్తైకాగ్రత కలుగును. ఈశ్వరునకుఁ జేయఁబడు పూర్ణయాత్మసమర్పణ మిదియే. కోరికయంకురములేకుండ రూపాంతర మెప్పు డొందుచున్నదో యప్పుడే యీపరిపూర్ణసమర్పణము సంభవించును. పరిపూర్ణాత్మసమర్పణములోఁ బరిపూర్ణ యాత్మ నివేదన యంతర్భూతము. (Self-surrender).

యోగమునకు రెండువిధానములు కలవు. మొదటి విధానమునందు మనుజుఁ డీశ్వరస్వీకారమునకై తనయధఃస్థితిని సిద్ధమొనర్చి యూర్ధ్వసహాయమొంది, యధఃస్వభావద్వారమునఁ బనిచేయుచున్నాఁడు. రెండవ విధానమున స్వప్రయత్నమంతయుఁ ద్యజింపఁబడుచున్నది. ఉత్తమస్వభావ మధఃస్వభావములోనికి దిగి క్రమముగా వశముజేసికొని దాని మార్చుచున్నది. ఆత్మనివేదన సంపూర్తిజెందినప్పు డా రెండవవిధానము మొదటిదానిని బూర్తిగాఁ బొఁదఱుముచున్నది. అహంకారము స్వయముగా నీశత్వమొందఁజాలదు. కాని మార్పునకుఁ బాత్రతవహించి యీశ్వరునకు నివేదనరూపమున లోఁబడుచున్నది. అహంకారమునకు స్వతసిద్ధమైన వ్యాపారమధఃస్థితుల కనుగుణ్యమైనది. కాబట్టి దానిశక్తికి హద్దుప్రతిబంధకము కలదు. తనపనిచేసికొనుట కీశ్వరుఁడు మనుష్యుని లోనికిదిగవలెను. క్రిందనుండి యీయుత్తమకార్యమును జెడఁగొట్టు నేజోక్యము లేనప్పుడే యదిపూర్ణముగా సాధ్యమగుచున్నది.

స్వప్రయత్నము, యాత్మశిక్షయనఁబడు మొదటి విధానమునకు నీశ్వరునియందు సంపూర్ణసమర్పణము కావలెను. అట్టి సమర్పణ మాత్మనివేదనయందు సమాప్త మొందవలెను. రెండవ విధానమునకుఁ బ్రయత్నము స్థిరపడిన శిక్షసాధనములు లేవు. శుద్ధి

చేయఁబడిన మానుషజాతీయ మొగ్గ యీశ్వరపుష్పముగా స్వకీయ నిర్మలానంద వికాస మొందవలెను. యోగముయొక్క స్వతసిద్ధ కార్య మీవిధమున వర్తించుచున్నది.

ఈరెండువిధానము లొకటితరువాత నొకటి వచ్చునవికావు. మొదటిది సమాప్తము కాకమునుపే రెండవది కొంత ప్రారంభ మగును. మనుజుని నడిపించునది మానవునికన్న గొప్పది యున్నత మైనది. అతని స్వభావ మన్నిముఖముల శుద్ధి కాకపూర్వమే పూర్తిగనో కొంతభాగమో యతని కదియపరోక్షముగాఁ గ్రిందనే వ్యక్తమగుచున్నది. మొదటినుండి యది యతనికి వ్యక్తము కావచ్చును. కాని రెండవవిధానమందు దాని పరోక్షాధికారము నిత్యము వ్యక్తమై యహంకారము మార్పుజెందుటకు పరిపక్వమొందె నని సూచించును. ఆత్మసమర్పణ మంగీకరింపఁబడుటకేగాక సిద్ధి పొందింపఁబడినదనుటకు సహిత మది సరియైనగుర్తు.





# యోగసంకలనము.



మూఁడవ అధ్యాయము.

అసలులో విడిచిపెట్టఁబడినది.



# యోగసంకలనము.



నాలుగవ అధ్యాయము.



## కర్మసన్న్యాసము—గీత.



జీవితము మన యోగమునకుఁ బరిశ్రమస్థానము. సామాన్య మానుషజీవితమును బరిపూర్ణ దివ్యజీవితముగా మార్చుటే దాని యుద్దేశ్యము. అతీతుఁడు సర్వమయుఁడగు నీశ్వరునికొఱకు నహంకా

రమును సన్యసించుటే దానిమార్గము. చిత్తహృదయభావముల నీశ్వరునియం దేకాగ్రతనొందించి సమస్తము వానికి సమర్పించుటే యీ మార్గము ప్రారంభించుట.

సామాన్య మనుష్యజీవితము (1) కర్మ (2) కామభోగములు (3) రాగము (4) భావములను నాలుగు విషయములతో నిండి యున్నది. ఈవివిధవిషయముల పర్యవసానమగు నొక విధమైన యంతరవృద్ధియేర్పడుచున్నది. ఈయంతరవృద్ధియే మానుషత్వము నకు ఫలము. మనుజుఁడు దేహధారియగుట కర్మరాగభావభోగజనిత మగు నీజ్ఞానాభివృద్ధికొఱకే. తక్కినవన్నియు దీనికి సహకారులు.

యోగ మనఁగా స్వభావవృద్ధిచే నావరణ బలాత్కారముచే వ్యక్తితో నుపయోగింపఁబడు నవకాశములచే నెమ్మదిగా వృద్ధిపొందుచున్న మందగమన విధానమును విడిచి, గమ్యస్థానమును సరాసరి పొందించు వ్యక్తిగల స్వతంత్రమగు తీవ్రవృద్ధి విధానమును స్వీకరించుట. అనంతమగు క్రమవృద్ధిని జెప్పుచు గమ్యస్థానమనుట తప్పే కావచ్చును. కాని సమీపగమ్యస్థానము కలదని, తత్ప్రాప్తికై మనుజుఁడు వృద్ధిపొందుచున్నాఁడని, నూతనజన్మయదేయని, విపుల ప్రకాశజ్ఞాన మదేయని, దివ్యమానుషత్వ మదేయని మనము గ్రహింపవలెను. మనము కోరునది పూర్ణమైన మార్పు. జీవునకుమాత్రమే కాదు. మన స్వభావముయొక్క యన్నిభాగములకు.

అహంకారమునకు మారుగా దేవుని బ్రవేశబెట్ట మనుచున్నాము. కామమునకు కామభోగములకు మారుగా నాత్మపరతలేని కామరహితస్థిత్యానందమును సర్వస్థితులలోఁ బ్రవేశబెట్టమనుచున్నాము. అహంకారజన్యమగు భిన్నభావమునకు మారుగా దివ్యప్రకాశముయొక్క విలాసరాసిని మన జ్ఞానవిషయములందుఁ బ్రవేశబెట్టమనుచున్నాము. అహంకారయుతమగు భిన్నచిత్తవ్యాపారములకు మారుగా స్వార్థత్యాగముగల యుత్తమ చిత్తమును మనకార్యములందుఁ బ్రవేశబెట్టమనుచున్నాము. అహంకారయుక్తములగు రాగ

ములకుమారుగా దేనియందు సమస్తరాగములు దివ్యానందప్రేమ లనఁబడు జంటయొక్క రూపాంతరములగుచున్నవో యట్టి సర్వవ్యాపకహృదయమును బ్రవేశపెట్టమనుచున్నాము. దివ్యమానవత్వమనగా నిదే. యోగముచే మనము సృష్టింపఁ బూనిన దివ్యపురుషుఁడిట్టి వాఁడేకాని యతిశయోక్తిగాఁ జెప్పఁబడిన మేధాశక్తి కార్యశక్తిగలవాఁడు మాత్రము కానేరడు.

సామాన్యమానుషజీవితమందు మూఁడు వంతులు కర్మయుండును. అరుదగు యోచకుఁడు కవిచిత్రకారుఁడు మొదలగు వారంతర్ముఖులు. కర్మకంటె యోచనేప్రధానముగాఁ గలవారు. కాబట్టి సామాన్యముగా నీశ్వరునకు మనకర్మల సమర్పించుట, కర్మలకేది ప్రభువగుచున్నదో, సమస్తకర్మల కేదియాధారమో, దేనివలనకర్మలు సాధ్యమగుచున్నవో, యట్టి దివ్యచిత్తోపయోగముకొఱకు మనకార్యశక్తుల వ్యక్తులసన్న్యసించుట, తుదకునహంకారయుతమగు మనకర్మల నూర్ధ్వవ్యక్తిగా నేయుండక మనలో వ్యక్తమగుచున్న నిరాటంకమగు దివ్యచిత్తజీవితశక్తి ప్రవాహముగామార్చుట, పరిపూర్ణయోగమునకు మిక్కిలి ముఖ్యములు.

మానసమును, మానసవ్యక్తిని, హృదయమును, హృదయరాగమును సమర్పించుటకు సన్న్యసించుటకు మొదటినుండి స్వతసిద్ధముగ నలవాటుపడినవారికి సహితము పరిపూర్ణసిద్ధిరావలెనన్నఁ గర్మమార్గ మావశ్యకము. లేకున్న వారు దేవునిఁ గనఁజాలరు. ఈజన్మమం దీశ్వరసంసిద్ధి కలుగదు. మరి వేరుజన్మయందే కలుగును. జ్ఞానముతోనో రాగముతోనో యీరెంటితోనో మనము ప్రారంభించవచ్చును. కాని దానివలన మనము ప్రత్యేక మంతరవర్తులమై తరువాత మనసిద్ధుల వినియోగించుటకుఁ గష్టపడుదుము. కర్మరాష్ట్రమును సహితము మనవిజయములకుఁ జేర్పఁదలచితిమా విశేషించి మనలో మనకు పనిచేసికొనుట కలవాటుపడి యున్నందున దానికిఁ దగనివారమగుదుము. లేదా మనకర్మ యలవాటుపడియున్న వెనుకటి మార్గముల ననుసరించును. లేక వెనుకటి సాధారణశక్తుల

ననుసరించును. లోనిసత్యము బహిర్నిర్మాణమునకుఁ గడుదూరమై యుండును. తేజశ్శక్తులులోన నరికట్టఁబడి సాధారణజను లుపయోగించు సాధనములందును జీవితమందును దాము వెల్లడగుటకుఁ బనికి రాకపోవును. మన మప్పుడు వేరొక లోకమందు నివసించుచున్నట్లు తోచును. భూమితో మనకు సంబంధము లేనట్లు కనుపించును. మన ము స్వభావము ననుసరించువారముగాన నెప్పుడైనఁ గర్మమార్గమ వలంబింతుమేని యీకష్టము కొన్నివేళల రాకమానదు. కాని ప్రథమమునుండి సంపూర్ణవృద్ధి యోగమునకు ముఖ్యము. మన మెంత దానికి దూరమందున్నను దాని ప్రాముఖ్యత మనకు జ్ఞాపకముండు నిమిత్తము కర్మయోగము ముందుఁ జెప్పుటమంచిది.

మిక్కిలి ప్రసిద్ధికెక్కిన కర్మయోగవిధానము భగవద్గీత. ఈభారతాంతర్గత మహోపాఖ్యానమందు కర్మయోగము సర్వకాలములకుఁ బనికివచ్చునట్లు ప్రగల్భముతోఁ జెప్పఁబడినది. మార్గము మాత్రమే పూర్తిగాఁ జెప్పఁబడెను గాని సంసిద్ధి (ఉత్తమరహస్యము) సూచింపఁబడెను. విపులముగా వృద్ధిచేయఁబడ లేదు. ఈదాపరికమునకుఁ గారణము లున్నవి. సిద్ధియనుభవయోగ్యము. బోధార్హము కాదు. అనుభవములేని మనుష్యునకు బోధయగునట్లు వర్ణించి చెప్పనలవికాదు. ద్వారముదాటి సిద్ధినొందిన జీవునకు వర్ణనతోఁ బనిలేదు. సమస్తదివ్యపరిపాకములు మనుష్యుని సాధారణానుభవము లోనున్న మాటలతో వర్ణింపవలసి యుండును. ఈమాటల కర్థమిటి వరకే తెలిసి వానికంతరార్థములఁ జెప్పనేర్చినవారికే బోధపడుచున్నవి. వేదకాలపు ఋషులు మొదటఁ జెప్పినట్లు జ్ఞానులైనవారికే యుత్తమజ్ఞానవాక్యము లర్థమగుచున్నవి. ఇతరుల కవి యస్పష్టముగా సూచించుచున్నవి.

గీతలోఁ జెప్పఁబడిన మార్గము లెవ్వి? దానితత్వ మంతయు నైక్యము (Unity) సమత్వమను (equality) రెండు గొప్పమాటల లోనిమిడ్చవచ్చును. దాని విధాన మేమనగా సన్యాసత్యాగములచే

స్వీకారము. అహంకారమునకంటె మహోన్నతమైన దానికిలోఁ బడుటచే స్వాతంత్ర్యము. ప్రశాంతినిష్క్రియలచే క్రియత్వము.

నిజమునకు సమస్తవస్తువు లద్వితీయాఖండబ్రహ్మమే. జంతుజాలములందు భిన్నముగాఁ దోచునుగాని నిజమున కన్నిటియందేకమై సమమైయున్నది. వెలికిఁ గాన్పించుదానియందే మనముజీవించవచ్చును. నిజతత్వమందు జీవించిన జీవించవచ్చును. వెలికిగాన్పించుదానియందే జీవింతుమా యహంకారస్వరూపులమగుదుము. స్వభావపద్ధతులకు లోఁబడుదుము. పైవికారములకు, ద్వంద్వగుణములకు సుఖదుఃఖములకుఁ గష్టసౌఖ్యములకు, జయాపజయములకు, మంచిచెడులకు, నదృష్ట దురాదృష్టములకు లోనగుదుము. స్వతంత్రేచ్ఛయను (Free-will) స్వేచ్ఛత మనకుఁ గలదుకాని లోతుకుదిగి చూచిన నదియొకభ్రమమాత్రమే. స్వభావపద్ధతులు స్వార్థపరత్వముగల మన యిచ్ఛద్వారా పరిణమించి, మనము దేనినిచ్ఛగించవలెనో, యెట్లిచ్ఛగించవలెనో, దేనికొఱకుఁ బ్రయత్నించవలెనో నిర్ణయించుచున్నవి. అట్లుగాక మనము నిజతత్వమందు నివసింతుమా యహంకారమును దాటి మన నిజస్వరూప మొందఁగలము. స్వభావపద్ధతుల మించఁగలము. జీవునకప్పుడు పూర్ణసత్యసమత్వముల సంపాదింతుము. దానివలన సమస్తభూతములతో సమస్తభూతములందు వెల్లడగుచున్నదానితో మనయేకత్వము తెలసికొందుము. ఈ యేకత్వసమత్వములే దేవత్వమునకు మూలములు.

ఇదే మనుజునకు సాధ్యమగు నిజమైనస్వాతంత్ర్యము. ప్రపంచములోనున్న స్వతంత్రేచ్ఛ యీశ్వరేచ్ఛయే. దాని నెరవేర్చునది స్వభావము (Nature). మనుష్యుని స్వతంత్రేచ్ఛ (Free-will) యొక యర్థమందు సత్యమనవచ్చును. స్వభావపద్ధతులకు సంబంధించనసమస్తవస్తువు లెట్లు సత్యములో యట్లే యీస్వతంత్రేచ్ఛసహితము సత్యము. మనస్సు స్వభావశక్తుల (Natural forces) సుడిపై సహాగిచేయుచు ననేకవిషయముల సరిచూచి స్థిమితమొంది యేదో యొకవైపున కొరగి నిర్ణయించి యెన్నుకొనుచున్నానను జ్ఞానముఁ

బడయుచున్నది. కాని వెనుకనుండి దానియెన్నికను నిర్ధారణచేయు నట్టి శక్తి నది చూచుటలేదు. ఏలననగా, నదియొక సమిష్టిమొత్తము. ప్రత్యేక నిర్ణయముల బహుళత్వముద్వారా పనిచేయుచుండుటచే నది మనకుఁ దెలియరాదు. మనస్సు తాను ఖండమగుటచేఁ దన్ను నడిపించుకాలము, చుట్టు యావరణము, వెనుకటి ప్రయత్నము, ముందటి ధోరణి యనువానిలోఁ బదింటికిఁదొమ్మిదివంతులెరుంగకనే యంత్రములో నొకభాగముపై సవారిచేయుచున్నది. తాను సవారిచేయుచున్నందున యంత్రము నడుపుచున్నాననుకొనుచున్నది. ఒక యర్థమం దదినిజమే. ఏలననగా, నిచ్ఛయని పిలువఁబడు నీమనోవృత్తి బుద్ధిపూర్వకమైన యెన్నికవలె మనకుఁ గానుపించు నాదృఢమగువృత్తి నిర్ణయము ; స్వభావముయొక్క మిక్కిలి బలవత్తరమగు నిర్ణయాంశములలో నొకటి. కాని మనోవృత్తిమార్గమును నిర్ధారణచేసి యిచ్ఛను నిర్ణయించునది వెనుక నున్నది. స్వభావమం దదియొక సమిష్టితత్వము. ఈసమిష్టితత్వమును నిర్ధారణ జేయుట, సమస్తవస్తువులందు వెల్లడమగుచున్న దివ్యేచ్ఛావిధానముయొక్క వివిధావశ్యకతలకున్న సంబంధము తెలుసుకొనుటే. ఈశ్వరుఁడు సర్వాంతర్గతుఁ డనియుఁ బ్రకృతిమాయచే యంత్రముపై నెక్కింపఁబడిన సమస్తజంతుజాలములఁ ద్రిప్పువాఁడనియు గీత చెప్పుమాట కర్థ మిదియే.

ఈదివ్యేచ్ఛ మనకుఁ గోత్రదికాదు. మనకు సంబంధించినదే. మనలో నున్నదే. అది మన యుత్తమాత్మ. మనకుఁ దెలియవచ్చుచున్న యిచ్ఛమాత్రముకాదు. అది మన యిచ్ఛ యంగీకరించుదాని నిరాకరించి నిరాకరించుదాని నంగీకరించును. దివ్యేచ్ఛ సర్వమెఱుగుచున్నది. మన యిచ్ఛ స్వల్పభాగమునే తెలుసుకొనఁగలదు. మన యిచ్ఛ మానసికవ్యక్తికలది. దివ్యేచ్ఛమానసికాతీతమగుటచే సూర్ధ్వవ్యక్తికలది. దివ్యేచ్ఛతో నేకమగునటుల మనయిచ్ఛను సన్యసించితిమా మనము దివ్యస్వాతంత్ర్య మొంది యసత్యమగు నజ్ఞానమందింక నుండము.

గీతలోని యనుభవసిద్ధమగు వేదాంతము తెలియఁగోరిన యెడల స్వభావమునకు (Nature) నాస్వభావముయొక్క ప్రభుపునకు, బ్రకాశమానమగు దివ్యేచ్ఛ యనఁబడు నీశ్వరునకు బ్రహ్మాండమంతలి క్రియాశక్తివిధానమునకుఁ దారతమ్యము స్పష్టముగా గ్రహించవలెను.

స్వభావమనగా (Nature) కార్యనిర్వాహకశక్తి. దానిక్రియలం దఖండ వ్యక్తియొక్క కళలున్నప్పటికది వ్యక్తిలేని జడమే. అనంతాధికారముగల శక్తితో నిండి తనకార్యములఁ గ్రమముగా నెరవేర్చుకొనుచున్నప్పటి కది యధికారికాదు. అది భోక్తకాదు. అది భోగ్యము. సమస్తభోగభారము వహించునది. అది పనికర్త. తెలిసికొనేవాఁడు దానిలో నున్నాఁడు. ప్రకృతికిఁ బురుషునకుఁగల ముఖ్య తారతమ్య మిదియే. ప్రకృతి యనగా స్వభావజీవుఁడు (Natural soul). పురుషుఁ డనగా జ్ఞానజీవుఁడు (conscious soul). ప్రకృతి పురుషుని జ్ఞానప్రభుత్వానందములఁ గలిగి పనిచేయుచున్నది. అజ్ఞానానంద ప్రభుత్వములఁ దాలోఁబడుటచే ప్రతిఫలించుటచే ననుభవించును. పురుషుఁడు తెలిసికొనుచుఁ బ్రశాంతుఁడై యున్నాఁడు. ప్రకృతి కార్యమును దనలో నెఱిగి యనుభవించుచున్నాఁడు. ప్రకృతిచేయవలసినకార్యముల నిర్ణయించుచున్నాఁడు. నిర్ణయింపఁబడిన కార్యములఁ బ్రకృతిజేయుచున్నది. పురుషుఁడు మాత్రము పనిచేయఁడు. ప్రకృతి పనిచేయుచుండగా దానిని గాపాడుచుండును. తన జ్ఞానమందుఁ దనకుఁ దోచినదానిని బ్రకృతిచేతఁ జేయించుచుండును.

జీవుఁడు ప్రకృతితోనైనఁ బురుషునితోనైన నేకీభావ మొందవచ్చును. ప్రకృతితో నేకీభవించినయెడల జీవుఁడు స్వతంత్రుఁడు భోక్తజ్ఞాత కానేరఁడు. ప్రకృతి క్రియావిధానములఁ బ్రతిఫలించును. ప్రకృతికి స్వభావమగు లొంగుబాటున జడకార్యకరణమునఁ బ్రవేశించును. పూర్తిగాఁ బ్రకృతియందు మునుగుటచే సంపూర్ణావ్యక్తుఁడో (inconcient) యర్ధవ్యక్తుఁడో (Sub-inconcient) యగును.

మన్ను లోహములలోవలె ప్రకృతిరూపములలోఁ బూర్తిగా నిద్రిం చును. వృక్షాదులలోవలెఁ గొంతవరకే నిద్రించును. తమస్సునకు లోఁబడును. తమస్సనగా మొద్దుతనము. అనామధేయత్వము. స్వత సిద్ధజ్ఞానమందుఁ బైకివచ్చినకొలది రజస్సునకుఁ గ్రమక్రమముగా లోఁబడును. రజస్సనగా వ్యక్తితోఁగూడుకొన్న కామముచేఁ బ్రేరే పింపఁబడిన కార్యపద్ధతి. ఇంకను బైకివచ్చినకొలది సత్వమును బొం దును. సత్వ మనగా నానందదాయకమగు స్వతంత్రజ్ఞాన ప్రకాశము యొక్క పద్ధతి. దీనివలన స్వతంత్రుఁడు, ప్రభువు. జ్ఞాత, భోక్త యగు పురుషుని నిజస్వభావమున కారోపింపఁ గలఁము. ఇవన్ని యు నొకదానితో నొకటి కలిసియున్న విధానములు. వాని పరస్ప రస మ్మేళనకార్య మహంకారవ్యక్తితోఁగూడి క్రియానుభవముల నిర్ణయించును.

అహంకారసంబంధమే జీవుఁడు ప్రకృతియందు నిమగ్నుఁడై యున్నాఁడనుటకు గుర్తు. మఱియు నాయహంకార చిహ్నములేవనగా సమత్వశూన్యత్వము. ప్రకృతికి లోఁబడి జీవుఁడు నిర్మించు ద్వంద గుణానుభవ వివిధత్వము. అధికారభోగములకు,జయాపజయములకు, నదృష్టదురాదృష్టములకు, మంచిచెడులకు, సుఖదుఃఖములకు, కష్ట సౌఖ్యములకుఁ బోరాట. సమస్తస్థితులందు జీవుఁ డేకత్వ మెప్పుడు చూచుచున్నాఁడో యప్పుడే యీద్వందగుణముల విడిచి ప్రకృతికిఁ దనతోఁ గల నిజసంబంధవిధానముల లక్ష్యపెట్టక దాని ద్వందభావ ముల సమదృష్టిఁ జూచుచు స్వతంత్రాధికారియై జ్ఞాతయై స్వచ్ఛ మగు స్వకీయ స్థిత్యానంద మనుభవింపఁ గలడు. కర్మయందు బరిణ మించునుగాని కర్మబద్ధుఁడుకాఁడు. కర్మఫలానుభవ మట్టి జీవునకుం డదు. ప్రకృతిదే యాకర్మఫలము. జీవున కప్పు డీసమస్తవిధానము తన యగాధశాంతానంద సమత్వముల జెరుపలేని తరంగ క్షోభము కాఁగలదు.

ఇవి మనప్రయత్నమునకు ముఖ్యలక్షణములు. అవి యీక్రిం దనుదహరింపఁబడిన నొక విధమైన లక్ష్యార్థమును సూచించు చున్నవి.

(1) అహంకారమందుండక దేవునియందుండుట. అనగా నహంకారవ్యక్తితో నుండక ప్రకాశమానుఁడగు సర్వాత్మయొక్క జ్ఞానము కలిగియుండుట.

(2) సమస్తమందు దేవుని సమస్తమందుఁ దన్నుఁ గాంచుచు, సర్వవిషయముల సర్వభూతములఁ దనవలె దేవునివలెఁ జూచుచు సర్వసముఁడై యుండుట.

(3) అహంకారమందుఁ బనిచేయక దేవునియందుఁ బనిచేయుట. స్వంతయవసరముల ననుసరించి కర్మనెన్నుకొనక దివ్యేచ్ఛయొక్క ప్రేరేపణ పరిపాలనక్రిందఁ గర్మజరుగనిచ్చుట. కామముచేతను స్వతంత్రేచ్ఛచేతను (Free-will) కర్మ నిర్ణయింపఁబడకూడదు. ఆత్మజ్ఞానమువలన నాత్మానందమువలన స్వభావాతీతమై స్వభావమును నడుపు దివ్యాత్మకు మనుజుఁడు వ్యక్తితో లోఁబడుట వలన కర్మవృద్ధి జెందవలెను.

అనుభవసిద్ధమగు నేశిక్షవలన నిట్టిపరిపూర్ణత్వ మొందఁగలము? అహంకారవ్యక్తి యహంకారవ్యాపారము తొలగించుట మన మన్వేషించు పూర్ణత్వమునకు సాధనమగుటచే, మనము మొదట విప్పదలచిన ముడి కర్మయగుటచే నాముడి యెక్కడ గట్టిగా వేయఁబడినదో యచ్చట విప్పుటకుఁ బ్రయత్నించవలెను. మన యహంకారబంధమునకుఁ గామము- యహంకారవ్యక్తి- యను రెండు ముళ్లుకలవు. మనము తొలగింపవలసిన యజ్ఞానశక్తు లీరెండే.

కర్మవిధానమందుఁ గామము ఫలాపేక్షరూపమునఁ బరిణమించుచున్నది. అది యాంతరంగిక ఫలమగు సంతోషమో యహంకారరాగ సంతుష్టియో, గొప్పభావకాంక్షల జయమో, కావచ్చును. అది బహిర్ముఖఫలమైన యైశ్వర్యమో గౌరవమో జయమో వైభవమో కావచ్చును. ఇది యన్నియు మనల బంధించుటకు, స్వతంత్రుల మని భ్రమపెట్టుటకు నహంకారము జూపెడి యెరలు. కాని

నిశ్చయమునకుఁ బ్రపంచమును నడుపుచున్న కామముయొక్క ఘన మైన లేక నీచమైన రూపాంతరముచే బంధింపఁబడి యున్నాము. కాబట్టి ఫలాపేక్షలేక కర్మచేయుటే గీత నిర్ణయించిన మొదటికర్మ సూత్రము.

ఈసూత్రముపై కి బహుసులభముగాఁ దోచును. కాని మన స్ఫూర్తిగా దానిని బూర్ణముగా నెరవేర్చుట బహుకష్టసాధ్యము. మన మీసూత్రమును విశేషించి యసంపూర్తిగా నుపయోగింతుము. కామవిషయము నడ్డుటకై దీని నుపయోగింతుము. కామోద్రేక మణగి యహంకారము శిక్షనొంది కొంతమారినఁ దృప్తి నొందుదుము. ఈయసంపూర్తిశిక్షను ధర్మపరిజ్ఞానమని కామనిరోధమని సన్న్యాసమని పరిత్యాగమని యీశ్వరేచ్ఛకు లోఁబడుటయని వివిధ నామములఁ బిలుతుము. గీతాభిప్రాయ మిదికాదు. తగ్గింపులు సమాధానములు లేక జీవుని పూర్తిగా మార్చెడుఁ బరిపూర్ణత్వమే గీతాభిప్రాయము.

సమస్తఫలముల ప్రతిఫలముల విషయమై సర్వసమత్వమేదా నిపరీక్ష. ఐశ్వర్యదారిద్ర్యములు గౌరవాగౌరవములు ఖ్యాత్యాపఖ్యాతులు జయాపజయములు సుఖదుఃఖములు మనలఁ గదలించలేక పోవుటేగాక రాగములందంటక కార్యములంగంటక మానసమందంటక మనల నెప్పుడు విడిచిపోవుచున్నవో యప్పుడు గీత బోధించిన పూర్ణవిముక్తి వచ్చుచున్నది. మఱి వేఱువిధమున విమోచనరానేరదు. ఎంత కొద్దిపాటి ప్రతిఫలమున్నను శిక్ష యసంపూర్తియనియు మనలో కొంతభాగ మింక నజ్ఞానము నంగీకరించి దాని విడువకున్నదనియు రుజువగుచున్నది. మనయాత్మ జయ మప్పుడు కొంతమట్టుకే సిద్ధించినది.

సర్వసమత్వముగల మానసమును బోలినవికొన్ని కలవు. వానిని జూచి గితబోధించెడి సమత్వమని పొరపడఁగూడదు. గర్వజనిత సమత్వము, యశ్రద్ధజనిత సమత్వము, పరాభవముచే సంభ

వించెడి త్యాగజనిత సమత్వము మొదలగునవికలవు. స్వభావమం దలి యన్నియు నహంకారసంభవములే. ఇంద్రియనిగ్రహజనిత సమత్వ మాత్రికసమత్వము, భక్త్యైకాంతజీవిత సమత్వములుకూడఁ గలవు. ఈసమస్తము పరిపూర్ణ సమత్వ సిద్ధికిఁ బ్రయత్నములు.

నిశ్చయముగా నట్టి గొప్పఫలము వెంటనే ప్రాప్తించదు. లోనున్న జీవుని వెలికార్యములనుండి వేరుజేసి యట్లువేరుకాఁబడిన జీవుని శాంతసిమితముల నతని యుపకరణములకు సహితము వ్యాపింపఁజేసి, ప్రాపంచిక విషయముల మన ముఖ్యాంశమున కంటని య్యక వానిని సహించుట మొదట నేర్చుకొనవలెను. ఇట్టి విధాన మందింద్రియ నిగ్రహమని వేదాంతశాస్త్రమని మతాభినివేశమని కొన్ని స్వల్పసహాయముల మనముపుచ్చుకోవచ్చును. కాని పరిపూర్ణప్రశాంతజన్య సర్వసమత్వము కొఱకు ననివార్యమగు నానందప్రాప్తికొఱకు తుదకు వానిని విడువవలెను.

అటులైన మనము పనిచేయుటమాత్ర మెట్లు ? మనుష్యుఁడు కామము ధనగౌరవకాంక్ష శరీరమానస సంతుష్టి తనభావచిత్త దేశయిష్టదేవతలు లోకమందంతట వ్యాపించవలెనను కోరికలుండుటచేఁ బనిచేయుచున్నాఁడు. వీనిలో నేదైన మనకర్మలఁ బ్రేరేపించకున్నఁ బ్రేరణాశక్తి రహితములై కర్మలే తప్పక నశించును. దీనికిగీత తనమూఁడవ సూత్రమందుఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నది. "సర్వకర్మల నీశ్వరునికొఱకుఁ ద్యజించవలెను." గీతకు ముఖ్యభావమిది. దీనివలన జ్ఞానకర్మ భక్తులు సంకలన మొందింపఁ బడుచున్నవి.





# యోగసంకలనము.



## అయిదవ అధ్యాయము.



## త్యాగము—త్రివిధమార్గము.



త్యాగధర్మము—తన్ను తనకున్నదానిని బరునకు భక్తిశ్రద్ధలతో నిచ్చుట—ప్రపంచికాహంకార ప్రమాదముల తగ్గించి, దిద్ది, తొలగించుటకే లోకమునకంపబడిన దివ్యకార్యమై యున్నది. "లోకజనకుఁడు ప్రజల సృజించునపుడే త్యాగమును దోడిచ్చె" నని గీత చెప్పుచున్నది. ప్రపంచమం దహంకార మేకాకియై యుండ లేదు. తానే ముఖ్యము కాదని నిరహంకారతతోఁ దనకులోఁబడమని బలాత్కరించు గొప్పవస్తువు మఱియొకటి కలదని త్యాగమహంకారమునకుఁ దెల్పుచున్నది. త్యాగధర్మమును వ్యక్తితో నంగీకరించని వారిచే సహితము స్వభావము (Nature) బలవంతముపై త్యాగముఁ జేయించుచున్నది. తప్పక చేయించుచున్నది. ఏలనన నది యొక స్వభావగుణము. అహంకార మొంటరినుండఁజాలదు. తనకిష్టమైనను బ్రత్యేకముండ నేరదు. త్యాగమెల్లప్పుడు చుట్టునుండు వారికి స్థూలప్రాణమానస సముదాయమునుండి కొంతయిచ్చి ప్రతిగ్రహించుచున్నది. ఇట్టి దాన ప్రతిగ్రహణమువలనఁ దావృద్ధినొంది సమిష్టివృద్ధికి సహాయమిచ్చును.

కాని వ్యక్తిలేక, విశ్వమునకుగల గొప్పహక్కు యెట్టిదో తెలియక సహంకారముతోఁ ద్యాగమొనరించిన మనుజునకు దుఃఖప్రాప్తితమగువృద్ధి జడఫలముల నిచ్చును. ఈధర్మముతో హృదయ చిత్తజ్ఞానము లేకమైనప్పుడే నిజమైనసంతసము త్యాగబలము వచ్చును. మఱియు జ్ఞానమెచ్చట సమాప్తమొందుననగా, మన తోటిపాటివారికివ్వనీ, దేవతలకివ్వనీ, శక్తులకివ్వనీ, యెవరికిచ్చినను, మనమిచ్చునది యందఱసమిష్టి యాత్మకే మనయాత్మకేనను వ్యక్తి యందు సమాప్తమొందును. “మనము భార్యను భార్యయని ప్రేమించుటలేదు. ఆత్మయని ప్రేమించుచున్నాము.” అని యాజ్ఞవల్క్యుఁ డుపనిషత్తునందు చెప్పుచున్నాఁడు. నీచార్థమందు సహంకారప్రేమ విషయమునదిది నిజమైనయెడల, పరమార్థమందు నిరహంకారప్రేమ విషయమున సహితమిది నిజమగును. సారాంశము నకు సమస్తప్రేమ సమస్తత్యాగము స్వభావముయొక్క యహంకార నిరోధము. తిరిగి పొందఁబడుచున్న యేకత్వముకొఱకు స్వభావముయొక్క యభిలాష ప్రకటనము. సమస్తయేకత్వము సారాంశమునకు నాత్మను గనుగొనుటే. నిజమైన యేకత్వమనగా సమానార్థపరులగు వివిధజీవుల సంఘము, చేరికకానేరదు. ఒకరికొకరు పరిచయము కలిగియుండుట, యొకరినొకరు జాలిపడుట సహితముకానేరదు. ఇతరులందు మనయాత్మను గనుగొంటిమా యప్పుడు వారితో నేకత్వమొందుచున్నాము. సమ్మేళనస్థూల యేకత్వమనఁబడును. దానిత్యాగము పరస్పర సహాయమే. ఒండొరులు సహాయమొనరించుకొనుటే. అనురాగముల కూటము రాగముల యేకత్వ మనఁబడును. దానిత్యాగము పరస్పర సంతృప్తే. పరిపూర్ణ యేకత్వము విజ్ఞానసంబంధమైనది. దానిత్యాగము పరస్పరమాత్మదానము. కలసిపోవుట. పరస్పరాత్మదానపరిపూర్ణత్వముకొఱకుత్యాగముసృష్టిలోఁ బ్రయత్నించుచున్నది. అట్టి పరస్పరాత్మదానము దాతదేయములందేకాత్మవ్యక్తి నిచ్చుచున్నది. ఈత్యాగపరిపక్వమే మనుజుని శ్రద్ధాభక్తిపరిపక్వము. అందు సహితము శ్రేష్ఠమేదనఁ బరిపూర్ణ పరస్పరాత్మదానమే. రెండుజీవు లొకటిగాఁ గలసిపోవుటే.

పరిపూర్ణమైన యీత్యాగభావమే గీతలోఁ జెప్పఁబడిన బోధకు మూలము. ఇది సాధారణభావమువంటిది కాదు. దాని సారమాత్మ వినాశముకాదు. దానిధోరణి యాత్మనిర్మూల మాత్మనాశమాత్మహత్యల నిరుత్సాహ పరచుట. అహంకారము తీవ్రముగా బలవత్తరముగానున్నప్పుడు కొన్నివేళల కావలసివచ్చును. అహంకారబలమణచుటకు నావశ్యకమగును. కాని గీత యీమార్గమును నిరాకరించుచున్నది. నిశ్చయముగా నంతస్థితాత్మ దేవుఁడే. అది కృష్ణుఁడు. అది యీశ్వరుఁడు. బాధింపఁబడి నిర్బంధింపఁ బడకూడదు. వృద్ధిచేయఁబడి కాపాడఁ బడవలెను. తన దుఃఖప్రమాదములకుఁ గారణములు శత్రువులగు కామక్రోధముల, సర్వసమత్వశూన్యత్వబహిరంగ సుఖదుఃఖానుబంధములఁ ద్రెంపి పాఱఁ దఱుమవలసియున్నది. త్యాగభావ మాత్మదానము కాని యాత్మవినాశముకాదు. దాని భావమాత్మ నిర్మూలనముకాదు. పూర్ణత్వములేని యహంకార మణచుటచే, దేవునియందు సమస్తవస్తువులం దితరులందు స్వతసిద్ధమగు నిజపరిపూర్ణత్వము కనిపెట్టుటవల్ల నాత్మసంసిద్ధినొందుటే దానిభావము. త్యాగమనగాఁ బ్రతిఫలములేకుండ నిచ్చుటకాదు. అది పరస్పరపోషణము. ప్రతిఫలము కోరకపోయినను, కావలె నని పట్టుపట్టకపోయినను, తప్పకవచ్చునను వ్యక్తి మట్టుకుఁకలదు. తన్ను వ్యర్థముగా దేవున కిచ్చుటలేదని జీవున కెఱుకే.

దానము ప్రతిగ్రహించువాఁ డెట్టివాఁడు? దాన విధాన మెట్టిది? మన దాన మితరులకుఁ గాని దైవశక్తులకుఁ గాని యివ్వవచ్చును. లేక సర్వేశ్వరునకే యివ్వవచ్చును. పత్రము, పుష్పము, తోయము, తండులముష్టియేదైన దానమివ్వవచ్చును. ప్రతిగృహీత యెవఁడైన, దాన మేదైన, ప్రతిగృహీత నిరాకరించిన, సమస్తాంతర్యామి యీశ్వరుఁడే దానమందువాఁడు. మనలో సమస్తప్రపంచములో నిండియున్న యీశ్వరుఁడే సర్వకర్మలకుఁ బ్రభువు. మనకర్మలు ప్రయత్నము లనేకరూపములఁ బొందిన యీశ్వరునకై తెలిసి

మో తెలియకనో చేయఁబడుచున్నవి. ఏభావమున నేభావమున నీశ్వరుని సమీపింతుమో యాయాభావమున నాభావమున మన దాన మతఁడు ప్రతిగ్రహించును. ఫలము సహితము కర్మనుబట్టి కర్మోద్దేశ్యమునుబట్టి యుండును. సమస్తేతరదానములు గొప్పశక్తులకు దేవతలకర్పించిన క్షణభంగురములు. అసంపూర్ణములు. అహంకారయుతములు. వానిఫలములు సహిత మసంపూర్ణములే; యహంకారయుతములే, క్షణభంగురములే. అనుమానించక ధారాళముగ భక్తిజ్ఞానములతో నాత్మకు, సర్వోత్తమునకు, సర్వేశ్వరున కొసంగినదే పూర్తిగా నంగీకరింపఁబడును. అట్లు తన్నుఁ దాదానముచేసికొన్న జీవునకు దేవుఁడు తన్నిచ్చుకొనుచున్నాఁడు. ఆత్మను కనుగొందుము. సర్వోత్తముని పొందఁగలము. సర్వేశ్వరుని జేరఁగలము.

గీత మన సమస్తజీవితమును వ్యక్తిగల దానముగాఁ గాని యీశ్వరున కెడతెగని భక్తియుక్తముగు నాత్మార్పణముగాగాని మార్చమనుచున్నది. మన సమస్తకర్మలు కొద్దివికాని గొప్పవికాని సాధారణమైనవికాని యసాధారణమైనవికాని యహంకారమునకు వెలినున్న యీశ్వరున కిచ్చుచున్నామని సమర్పణ వ్యక్తితోఁ జేయవలెను. మన మిచ్చునపు డిచ్చునదియెట్టిదైనను ప్రతిగృహీత యెట్టివాఁడైనను సమస్తమందున్న దివ్యమూర్తికి దేవున కిచ్చుచున్నామను వ్యక్తి మన కుండవలెను. మనము భుజించునపుడు వానికేనివేదించుచున్నా మను జ్ఞాన ముండవలెను. స్థూలపరత్వ సంతృప్తియనుమాట విడువవలెను. మానవజాతికో, మనకో, యితరులకో గొప్పకార్యము తలపెట్టినప్పుడు, జాతి మనము పరుఁడనుమాట విడిచి, యెవరివలన సమస్తకాంక్షలు ప్రయత్నములు సాధ్యమగుచున్నవో యెవరియందట్టి కాంక్షలు ప్రయత్నములు జరుగుచున్నవో, యెవరి కొఱకట్టి కాంక్షలఁ బ్రయత్నముల స్వభావము (Nature) మన యొద్దనుండి స్వీకరించి యర్పించుచున్నదో యట్టి సర్వేశ్వరున కనంతునకుఁ బరమోత్తమునకు నివేదించుచున్నా మనుత్యాగభావ ముండవలెను. స్వభావ మేకార్యములఁ జేయుచుండగా మనము వానికి

సాక్షీభూతుల మగుచున్నామో యట్టి విషయముల సహిత మావ్యక్తితోనే చూడవలెను. "మన యుచ్ఛ్వాస నిశ్వాసముల హృదయ సంచలనముల నట్టిత్యాగములనే భావించవలెను.

ఇట్టి భావాభ్యాసముల వలన మనలక్ష్యార్థమునకు మిక్కిలి ముఖ్యమైన మూఁడు ఫలములుకలవు. (1) భక్తివర్జితమై యిట్టిశిక్ష ప్రారంభింపఁబడినను తుద కది యుత్తమపరిపూర్ణభక్తినే తప్పక నిచ్చును. సర్వవస్తువు లందీశ్వరుఁ డున్నాఁడను వ్యక్తి, మనభావ కర్మలందుఁ బ్రతిక్షణ మీశ్వరునితో నైక్యమొందుట, మనస్థితినంతయు నీశ్వరునకు సమర్పణఁజేయుట, యీయోగాభ్యాసమం దంతర్భూతములు. భావమం దెడతెగని యీయాత్మైకభక్తిని నిలుపుటచే దివ్యతమునిపై నుత్తమభక్తిప్రేమలు తప్పక నావిర్భవించును. వానితోపాటు సమస్తజనులందు భూతములందు జంతుజాలములందుఁ బ్రేమయుద్భవించును. గనుక నీమార్గము పరిపూర్ణభక్తిమార్గ మనవచ్చును.

(2) దీనితోపాటు సమస్తము తానని, యీశ్వరుఁడు సర్వమందున్నాఁడని, సర్వ మీశ్వరునియం దున్నదని, సర్వ మీశ్వరుఁడేయని సదా స్మృతిధ్యానములందుఁ గలవు. ఎడతెగని యీస్మృతిధ్యానము, లెవ్వఁడు సర్వమగుటచే సర్వవివిధాకారముల కతీతుఁ డయ్యెనో, యట్టి స్వయంప్రకాశమాన సర్వవ్యాపకుఁ డొక్కఁడే యను నవిచ్ఛిన్నపరిపూర్ణజ్ఞానమవి తప్పక తుదకిచ్చుచున్నవి. మన మేదిచూచిన విన్నఁ దెలుసుకొన్న నతఁడేయనిగ్రహింతుము. గనుక నీమార్గము పరిపూర్ణజ్ఞానమార్గ మనవచ్చును.

(3) మనతో సంబంధము కలదని సమస్తజీవరాసులకొఱకు, మనుష్యజాతికొఱకు, దేశముకొఱకు, కుటుంబముకొఱకో, నిరుగు పొరుగువారికొఱకు, భిన్నభావముతోఁ దనకొఱకుఁ గాక, నీశ్వరుని కొఱకు నీశ్వరున కుద్దేశించి సమస్తము చేయఁబడుచుండుటచేత త్యాగమను నీయోగాభ్యాసము సమస్తకర్మలయం దహంకార వినాశ మొనరించుచున్నది. ఈసమస్తకర్మల జీవితముల దేవుఁడు తనకుఁ

దాని వేదించుకొనుటయని తుదకు గ్రహింతుము. గీతలోఁ జెప్పఁబడిన ట్లు బ్రహ్మమందు బ్రహ్మముచే బ్రహ్మమునకు బ్రహ్మార్పణము చేయఁబడుచున్నదని యనుభవము కలుగును. గనుక నీమార్గము పరిపూర్ణకర్మమార్గ మనవచ్చును. పరస్పరసంబంధములగు నీమూఁడు మార్గములు త్యాగముచే నేకవిధానముగా స్వతస్సిద్ధముగానే చేయఁబడుచున్నవి.

మనము బహుముఖముల నాత్మజ్ఞాన మొందఁగోరినయెడల ప్రతిమార్గమునకు సాధ్యమైన సంపూర్ణవిషయముల వెలిబుచ్చుటకు సరియైన ప్రయత్న ముండవలెను. ఈశ్వరుఁడు బహుముఖముల నావిర్భవించుచున్నాఁడు. వివిధ యీశ్వరానుభవముల సమ్మేళన మొనర్చుటయందు మన నిజపరిపూర్ణత్వమున్నది. ఈసంకలనమున కిదే యావత్ప్రయోజనము. దాని యుపయోగము.

ఈశ్వరజ్ఞానవిషయమై గీతవివిధస్థితుల స్వీకరించుచున్నది. మొదటివిషయ మీశ్వరుని శుద్ధతత్వములేవో బ్రహ్మాండముతో వానికిగల ముఖ్యసంబంధములేవో తెలిసికొనుటే. అట్టి పరిజ్ఞానము లేకున్న నిజజ్ఞానము కలుగనేరదు. ఆశుద్ధతత్వమే సృష్టింప బడని యాత్మస్థితి. ఆసంబంధమే సృష్టింపఁబడిన స్థితులు. ఆశుద్ధత్వమే యుభవస్థితి. ఆసంబంధమే పరిణమించుట. ఇదియొక సూత్రము, వేదాంతశాస్త్రభావము. కాని యోగాభిప్రాయము భావముకాదు. అనుభవము. కాబట్టి సర్వవస్తువులం దేదినివసించుచున్నదో, దేని యందు సర్వవస్తువులుండి పనిచేయుచున్నవో యట్టి సత్యానంతప్రత్యక్షపదార్థమును బ్రత్యక్షముగాఁ జూచి యనుభవించవలెను. గీత బోధించు దివ్యజ్ఞానసూత్ర మేమనగా నాత్మయందు సర్వస్థితులను, సర్వస్థితులం దాత్మను గ్రహించుటమాత్రమేగాకఁ బ్రత్యక్షమునఁ జూచుట.

సమస్తవస్తువులం దాత్మయేకరూపమున నున్నది. అది యేకరూపమగు ప్రత్యక్షము. వివిధవస్తువులందు వివిధముకాదు. నేను దానిని నాలోఁ దెలిసికొనవచ్చును. తరువాత నాలోఁ బ్రపంచమును గాంచి, ప్రపంచము నేనని భావించి, సమస్తజంతుజాలముతో నన్ను

సమన్వయముచేసికొనవచ్చును. దానికొఱకు మొదట నితరులలో వెతుకక నాలో వెతకెదను. అచ్చట దానిఁ గనిపెట్టి తెలిసికొనుట సులభము. చూడగానే యాయాత్మయం దహంకార మణగకున్న నాజ్ఞానము నిజమైనదిగాక యసంపూర్ణమై యుండును. నాలోనెచ్చట నో యహంకార సంబంధియగు నభ్యంతరముండవలెను. లేకున్న నేను మొదటనే దానిని ప్రపంచమందు నితరులందుఁ జూడఁగలను. సర్వమునకు స్థానమై నిజమున కితరులతో సంబంధములేని శుద్ధస్వాయం భువుగాఁ దెలిసికొందును. కాబట్టి దానియందు మదీయ వ్యష్టిస్వరూపవ్యక్తి నశించుచున్నది. ఏవిషయముతోఁ బ్రారంభించిన దరువాత కేవల సత్యత్వసమస్తసత్యత్వముల రెంటిని బొందవలెను. తన స్వస్వరూపస్థితియం దున్న యాత్మను సమస్తజంతుజాలమందున్న యాత్మను బొందవలెను.

కాని యాత్మ యిట్టివాఁడని తెలిసికొన్నమాత్రముచాలదు. ఈశ్వరుని నిర్గుణముగా నవ్యక్తప్రసన్నముగాఁ దలచి, యతనికి సగుణత్వము మనతో సంబంధములేదన్నయెడల మనము జ్ఞానమును వృద్ధిచేసి మనస్సును దృప్తిచేయవచ్చునేకాని హృదయము నసంతుష్టితో విడుతుము. భక్తిప్రేమలు పరిపూర్ణతకై మనకిచ్చు సమస్త ఘనవిషయములఁ గోల్పోదుము. మన జ్ఞాన మసంపూర్తిగానే యుండును. మానసము పేక్షించు నిర్మలాత్మజ్ఞానము మనకువచ్చును గాని హృదయకాంక్షితమగు దేవుని జానవైభవము మనకుఁ గలుగదు. హృదయమానసాతీతమగు నిజజ్ఞానమందు హృదయమానసములు రెండు సమన్వయ పరిపూర్ణత్వముల నొందియుండును. హృదయమునుగాని మనస్సునుగాని యశ్రద్ధజేసి నిరాకరించితిమేని పరిపూర్ణత్వమొందఁజాలము. కాబట్టి యాత్మను దెలిసికొనుటమాత్రమేగాక ప్రభువును తెలిసికొనుట, యనగా, దేవుని సగుణత్వనిర్గుణత్వములఁ దెలిసికొనుట యావశ్యకమని గీతచెప్పుచున్నది.

దివ్యసగుణత్వ మనగా నవ్యక్త నిర్గుణ నిర్విషయపదార్థముగాక, ననంతమగుటచేఁ బ్రత్యేకానుభవాతీతమైన బ్రత్యక్షసజీవ

పురుషుఁడు. కాని యాయనుభవములకు వేఱైనవాఁడుకాఁడు. సర్వానుభవసంబంధములతో ముఖ్యముగా మనము మనుష్యులమగుటచే మానుషానుభవసంబంధములతో నిండినవాఁడు. దేవుఁడు మనుష్యుని వెలివేయుటలేదు. మనుష్యుని తనలో నిముడ్చుకొనుచున్నాఁడు. మన మానుషత్వము ననుసరించి దేవునెఱింగినఁ దప్పులేదు. దేవునకు మనుష్యవృత్తుల నారోపించినఁ దప్పు కానేరదు. మార్పే ముఖ్యమని యొకవిషయమును నమ్మి యనంతుని యితరవిషయముల విడిచినఁ దప్పు జేసినవారమగుదుము. గనుక హిందూయోగములు మానుషవృత్తుల నంగీకరించుచున్నవి. స్నేహితునకు స్నేహితునకుఁ గల సంబంధము, సేవకునకు యజమానునకుగల సంబంధము, తల్లిదండ్రులకు శిశువునకుఁ గల సంబంధము, శిశువునకుఁ దల్లిదండ్రులకుఁగల సంబంధము, ముఖ్యముగాఁ బ్రియునకుఁ బ్రియురాలికిఁగల సంబంధముల నతనికిఁ గల్పించినవి. వీనిమూలకమునఁ దర్క-విచారణకు వెల్లడికాని కొన్ని రహస్యముల మన మెఱుగఁగలము. అవ్యక్తమగ్రాహ్యమనిర్వచనీయమగు దానికై ప్రయత్నించుటకంటె యీదైవసంబంధముల గీత యొప్పుకొనుచున్నది. ఎట్లైన మన పరిపూర్ణత్వమున కవి ముఖ్యముగా నావశ్యకములు.

కాబట్టి దైవము సమస్తభూతముల కీశ్వరుఁడు, స్నేహితుఁడు, పూజార్హుఁడని గ్రహించి సమీపించి యనుభవించవలెను. ఇది యతని స్వస్వరూపమందు మాత్రమేకాదు. మానవాకారమందు సమస్తభూతములందు దాగినవానిగా సహితము తెలిసికొనవలెను. అందరిలోఁ గాపురముచేయువాఁడు మనకు గోచరుఁడు గాకున్ననొక్కఁడే, యతఁడే. ఈవిధమున భిన్నత్వము తెలుసుకొనుచున్నాము. అతీతేకత్వానుభవమొందుటేగాక, నేవిలేకున్న భూమిపై జీవితము సాధ్యముకాదో యట్టి వివిధసంబంధములతో సమన్వయముగాంచిన హృదయమందు బ్రహ్మము స్వీకరించుచున్నాము. అట్టి సంబంధములాయేకత్వమందుఁ బరిపూర్ణత నొందుచున్నవి.

ప్రపంచముతో దేవునకుఁ గలసంబంధములయందుఁ గ్రియల యందు దేవుని తెలిసికొనవచ్చును. కర్మమార్గమునకు మిక్కిలి యను గుణ్యమగు జ్ఞానమిదియే. ఇందుసహితము సగుణనిర్గుణములు కలవు. జ్ఞాన జీవుఁడు (conscious soul) స్వభావజీవుఁడ (Nature soul) నఁబడు పురుషప్రకృతుల జ్ఞానమే నిర్గుణజ్ఞానము. ఏది తెలిసికొనునో యనుభవించునో యది నిర్గుణపురుషుఁడు. ఏదిపనిచేయునో, జ్ఞానానందానుభవములఁ గలిగించునో యది ప్రకృతి. ప్రతిజంతు వెవని యసంపూర్ణావిర్భావమగుచున్నదో యట్టివాఁ డీశ్వరుఁడని గ్రహించుటే పురుషుని సగుణజ్ఞానము. అతని యావిర్భావహేతువగు శక్తి యను జ్ఞానమే ప్రకృతి సగుణజ్ఞానము. మొదటిది యనగా నిర్గుణ జ్ఞానము, క్రియావిర్భావములకు బద్ధుఁడు కాని పురుషునియొక్క నిర్మలజ్ఞానమందు జీవుని నిలుపుటకు నాజీవుని క్రియావృత్తులనుండి పైకిలాగుటవలనఁ గలుగుచున్నది. రెండవది యనగా సగుణజ్ఞానము, భక్తి జ్ఞానములద్వారమున నీశ్వరుని దెలిసికొన్నబిమ్మటఁ దానీశ్వరున కుపకరణముగాను బ్రతినిధిగాను గర్మలస్వీకరించి, మన కొఱకుఁ గాక నీశ్వరార్థమువానిఁ బ్రతిగ్రహించి, యహంకార సంజనితకాంక్షఁగాక నుత్తమ ప్రేరణాను గుణ్యముగ నాకర్మలఁ జేయుటవల్లఁ గలుగుచున్నది.

భక్తికర్మల స్వీకరించి వానిని సిద్ధినొందించి తాను వానిచే సిద్ధినొందుచుఁ బరిపూర్ణజ్ఞాన ముత్పన్న మగుచున్నది. అట్టి జ్ఞానమువలన బహిర్జీవితము బ్రహ్మాండము దేనిరూపాంతరములో యట్టి దానియందు స్థిమితమొంది జీవితముతో బ్రహ్మాండముతోఁ బూర్ణ సంబంధము కలవార మగుదము.





# యోగసంకలనము.



ఆఱవ అధ్యాయము.



## త్రివిధనివేదనలు.



మన త్యాగము దేనికి నివేదించుచున్నామో దానిపరిపూర్ణజ్ఞాన మిట్టిది. భక్తిప్రేమకర్మల త్యాగముదానికి నివేదించుచున్నాము. కర్మత్యాగ మనగా బహిఃకర్మల త్యాగము. అంతరవృత్తుల త్యాగము. మనయంతస్థితియందు త్యాగాధిపతితో మన మేకత్వమొందునటుల నాత్మపరిపూర్ణత్వమే యాత్మశిక్షయే యంతరవృత్తులత్యాగము. ప్రాచీన వేదాంతము నిరూపించిన యుత్తమకర్మణ్యత్వమిదియే. (Objective). అమరత్వ మొందనున్నట్టి, ప్రకాశమానజ్ఞాన మొందవలసినట్టి, బ్రహ్మాండప్రేమానందములఁ దన్మయత్వ మొందనున్నట్టి, యుత్తమాధికార సర్వాధికారముల నొందనున్నట్టి మన స్వభావమందు సాదృశ్యముఁవలన మనయావిర్భావమందేకత్వ మొందునటుల యాత్మపరిపూర్ణత్వమే యాత్మశిక్షయే యా యంతరవృత్తిత్యాగము. వేదఋషులచేఁ బాడఁబడిన త్యాగమిదియే.

జ్ఞానముయొక్క త్యాగము ద్విస్వభావము గలది. దానికార్యస్థానము స్వయంప్రకాశుఁ డగు నద్వితీయుని జ్ఞానముగాఁ బరిణమిం

చునుత్తమశాస్త్రముకావచ్చును. లేక ప్రపంచావిర్భావమం దద్వితీయుని జ్ఞానముగాఁ బరిణమించు సామాన్యశాస్త్రము కావచ్చును. ఇవి రెండు బాగుగా వేరుచేయఁబడినవి. మతవేదాంతము లీమొదటి దానినే గ్రహించితమమహోన్నత స్థానములనుండి, క్షణభంగురములకై ప్రయత్నించు ప్రాపంచికవిషయముల నీచములని యశ్రద్ధతతోఁ జూచుచున్నవి. శాస్త్రములు, కళలు జీవితము రెండవదానినే గ్రహించుచున్నవి.. తమతోటిపాటి మతవేదాంతము లుత్తమములని పరిశ్రమజేయు విషయముల నసహ్యతతో నపనమ్మకతో నిష్ప్రయోజనములని యసత్యము లని చెప్పుచున్నవి. కాని యఖండుఁడద్వితీయుఁడగువాని కీభిన్నత్వ ముండవలసినదేనా? ఒకటినొకటి సంపూర్తిచేసికొను నీరెండుశాస్త్రములకు విరోధభావ ముండవలసినదేనా? ఉత్తమజ్ఞాన మత్యవసరమైనది. అది లేకున్న సాధారణశాస్త్ర పరిశ్రమ లన్నియు నజ్ఞానము నిర్బంధ మన్యదేవతలకుఁ గ్రమము తప్పి నివేదింపఁబడు త్యాగము లగుచున్నవి. గనుక పూర్ణయోగము సమస్త మంగీకరించు భగవద్భక్తి భగవత్కార్యముల నిరాకరింపవు. అయీశ్వరకార్యము లతనిస్వప్నములేయైనను వానిని హీనముగాఁ జూడవు. మనుష్యునం దతఁడు తన కేర్పరుచుకొన్న బహుముఖ విజయ మను ఘనకార్యమునకు వెనుకఁదీయవు. ప్రపంచమందలి మనకర్మలు జడస్వభావమును మోహించి బానిసమై బంధింపఁబడి నజీవునిచేఁగాక, స్వతంత్రుఁడగు జీవునిచే సరియైన భావజ్ఞానములతో నీశ్వరునీ శ్వరునకు నివేదించవలసియున్నది.

సమస్తశాస్త్రములు జ్ఞాన జనకములు. వస్త్వాకారధర్మములఁ బరీక్షించు మానసిక స్థూలశాస్త్రములు, మనుష్యపశుప్రాణములకు సంబంధించిన శాస్త్రములు, రాజకీయశాస్త్రములు, శబ్దశాస్త్రములు, చరిత్రములు, మనుష్యునకు నివాసస్థానమైన నీప్రపంచమును శోధించి స్వాధీనపరుచుకొను ప్రయాసలకు సంబంధించిన శాస్త్రములు, కవనము, చిత్రలేఖనము, శిల్పము మొదలైన సుందరమగు నుత్తమకళలు సంపూర్ణనివేదనకు సర్వము పనికివచ్చునవే. గాన వానిని దేవుని తెలుసుకొనుచున్న మానుష దివ్యజీవితమునుండి వెలి

చేయఁగూడదు. వాని నన్నిటిని త్యాగముకొఱకు సాధించవలసినదే. ఈశ్వరుఁడే వాని ప్రయోజనము. వాని యంతరార్థము. మానసిక స్థూలశాస్త్రముల నభ్యసించుట కుద్దేశ్యమునకు మృగవస్తువులందీ దేవుని కనిపెట్టి తెలిసికొనుటకై యుండవలెను. అనుభవముతో సంబంధించిన శాస్త్రముల (Practical science) నభ్యసించుట కుద్దేశ్యము దేవుని మార్గములలోఁ బ్రవేశించుటకు, మనకు నియమింపఁబడినపనికి నుపకరణములు సాధనములేవియున్నవో తెలిసికొనుటకు, తెలిసికొని యాజ్ఞానమును మనుష్యుని యధికార సంతుష్టి సంసిద్ధులవృద్ధికొఱకు నుపయోగించుటకునై యున్నది. సౌందర్యానందమునకేగాక- దేవుని లక్ష్యార్థమైన రూపములందు నతని నియమములందు, మనుష్యులందు, జంతువులందు, వస్తువులందు దేవుని వెల్లడించుటకై యుండవలెను. మతమునకుఁ గళలకు (arts) నత్యంతసంబంధము కలిగించు శాస్త్రము సరియైనదే. మతమెంత విపులమైధారాళ గ్రహణశక్తి కలిగియుండునో యంతయెక్కువగా సమస్తవస్తువులందు దేవునికిఁ గల మతమును దనలోఁ గలిగియుండును. కళలు సహితమెంత ప్రకాశమానమై శక్తియుక్తమై యగాధమై యుండునో యంతయెక్కువ యామతమునే కలిగియుండును. ఈ తత్వమే వ్యష్టిసమిష్టిజీవితమునకు సంబంధించిన శాస్త్రములకుఁ గళలకుఁ గూడ వర్తించును.

ఉత్తమోత్తము నెరిగిన వారికికార్యములతో నవసరము లేదు. పరిపూర్ణజ్ఞానమున్నయెడల నీకార్యముల విడచిపెట్టఁడు. భగవంతుని గార్యసంఘ మనఁబడు నీప్రపంచమును నడుపుట కీశ్వరుఁడెట్లు స్వాయముగాఁ గర్మలఁజేయుచున్నాఁడో యట్లే యతఁడుచేయుచున్నాఁడు. జ్ఞాని తాను కర్మజేసి యజ్ఞానులకు దారిజూపమని గీత చెప్పుచున్నది. అట్లు చేయుటవలనఁ బ్రపంచము తన యూర్ధ్వగమనమందు వృద్ధిగాంచును. మనుజులు, దేశవాసులు తామసాధిక్యతఁ వల్ల సంభవించు దుఃఖకరమైన నాశమందు మునుగకుందురు.

క్రియాశూన్యత్వమను నజ్ఞానమందుఁ బడకుండును. "నాకు లేనిది సంపాదించుకొనవలసినది లేనందున నాకుఁ గర్మలఁజేయుట కావశ్యకతలేదు. కాని ప్రపంచమందుఁ కర్మలఁ జేయుచున్నాను. నేను కర్మలఁ జేయకున్న సమస్తధర్మములు చెడును. లోకములు కల్లోలములో మునుగును. ఈనాజనుల నశింపఁజేసినవాఁడ నగుదు" నని ప్రభువు గీతయందుఁ జెప్పినాఁడు.

ప్రాచీన వేదాంతబోధయొక్క తత్వముఁ దెలిసికొన్న నది యనిర్వచనీయునికంటె నితరములగు వస్తువులందు శ్రద్ధతగ్గించదు. శాస్త్రముల గళల జీవితములఁ బాడుచేయునది కాదు. కాని వానికి వ్వవలసిన స్థానము గౌరవము వానికిచ్చి, యజ్ఞానముతో వానినను భవించుటకు మారుగా స్వతంత్రానందములతో ననుభవింపఁజేసి, జ్ఞానమందుఁ బూర్ణ ప్రకాశత, యభ్యాసమందుఁ బూర్ణశక్తికలిగించుటకు శక్తిప్రకాశముల నిచ్చుచున్నది. అవుసరమేదో దానినే మొదట సదా యభ్యసించవలెను. వీని నన్నిటిని స్వీకరించి దానితోఁ గలుపవలసిన యవసరమంతగా లేదు. వాని నన్నిటిలో దివ్యానందభావము ప్రవేశబెట్టవలెను. సర్వవ్యాపకుఁడైన యీశ్వరునిసర్వ స్వీకారమగు భక్తిని వానిలోఁ బ్రవేశఁబెట్టవలెను. ఎందు కనగాఁ బ్రేమదానము సర్వసమమై, పూర్ణమై, సర్వబంధవిముక్తిగాంచి నప్పుడే నిజమైన పరిపూర్ణత్వ మొందుచున్నది.

హీన వస్తువున కర్పించనీ, యజ్ఞానముతో నివేదించనీ యాభక్తి ప్రేమలు మంచివే. ఈప్రేమసహితము వృద్ధిశీలకొలక గును. దాని హద్దులో యట యంధమగు కించిత్ జ్ఞానము. ఏదో యొక దేవతను విగ్రహమును, మనుష్యుని, లక్ష్యార్థమును జూచుట నింద్యము కాదు. ఇవి లేకున్న మనుష్యజాతి వీని నిజతత్వ మెఱుంగఁజాలదు. మనవృద్ధిసోపానముల మన మొప్పుకొనవలెను. భక్తిని హృదయమందు నిజతత్వమును నెలకొల్పునంతవరకుఁ దెలిసినవాఁడా విగ్రహమునుఁ బగులఁగొట్టుటకుఁ ద్వరపడఁడు. ఉత్తమనిజభక్తియందు సహిత మొకలక్ష్యార్థ ముండవలెను. దానినిర్మించుకొనుట కీవస్తువు

లావశ్యకములు. సమస్తాకారావిర్భావముల కతీతమైన దానిని దెలిసి కొన్నను, జడమందు మనుష్యునందు సంఘమందు మృగమందు వృక్షమందు పుష్పమందు మన చేతిపనులందు దేవునకు నమస్కరింపకున్న మనజ్ఞాన ప్రేమలు పూర్తికానేరవు. అప్పుడు స్వభావశక్తులు జడమైన యంత్రముచే నిర్మింపఁబడు విషయముగాక సర్వముతానైన దేవుని యొక ముఖముగా మనకుఁ దోఁచును.

తుదకు పూజపరబ్రహ్మమునకు నివేదింపఁబడును. కాని యీశ్వరుఁ డెచ్చట దాగుచున్నాఁడో, యెచ్చట నావిర్భవించుచున్నాఁడో, యామానుష తనుత్రయమందు జడమందు నీశ్వరునకు నివేదించని యెడల నాపూజ పూర్తికాదు. అజ్ఞాన మాచ్ఛాదించును. వికార మొందించును, బంధించును. గనుక యసంపూర్తి పూజమానసస్థూలవిగ్రహమును గల్పించు మతము. నిజతత్త్వమున కజ్ఞానమను ముసుకు వేసి తనలో దాచి సంరక్షించుచున్నది. తుదకు నిజతత్త్వమును బోనణచి విగ్రహమును నిల్పుచున్నది. కాని ప్రత్యేకజ్ఞానజనిత గర్వముసహితము హద్దే. అభ్యంతర మే.

ప్రేమానందములందుఁ బూజ సంసిద్ధి నొందుచున్నది. భక్తిమార్గముయొక్క గమ్యస్థానమున స్వయంప్రకాశుని యతీతప్రేమానందములు మనకై యెదురుచూచుచున్నవి. అప్పుడు సర్వభూతములకొఱకైన సర్వవ్యాపక ప్రేమసహితము మనకై యెదురుచూచుచున్నది. ప్రతిముసుకులోఁ బ్రహ్మానంద సౌందర్యభరితుడఁగు నీశ్వరునిజూచి కౌగలించుటచే నతని యనంతావిర్భావములందు సర్వవ్యాపకానందము జనించుచున్నది. ఆకార రూపములకుఁ గల భేదభావము లాయాకారరూపాంతర్గతుఁడగు నద్వితీయుని గ్రహించిన హృదయమును భాదించనేరవు. ఆత్మపరత్వ శూన్యుఁడగు కర్మిష్టియొక్క జ్ఞానియొక్క సర్వసమత్వము దివ్యప్రేమ యనఁబడు నిందిజాల స్పర్శచే సర్వాలింగిత పరవశత్వముగా మార్పఁబడుచున్నది. వీలననగా సమస్తవస్తు సముదాయము ప్రియుఁడగు నీశ్వరుని శరీరములు. ఆటవస్తువులు.

పూజావిధానములందు నహితము భేదములు సోపానములు కలవు. "మనఃపూర్వకముగ పత్రపుష్పఫలతోయముల నెవడిచ్చిన వాని భక్తిపూర్వకమైన నివేదననే పుచ్చుకొని రుచిచూతును." క్రియలు విధులు ముఖ్యములుకావు. ఉద్దేశ్యము ముఖ్యము. బాహ్య పూజ మానసపూజయని పూజద్వివిధము. విగ్రహము లర్చనవిధానములు స్థూలసాధనములు. వానివలన మనుజుఁడు తన హృదయానురాగమును నిర్ణయించి స్థిరపరుచుచున్నాఁడు. హృదయానురాగమే లేకున్న నట్టి పూజలకర్థమే లేకపోవును. సాధారణముగా సమస్త విధులు కొంతకాలమునకు వాని నిజతత్వమును గోలుపోయి నామావశిష్టములగుచున్నవి. వానియర్థము తెలిసికొనువారికే యవి శక్తియుక్తములు. కాని విశేషజనము విగ్రహవిధుల మూఢభక్తితో మతవిధులని చేయుచు వానినిజతత్వమును మరచిపోవుచున్నారు. అందుచే తుదకవి మారవలసినదే. మూలకుఁ ద్రోయబడవలసినదే. కాని బాహ్యవిగ్రహవిధులతోఁ బనిలేనివారు కొందఱుమాత్రమే కలరు. అట్టివారికి బాహ్యము లానందకరములు, సుందరములు, సత్యములు. విగ్రహాదు లంత్యము వరకుండునవే.

అయినప్పటికి క్రియారూపకమగు పూజ గొప్ప మహోన్నతత్యాగ మగుచున్నది. ఇచ్చట భక్తిమార్గము కర్మమార్గముతో నేకమగుచున్నది. కర్మమార్గమందు మొదట లేనట్టియు, వృద్ధికి ఫలముగా తరువాత కలుగునట్టియు ప్రేమానందముల భక్తిమార్గము దానికి కలిగించుచున్నది. మనుష్యజాతియందుఁగల ప్రేమతోను, దేవుని యావిర్భావమగు ప్రపంచమందుఁగల ప్రేమతోను జేయఁబడు కర్మ లీయోగమునకుఁ జెందినవి. అట్టి కర్మల పరిపూర్ణత్వమీయోగపరిపూర్ణత్వమునకు సహకారి యగుచున్నది.

విగ్రహవిధులకు లోన యంతరనివేదనకలదు. అది మన రాగాదుల నన్నిటి నీశ్వరునకు నివేదించుట. అట్టి నివేదన విగ్రహవిధులకుఁ బూర్ణమైన యాధిక్యతకలిగించుచున్నది. సమస్తానురాగములు ప్రేమానంద రూపములై పరిణమించుటచే నీనివేదన మను

ష్యుని శుద్ధిచేయుగొప్ప శక్తిగా నున్నది. మనుష్యునందు, సమస్త జంతువులందుండు దేవున కిచ్చులచే నీనివేదన సోదరభావముకన్న గాఢమైన శక్తియుక్తమైన నిజమైన పూర్ణసమత్వమునకు మూలమగుచున్నది. ప్రపంచముతో నందలి భూతములతో నేధర్మశాస్త్రమున కలవిగాని సమరసత్వము దెచ్చుచున్నది.

ఈమానస పూజయొక్క సమాప్తియేది యనగా నీశ్వరునందుఁ బూర్తిగా నైక్యమగుటే. ఇచ్చట భక్తిమార్గము జ్ఞానమార్గముతో నేకమగుచున్నది. బంధవిముక్తిగాంచిన మానసమునకు స్వర్గ మనఁబడు నిర్మల ప్రశాంతస్థిమితములకుఁ దోఁడుగా భక్తియోగము జ్ఞానయోగమునకుఁ జుక్కైన బరవశత్వ మిచ్చుచున్నది. ఈయైక్యము సమస్తభేదములఁ దనలో నిముడ్చుకొనుచున్నది. వానివలనఁ జెడదు. తగ్గదు. ఈశ్వరునియందు జీవుని యైక్యముతో నేర్పడు సమస్తభూతములం దైక్యమాజీవ పరిపూర్ణత్వవిలాసమే.

భక్తిమార్గము సమస్త మనుష్య సంబంధముల నుపయోగించి దైవికములుగా మార్చునని తెలిసికొంటిమి, భక్తిమార్గముపూర్తి జెందినపుడు సహితమీశ్వరునం దైక్యము పోగొట్టుకొనక యాసంబంధములలో నున్న భేదవిలాసమున కానందించును. సంబంధోద్దేశ్యమం దీశ్వర ప్రేమోద్దేశ్యమును గనిపెట్టుటవల్ల, సమస్తవస్తువులందాయీశ్వరుని పొందుట కీసంబంధము నుపయోగించుటవల్ల భక్తిమార్గము మనుష్యప్రాపంచిక సంబంధముల నన్నిటిని స్వీకరించును. అప్పుడు యోగమునకు మరల ప్రాణప్రతిష్ట జేతుము. ఏల ననగా ప్రాణము త్రివిధసూత్రము. విభజింప నలవికాని త్రితయము.

ఫలాపేక్షలేని యాత్మపరత్వ శూన్యమగు కర్మే లక్ష్యార్థముగా మనము ప్రారంభించుచున్నాము. కర్మయోగమునకు నిజతత్వమిదే. కామప్రేరేపణకుబదులుగా మనలో సమస్తభూతములలో నున్న నీశ్వరున కర్పణముగఁ గర్మాచరణధర్మమును భక్తిమార్గముతోఁ గలిపెదము. తరువాత మనయందరిలో నున్నఁ గర్మాధిపతితో

బరమోత్తమేచ్ఛతో మఁకర్మల నైక్యమొందించుటే మనపని. అప్పుడు కర్మమార్గము జ్ఞానమార్గముతో సహిత మేకమగుచున్నది.

కామరహిత మాత్మపరత్వ శూన్యమైనకర్మ, సర్వఫలాను భవములందు జీవున కుండవలసిన సమత్వముపై నాధారపడియున్న దని గ్రహించియున్నాము. అట్టి సమత్వము లేకున్న నాత్మపరత్వ కామము లుండక తప్పదు. మనము సమస్తవస్తువులం దీశ్వరునిజూచి తిమా యీసమత్వము సర్వభూతములకు, సర్వవస్తువులకు వ్యాపించుచున్నది. సుఖదుఃఖముల, జయాపజయములఁ, గష్టసుఖముల, నైశ్వర్యదారిద్ర్యముల సమముగాఁ జూచుటేగాక, నరమృగముల, నుత్తమాధముల, సజ్జనదుర్జనుల, శతుృమితృల, సమముగాఁ జూడవలెనని గీత చెప్పుచున్నది. మనము కళ్లుమూసుకొని భిన్నావిర్భావములయొక్క వ్యక్తిలేక యుండవలెనని కాదు. ఈభిన్నాకారములలో నద్వితీయుఁడగు నీశ్వరుని తెలిసికొనమని, దేనినిజీవుఁడు తెలిసికొనుచున్నాఁడో దానిని హృదయస్వభావము లనుకరించునని యర్థము. మన యింద్రియజ్ఞాన, రాగవ్యక్తి, కర్మభావముల నిర్ణయించవలసినది పైకిఁ గనుపించు భిన్నత్వముకాదు. ఆయేకత్వమే. అట్లుగాకున్న మన మింకను పైవికారములకు బానిసలమై యుండవలసినదే. సర్వవ్యాపక దివ్యస్వాతంత్ర్య మొందకుండవలసినదే.

అహంకారయుక్తమైన గార్యకరణమున కలవడిన జీవునకభ్యాసమందిదిగొప్పకష్టమై తోచును. ఎందు కనగాఁ నదియాత్మపరత్వమును సంపూర్ణముగాఁ త్యజించుచున్నది. మనవికదా యని, మన స్వప్రయోజనములకొఱకు స్నేహితులకొఱకు భావము కొఱకుఁ కర్మలనిక చేయము. అహంకారజనిత ప్రత్యేకత్వమును మనము విడిచి పెట్టితిమి. మనవి యనుకొన్నవాని యందుమాత్రమేగాక మనవికా వనుకొన్నవానియందు సహితము దేవుని జూచుచున్నాము. మనుష్యసేవ దేశసేవ మతసేవలకు ముఖ్యమగు మంచిచెడుల నెన్నుకొనుటకు సహితము మనకు స్వాతంత్ర్యముండదు. మనము సజ్జన దురనుల సమముగా నిష్పక్షపాతబుద్ధితోఁ జూ

తుము. మనము సేవించునెడల, గొంపతిలోని యీశ్వరునకన్న వేరనిగాక నంపతియందు సమముగా నీశ్వరుని సేవింతుము.

ప్రేమ దేశాభిమానముచేయు తీర్మాన మేమనగా మానుష భేదముల నిరాకరించి, విరోధముపుట్టించు కార్యములఁజేయకఁ ప్రేమాస్పదమైన కార్యములమాత్రమే చేయమనుచున్నది. నిష్పక్షపాతబుద్ధితో మనుష్యునకు మనుష్యునకు, జంతువునకు జంతువునకు, గల స్వల్పభేదముల లెక్కజేయక ప్రపంచక్షేమమునకుఁ బ్రయత్నించుమని కోరుచున్నది. క్రైస్తవమతము బౌద్ధమతము మానుషక్షేమమతము (Humanitarianism) లన్న నిదే. ఇది మిక్కిలి సుందరమైన లక్ష్యార్థము. కాని గీతాతీర్మానమిది కాదు. అగాధమగు నీ శాస్త్రము భయంకరమై వినాశకరమగు గొప్ప యుద్ధమందుఁ బ్రముఖత్వము వహించి పోరమని యర్జునునకు విధించుచు వ్రాయఁబడినది. మానుషక్షేమమతముచేయు తీర్మానము (అనగా) ప్రేమజనిత బాహ్యకార్య నిర్ణయము తన స్వకీయముక్తికి ధర్మజ్ఞాన సంతుష్టికిఁ జాలియుండును గాని వృద్ధికొఱకుఁ బ్రపంచము పడుపాట్లయందు దాని నుద్ధరించమని జీవన్ముక్తునకు నిర్ణయింపఁబడిన గీతాతీర్మానముతో సాటికాదు. ప్రేమదేశాభిమానములతో మనముచేయు కార్యము లౌకిక విషయమునమాత్రమే సహకారులై దుఃఖమును శమింపఁజేయుచున్నవి. కాని యాదుఃఖకారణముల నవి పూర్తిగాఁ దొలగింపఁజాలవు. బాహ్యదృష్టికి సమస్తకర్మ మండెడి యగ్నినుండి వెలువడుఁ బొగవంటి లోపముతోఁ జుట్టు నాచ్ఛాదింపఁబడిన దని గీత చెప్పుచున్నది. క్షత్రియధర్మమైన మానుషయుద్ధము త్యజించి దేశాభిమానముతో సేవించమంటిమా మనస్సునకుఁ గల్లోలము కలుగకపోదు. ఏలననగా యుద్ధముచేయుటవలన సంహారయోగ్యమగు దానికిమట్టుకే హానిచేసినవారమగుదుము. యుద్ధము నిరాకరించితిమా ప్రపంచోద్ధరణమునకు సహాయపడమని సరియైన కాలమున నష్టులగు జీవుల నాహ్వానమును నిరాకరించిన వార మయ్యెదము. మనకొఱకు దైవము సృజించిన యీప్రపంచము బహుముఖ

ములు కలది. అతఁడు మన కిచ్చిన సమస్య బహుళకఠినమైనది. ఆస మస్యయొక్క తీర్మాన మొక విషయమును మాత్రమే యనుసరిం చుటవలన కలుగదు.

త్యాగముతోఁ జేయఁబడు కర్మసూత్రము కామమునకు మారుగా వేరొక ప్రేరేపణ పుట్టించును గాని యది కర్మల స్వాయ ముగా నెన్నుకొనుటకు వీలు కలిగించుటలేదు. స్వాయముగా నెన్ను కొనుట దాని యుద్దేశ్యముకాదు. స్వాయముగా నెన్నుకొనుట లన్నియు నెంత శ్రేష్టములు కాని, మనము త్యజించుటకుఁ బ్రియ త్నించుదానికి సంబంధించిన వే. ఆసర్వ మహంకార మూలస్థానము నుండి నిర్గమించుచున్నవి. కాని యుత్తమస్థితికై మనము ప్రయత్నిం చుచున్నాము. కాబట్టి గీత పై మెట్టు కనపరుచుచున్నది. మనకర్మలు నిష్కామకర్మలైనప్పుడు, సర్వకర్మల త్యాగముతోఁ జేయనేర్చి నప్పుడు, మనము కర్మఫలములఁ ద్యజించుట మాత్రమేగాక సర్వ కర్మాధిపతికి కర్మల సహిత మర్పింతుము. అనగా, మనమనస్సు హృదయము శరీరము నిత్యప్రకాశుని సర్వశక్తుని సాధనములగు చుండ నహంకారమునకు మారుగా కర్మనేది యెన్నుకొని చేయిం చునో యట్టి దివ్యశక్తి దివ్యేచ్ఛ దివ్యతేజస్సు మనలోనికిఁ దెచ్చు కొనవలెను.

ఈలోపున మన ప్రస్తుతవృద్ధి ననుసరించి మనలోనుండు శ్రేష్టత్వముచే నడుపఁబడుచు త్యాగముతోఁ గర్మలఁజేయవలయు. ఆశ్రేష్టత్వము మన మనస్సాక్షి కావచ్చును. దివ్యలక్ష్యార్థము కావ చ్చును. మన స్వభావముయొక్క యుత్తమధర్మసూత్రము కావ చ్చును. ఇవి మనకుఁ దప్పుదారిజూపిన సేగిలేదు. ఇతరులకుఁదప్పుగాఁ దోచినఁ లోపములేదు. మనుష్యతర్కమునకు నేరమని కనుపించిన నష్టములేదు. మన మేదిచేసినను, సర్వవ్యాపకుఁడైన నీశ్వరునందు నివ సించి, మనలో యహంకారమును గనిపెట్టి విభజించి తొలగించి, వినశక్తికలదేని లోని మహోన్నతవాక్యమును వినుచుఁ, గపటము

లేక, త్యాగముతో నమ్మకముతో దానింజేసితిమేని మనకు భయము లేదు. మనము వృద్ధిమార్గముననే యుందుము.

తరువాత నహంకారమునుండి పూర్తిగా విముక్తిగాంచెడు స్థితిరాఁగలదు. అందు మన మిప్పుడు మనవనుకొనుచున్నవి యీశ్వరుని సాధనములుగా మారును. ఈభాగము కర్మయోగస్ఫూర్తికి మిక్కిలి ముఖ్యము. సామాన్యోద్దేశముల కలవి కానిది. గనుకఁ బ్రత్యేక విమర్శఁ జేయుదుము.





# యోగసంకలనము.



## ఏఁడవ అధ్యాయము.



## ధర్మశాస్త్రము.



కర్మయోగికిఁ బనిచేయునప్పు డెట్టి జ్ఞాన ముండవలె ననగా సమస్తకార్యము విభజింపశక్యముకాని మొత్తములో నొక భాగమనియు, సమస్తవ్యష్టికర్మ (personal action) యహంకారజీవునిచే నిర్ణయింపఁబడిన ప్రత్యేకవ్యాపారముగాక, విభజింపఁ నలవికాని బ్రహ్మాండకర్మలో (cosmic action) నొకభాగమనియు, నీబ్రహ్మాండకర్మసహితము మనుష్యున కాత్మజ్ఞాన ప్రాప్తికై సృష్టిలోఁ గ్రమవృద్ధిని స్వయముగా నావిర్భవించుచున్న నీశ్వరుని విభజింపశక్యముకాని వ్యాపార మనియు, జ్ఞాన ముండవలెను. ఈకర్మ యీవ్యాపారము మనకు గోచరించు బ్రహ్మాండకర్మ సముదాయమునకుమాత్రమే చెందినదికాదు. పూర్తిగా వ్యక్తముగాక మనచుట్టు నావరించియున్న స్థితిచే బలపరుపఁబడుచు, మనవ్యక్తి కతీతమగు గొప్పస్వయంప్రకాశస్థితిచే నాకర్షింపఁ బడుచున్నది. విభజింపఁగూడని యీ బ్రహ్మాండవ్యాపారము యొక్క మొత్తమును నిరాకరించు ప్రతి కర్మవిధానము సంపూర్తికాని యజ్ఞానవిధానమే.

ఈభావము మనకుఁ గలిగినను జీవమానసములకిదే జ్ఞానమని మనవ్యక్తికి స్థిరముగాఁ దోఁచినను, బ్రహ్మాండవిషయములతో మన స్వాభిప్రాయచిత్తానురాగకామములకుఁ గల పొరపొట్ల సమాధాన పరచుట కష్టము. విభజింప శక్యముకాని ప్రాణయుక్తమైన నీకార్యము నిర్గుణపదార్థరాశి యనియు, నట్టి పదార్థమునుండి స్వప్రయత్నముచే జీవుఁడు తన మనోచిత్తవృత్తుల కనుగుణ్యమైన నొకదాని నిర్మించుచున్నాఁ డనియుఁ దలచక మానము. మనుష్యునకుఁ దన చుట్టునున్న యావరణమును గురించి సాధారణముగా నిదే యభిప్రాయము. వ్యష్టిభావ మున్నంతవరకు, నాభావము పూర్తిగా వృద్ధి కానంతవర కీయభిప్రాయము మంచిదే. కాని మన కెప్పుడు వ్యష్టివృద్ధితోఁ బనిలేక పోవునో, యేకత్వమునకు, సర్వసమత్వమున కెప్పుడుప్రయత్నింతుమో యప్పు డీభావమును బూర్తిగాఁ దీసివేసికొనుట బహుకష్టమై తోఁచును. ఈకార్య మీబ్రహ్మాండకర్మ యహంకారజీవుని బలానుగుణ్యముగా నటి జీవేచ్ఛకు స్వాధీన మయ్యెడు నిరాధార నిర్గుణ తరంగముగాక వృద్ధిపొందుచున్న గ్రియాశక్తికి నెవఁడు ప్రభువో, తనకార్యవిధాన మెవఁ డెరుగునోయట్టి బ్రహ్మాండపురుషుని (cosmic being) వ్యాపార మని మనము స్పష్టముగాఁ దెలిసికొనవలెను. ఈవ్యాపారము విభజింప నలవిగాక నొక్కటే యెట్లగుచున్నదో యట్లే యావ్యాపారమందు వెల్లడగుచున్న వాఁడు సహితమొక్కఁడే యగుచున్నాఁడు. సమస్తఫలములేగాక, ప్రేరేపణలు, క్రియలు, విధానము లతనికార్యములే. అతనితరువాత జీవునకుఁ జెందవలసిన వే.

స్వార్థపరుఁడైన కార్మికునకుఁ నొకడేయగు నీ బ్రహ్మాండపురుషునితో నొకటేయగు నీవ్యాపారరాశితో నెట్టిసంబంధము? వాఁడొక స్థానము మాత్రమే. నేనను వ్యక్తికి స్థానము. ఒకవ్యష్టి వ్యాపారమునకు స్థానము. వాని సగుణత్వ మెడతెగని వ్యష్టితరంగమందు సమిష్టి సగుణత్వమును ప్రతిఫలించుచున్నది. ఆ ప్రతిబింబ మొక శకలము. ఈతరంగ శిఖరము జాగ్రదావస్థలోనున్న మనజీవా

త్మ యగుటచే నందు నీశ్వరుని యసంపూర్ణ సామ్రాజ్యముమాత్ర మే ప్రతిఫలించును. మన సర్వోద్దేశములు నీమము లేర్పాటిశకల మందు దేవుని యావిర్భావములోని కొంతభాగమును సమిష్టి వ్యాపారములోని కొంతభాగమును దెలుపుటకుఁ జేయఁబడు ప్రయత్నములు. కొద్దిపాటి సామ్రాజ్యముతో నుత్తమ విషయమును దెలుపుటకుఁ జేయుప్రయత్నములు. బ్రహ్మాండైకత్వమందేగాక, మానుష సమిష్టియందేగాక, వ్యష్టిజీవునందు సహితమీశ్వరుఁడు స్వయముగా వ్యక్తమగుటకు సంకల్పించినాఁడు కాబట్టి బ్రహ్మాండమందు, సమిష్టి యందు, వ్యష్టియందుఁ బరిపూర్ణత్వ మొందవలెనను నమ్మకము ధ్యాస పాతుకొనియున్నది. మిక్కిలి సమరసమగు నాత్మవృద్ధికొఱ కందు సదా ప్రేరేపణ కలుగుచున్నది. ఈ యాత్మవృద్ధి, జ్ఞానధర్మ నీతి రసగ్రమాణ కర్మశాస్త్రమునఁ బరిణమించుచున్నది.

ఈహేతువునుబట్టి, ప్రస్తుతము మనకున్న ధర్మశాస్త్రముల భేద్యములని, నిత్యములని తలచకూడదు. ఒకదానిని మించిన మఱి యొక తత్కాలిక శాస్త్రము నేర్పరుచుకొనుట యీశ్వరున కీతని ప్రయాణమందుఁ దోడ్పడుటే. అలంఘ్యమై యభేద్యమైన శాస్త్ర నిబంధము నితోద్యదకముయొక్క యూర్ధ్వగమనమున కడ్డుకట్టవే యుటకుఁ బ్రయత్నించుటే. ఈతత్త్వము తెలిసిన మంచిచెడ్డలను ద్వంద్వభావము విడిచిపోవుచున్నది. దివ్యపరిపూర్ణత్వ మొందుటకేది జీవప్రపంచములకు సహాయపడునో యది మంచియనఁబడును. వృద్ధి జెందు పరిపక్వమున కడ్డుకలిగించి భంగమేదిచేయుచున్నదో యది చెడనఁ బడుచున్నది. పరిపూర్ణత్వము కాలచోదిత పరిణామము (envolutive in time). క్రమవృద్ధిచే సంభవించునది. కాబట్టి మంచిచెడులు సహితము మారవలసినదే. కాలానుగుణ్యముగ వాని యర్థముకూడ మారుచున్నది. ఇప్పుడేదిచెడుగనివిమువఁబడుచున్నదో యది యొకప్పుడు వ్యష్టి సమిష్టివృద్ధి కవసరమై సహకారియై యుం డవచ్చును. ఇప్పుడేది మనము చెడుగనుచున్నామో యది మఱి యొకరూపమున ముందు పరిపూర్ణత్వమునకు కొంటెన విషయము

కావచ్చును. ధర్మశాస్త్ర మలంఘ్యమనువారికీ తత్వము నీతిని మొదలంటఁ బాడుచేయునదిగాఁ దోఁచఁబడును. అలంఘ్యమగు నీతిశాస్త్రమే శాస్త్రముకాని తక్కినది శాస్త్రమేకాదనుకొన్న నాఫలము తప్పకవచ్చును. కాని ధర్మశాస్త్రము తాత్కాలికమని యాకాలము న కవసరమని యంతకన్న నుత్తమశాస్త్ర మివ్వబడువరకు దాని నతిక్రమించరాదని, తెలిసికొనుటకుఁ దగినంత మార్దవము తెలివి మనకున్నయడల మనకు నష్టమురాదుకాని, సహింప శక్యముకాని యసపూర్ణమగు పుణ్యఫలములు వెళి వదలిపోవును. ఎడ తెగక నీతిని వృద్ధిపొందించు శక్తి, క్రిమపడు జంతుజాలములతో నిండియున్న నీ ప్రపంచమును దయదాక్షిణ్యములతోఁ జూచు సామర్థ్యము, కలుగును. అట్టిసామర్థ్యముచేఁ బ్రపంచోద్ధరణమునకు సహాయపడుటకై మన కెక్కువహక్కు బలములుండును.

మన ధర్మశాస్త్రములు తాత్కాలికములని, పరిపూర్ణములు కావని, శాస్త్రబద్ధముకాని యాత్మ జ్ఞానాభివృద్ధిని యీశ్వరావిర్భావవృద్ధిని తెలుపు నసంపూర్ణములగు సృష్టిప్రియత్నములని మనకు స్థిరపడుచున్నది. ఈవిషయమును గ్రహించినబిదప, మొదట విరుద్ధముగాఁ దోఁచినను వ్యష్టి సమిష్టి వృద్ధి సోపానముల నిర్ణయించు వివిధశాస్త్ర పరంపరల నొకదానితో నొకటి సమన్వయించుటకు మనమెక్కువశక్తి కలిగియుందుము. వానిలో మిక్కిలి ధారాళమైన శాస్త్రమునొకదానిని బరిశోధించి, యీశ్వరేచ్ఛతో నేకత్వము వ్యాపి జీవసమర్పణను గోరునట్టి స్వభావసిద్ధమైన యోగముచే నా శాస్త్రము లెట్టిమార్పు జెందునో తెలిసికొందుము.

మానుషనీతి యవలంబింప వలసిన ముఖ్యధర్మములు నాలుగు కలవు. (1) తన యవసరము, కోరిక, (2) సమిష్టిక్షేమము, న్యాయము, (Law), (3) నీతి, ప్రమాణము, (4) ప్రకృతియొక్కయుత్తమధర్మము.

మనుష్యుఁడీ మొదటి రెంటితోఁ బ్రారంభించుచున్నాఁడు. అతని స్థూలప్రాణస్థితులకు సంబంధించిన ధర్మమువానివలన నేర్పడుచున్నది.

వృద్ధిజెందుచున్న నీశ్వరవిగ్రహము మానవతరగతిలో వెలిబుచ్చుచే మనుష్యున కీలోకమందుఁ గలపని. తెలిసియో తెలియకనో స్వభావము మనుష్యునందీ పనిచేయుచున్నది. పశువు లేక స్థూలమనుజునకు దారిజూపుటకుఁ దనకోరికకంటె తనయవసరముకంటె వేరులేదు. అట్టివానిధర్మసూత్రమేమనగా మొదట, దనస్థూలప్రాణావసరములఁ దీర్చుకొనుట. పిదపఁ దనలో నుద్భవించు రాగాదులఁ దృప్తిచేయుట. ఈధర్మసూత్రమును మార్చెడు ధర్మసూత్రమేదనగాఁ దనకుటుంబముయొక్క సంఘముయొక్క కోరికల నవసరములఁ దృప్తిజేయుటే.

మనుష్యుఁడు ప్రత్యేకము తనకుఁ దాజీవించగలవాఁడేని, ప్రత్యేకజీవునివృద్ధియే యీశ్వరోద్దేశ మేని సమరసమైన యీరెండవధర్మముండక పోవును. కాని మొత్తమునకు భాగమునకు, నాధేయమునకు నధిష్ఠానమునకు, సంఘమునకు వ్యష్టిమానవునకు జీవితమందు బరస్పరక్రియాప్రతిక్రియ లావశ్యకములు. హిందూవేదాంతశాస్త్ర మీశ్వరుఁడు వ్యష్టిసమిష్టిరూపమున సదా యావిర్భవించుచున్నాఁడని చెప్పుచున్నది. కాబట్టి మనుజుఁ డితరులతోఁ జేరకఁ దనకోరికల సహితము తీర్చుకొనఁజాలఁడు. ఈయనుబంధము సాంఘిక భావమువలనఁ బుట్టి సంఘధర్మమందు వ్యష్టిధర్మసూత్రమును మరుగుపరచుచున్నది.

ఈవిపులధర్మము, విపులతగాంచిన వ్యష్టిమనుజుని స్థూలప్రాణధర్మమే కాని వేరుకాదు. అది సాంఘికధర్మము. మనుజుఁడు కొందఱితర మనుజులతో నేకమగుచున్నాఁడు. సంఘముండుట తనయునికి కత్యావశ్యకమగుటచే సంఘసంరక్షణ, సమిష్టికామసంతృప్తి, వ్యష్టిమనుజునకు ముఖ్యమాయెను. సంఘకామసంతృప్తి వ్యష్టిసంతృప్తికంటె మిన్నగాఁ జూడవలసివచ్చెను.

జంతువులలోఁ గొన్నింటివలె మనుజుఁడు తనభార్యతో మాత్రమే కలసియుండుట, యొంటరిగా జీవించుట యేకాలముననుగాన

ము. మనుజుఁడు కలసిమెలసి యుండువాఁడే కాని యేకాంతముకోరు వాఁడుకాఁడని, సంఘధర్మము వ్యష్టిధర్మము నణచునని చరిత్రి చెప్పుచున్నది. కాని స్వభావమునుబట్టి వ్యష్టిధర్మమే ముఖ్యము. సమిష్టి ధర్మము దాని తరువాతదే. మనుజునకు రెండుగొప్ప ప్రేరేపణలు కలవు. వ్యష్టిసంబంధము. సమిష్టిసంబంధము. స్వకీయజీవితము. సంఘ జీవితము. స్వధర్మము. సంఘధర్మము. ఈరెండింటికి విరుద్ధభావముండుటచే వానికి సమరసత్వము తెచ్చుటే మానవ నాగరీకతకు మూలము.

మనుష్యునకు వెలియైన సంఘధర్మము మనుష్యునం దీశ్వర వృద్ధికి నుపయోగము నిరుపయోగము సహితమగుచున్నది. ఉపయోగ మెందు కనగా నది నేనను నహంకారమును శిక్షించి తగ్గించి స్వవిషయమును విడిపించి, సంఘమునకు వినియోగపడుశక్తి నిచ్చుచున్నది. అది నిరుపయోగ మెందు కనగా నది బాహ్యధర్మము. వెలినుండి మనుష్యుని బలవంత పెట్టునది. కాని లోన వృద్ధిజెందుట స్వాతంత్ర్యముతో వృద్ధిజెందుట, యణచుటవల్లఁ గాక వ్యష్టి పరిపూర్ణత్వముయొక్క ప్రకాశతవల్ల వృద్ధియగుట మనుష్యుని పరిపూర్ణత్వమున కావశ్యకములు.

సంఘవిషయమే ప్రధానమైనప్పుడు మనుజుఁడు సంఘమందే లీనము కావలెను. సంఘముయొక్క కాంక్షలఁ దనవలెఁ జూచుకొనవలెను. తనకొఱకు జీవించక, తానేశాఖకు సంఘమునకుఁగులమునకు, దేశమునకుఁ జెందునో దానికొఱకు జీవించవలెను. వ్యష్టిమనుజుని విషయమే ప్రధానమైనప్పుడు సంఘము తన నిమిత్తముగాక మనుజుని క్షేమముకొఱకు సిద్ధికొఱకు సంఘమందుండు ప్రతిమనుజుని స్వేచ్ఛకొఱకు నేర్పడవలెను. ధర్మముపైఁగాక మనుజుల బుద్ధిపూర్వకమగు నొప్పుదలపై సంఘము నిలువవలెను. అట్టిసంఘముండుట దుర్లభము. మనుజున కహంకార మున్నంతవరకు దాని బొందనశక్యము. కాబట్టి సంఘము సులభముగా మనుజుని లోఁబరుచుకొనుచున్నది. ఈపద్ధతినే మనుష్యులు మొదటనవలంబించెదరు. ప్రాచీ

నజనసంఘము లందు మనుజుఁడు కఠినమై యలంఘ్యమైన సంఘధర్మమునకుఁ బూర్తిగా లోఁబడి యున్నాఁడు. కాని లక్ష్యార్థమునశించలేదు. ఈప్రాచీన సంఘధర్మసూత్రమును విపుల మొందించుటకధునికమానుషవృద్ధి ప్రయత్నించుచున్నది. ఇందు పరిపూర్ణవృద్ధికి గొప్ప ప్రమాదము కలదు. ఏలననగా వ్యష్టిమనుజుని కోరికలెట్టి యహంకారయుక్తములైనను, పైకెంత చెడుగానున్నను, సమిష్టికి యవసరములైన వృద్ధి బీజములతో నిండి, దివ్యలక్ష్యార్థమందుఁ జేర్పఁదగిన కొన్ని విషయము లమరియున్నవి. తుది పరిపూర్ణత్వమునకు సమిష్టి యెంతముఖ్యమో వ్యష్టిసహిత మంతముఖ్యము. వ్యష్టినిరాకరణము మనుష్యునందున్న దేవుని నిరాకరణమే. ఇప్పటిమనుష్యజాతియందు వ్యష్టివలన సంఘమునకుఁ బ్రమాదము కానుపించదు కాని వ్యష్టివృద్ధికి భంగకరమై దాని నణచుచున్న సంఘబలమువలన ప్రమాదము కాన్పించుచున్నది.

వ్యష్టిమనుజునకుఁగల యీప్రమాదమునకు స్వభావము ప్రతీకార మొనరించుచున్నది. ఆప్రతీకారము నేరస్థుని పశుప్రాయమగు తిరుగుబాటుతోఁ బ్రారంభమై సన్యాసియొక్క యేకాంతముతోఁ బూర్తియగుచున్నది. ఆస్వభావము సంఘమందు వ్యష్టిధోరణి కలిగించి సంఘజీవితమునకు వ్యష్టిజీవితమునకు సఖ్య మొనరించ వచ్చును. అట్టి సఖ్యత తీర్మానము కాఁజాలదు. తీర్మానము స్థాపించుట కీవిరుద్ధవిషయముల రెంటికన్న వేరై వానినిలోఁబరుచుకొని సఖ్యముచేయవలసిన నూతనవిషయము కావలెను. వ్యష్టిమనుజుని తృప్తి ప్రధానముగా గల స్వభావసిద్ధమగు సంఘసూత్రముకంటె వేరై కోరికల సంతృప్తిగాక వానిని స్వాధీనము జేసుకొనజాలిన నీతిసూత్రము (moral law) లక్ష్యార్థమైయుండవలెను. ఈభావము మనుష్యజాతికి బలపడినకొలది స్థూలత్వము వదలి మానసికమందుఁ బ్రవేశించుచున్నది. స్వభావవృద్ధి సోపానముల మూఁడింటిలో రెండవసోపాన మెక్కుచున్నది. జాతీయకోరిక లవసరములు వన్నెగాంచును. మానసికావశ్యకత, సౌందర్యభావములు, బుధ్యానురాగములు స్థూలప్రాణముల మించును.

స్వభావధర్మసూత్రి మనగాఁ గోరికల, శక్తుల, ప్రేరేపణల పోరాట, వాని సమతూనికే. మానసికధర్మసూత్రి మనగా న్యాయము ధర్మము ప్రేమ, యోచన, సౌందర్యము జ్ఞానము మొదలగు మానసిక నీతిగుణములు వృద్ధిజెంది యనంతగుణస్థితినొందుట. యోచించువాఁడు వ్యష్టిమనుజుఁడు. మనుష్యజాతి కగోచరమగు విషయముల వెల్లడించువాఁడు వ్యష్టిమనుజుఁడు. న్యాయపరిశోధకుఁడు సహితము వ్యష్టిమనుజుఁడే. నిత్యధర్మసూత్రిముచే బంధింపఁబడక నంతరవ్యక్తి ననుసరించు నాత్మశిక్ష సహితము వ్యష్టిప్రయత్నమే. యోచకుఁడు తన న్యాయశాస్త్రి మనుల్లంఘ్యన్యాయ లక్ష్యార్థముయొక్క రూపాంతర మని తనకు విధించుకొనుటేగాక తనవశవర్తుల కందఱకు విధించుచున్నాఁడు. బహుజనులంగీకరించుటచే నీనూతనధర్మమును సంఘ మవలంబింపకఁ దప్పదు. సంఘము దాని స్వీకరించి తనవిధులకు చట్టములకుఁ గొత్తరూపముల నొసగుచున్నది. స్వభావము దానిని ధర్మముగా స్థిరపరచి యాచారముక్రింద మార్చి వ్యష్టిమనుజునకు బాహ్యసాంఘిక బలాత్కారమగుచున్నది. వ్యష్టిమనుజుఁడు కొంత స్వాతంత్ర్య మొంది యంతరజీవిత వృద్ధికిఁ దగిన నీతి వికాస మొందిన చాలకాలమునకుఁ దరువాత సహితము, సంఘముతనవిధానములలో బాహ్యవృత్తినే కలిగి, యాత్మపరిపూర్ణత్వవృద్ధికంటె యాత్మ సంరక్షణ పరత్వమం దెక్కువదీక్షకలదై యుండును. స్వభావము ననుసరించు సంఘమును జయించి వ్యష్టిమనుజుఁడు ప్రస్తుత మందిన గొప్పవిజయమేదియనగా సంఘనిర్మాణములకుఁ దగిన శోధనయాచారముగాక సంఘధర్మము న్యాయము భూతదయ పరస్పరానురాగ మేకత్వభావముల సంఘమునకుఁ గలిగించుటే. చట్టము సరియైన దనుటకు మానసిక నీతిశక్తి యవసర మనియుఁ బగతీర్చుకొనుటగాక నీతివృద్ధే యాధర్మము శిక్షయనియు సంఘమునకు బోధించుటే యావిజయము. వ్యష్టిమనుజుని భవిష్యద్విజయ మెన్నడనగా, సంఘము వ్యష్టిమనుజుఁడు తమజీవితముల స్వతంత్రమై సమరసమగు నొప్పందలతో సరిపుచ్చుకొని యెన్నడు నడుపఁ గలరో, బాహ్య

బలాత్కారముచే నంతరస్థమును బంధింపక, బాహ్యమును నంతరస్థముచే నెన్నడు పాలింతురో యప్పుడు వ్యష్టిమనుజునకు భవిష్యద్విజయము వచ్చును.

వ్యష్టిమానవుఁడిదివరకుఁ బొందిన విజయము సహితము ప్రత్యక్షసంసిద్ధిలేక నిష్క్రియారూపమున నున్నది. గనుకనే వ్యష్టిమనుజుని నీతిసూత్రమునకు నతని కోరికెల సూత్రమునకుఁ బోరాట కలదు. అట్లే సంఘనీతి సూత్రమునకును మతకులదేశముల స్థూలప్రాణకాంక్షలకు నాచారములకు నపేక్షలకు పోరాట కలదు. ఈపోరాటయందు నీతిశాస్త్రజ్ఞుఁడు తనయనుల్లంఘ్యధర్మము నిర్మించుచున్నాఁడు. తన నీతిసూత్రమునకు విరుద్ధమైన కాంక్షలు, కోరికెలు వానికిఁ బనికిరావు. న్యాయమునకును తన యంతరాత్మకును (conscience) విరుద్ధముగా నుండు సంఘధర్మముతో నతనికిఁ బనిలేదు. ప్రేమసత్యన్యాయములకు విరుద్ధమైన కోరికలు హక్కులు వ్యష్టిమనుజునకుఁ డరాదనియు సత్యన్యాయదాక్షిణ్యముల కొఱకు సంఘము తనక్షేమము సహితము వర్జించవలె ననియు నాని యనుల్లంఘ్యనిర్ణయము.

ఇప్పటి కేర్పడిన యేసంఘమైన నీప్రమాణ లక్ష్యార్థమును దృష్టిచేయుటలేదు. ప్రస్తుతమానుషవృధియందు నీతివిధానమందున్న నెవ్వఁడైన దానిఁ దృష్టిచేయఁజాలఁడు. స్వభావము దానినంగీకరించదు. అట్టిదుండరాదని స్వభావమెఱుగును. ముఖ్యకారణ మేమనగా మననీతి ప్రమాణ్యములు పూర్తిగా వృద్ధికాలేదు. అజ్ఞానావృతములు. అనుల్లంఘ్యములు అవియభేద్యములగు కొన్నిధర్మముల శాస్త్రరూపమున వెల్లడించును. అనుభవమందిప్పటి ధర్మశాస్త్రములన్నియు నాచరణకు వీలుకానివి. అవియుత్తమధర్మమునకుఁ దిసిపోవుచున్నవి. ఒకవిధముగా సరిపెట్టుకొనుచుండినయెడల ముందుముందు సంఘమునకు వ్యష్టి మనుజునకు సరిపెట్టుకొనుటే యగును. ధర్మశాస్త్రము పరిపూర్ణన్యాయహక్కుల మట్టుకే యపేక్షించినయెడల నీతు లనఁబడకపోయినను మనుష్యజాతియందువృద్ధికావలసిన మత్రి

కొన్ని విషయముల నిరాకరించుచున్నది. వ్యష్టిమనుజుని కోరికల సూత్రమందుఁ బరిపూర్ణత్వ మొందుట కర్హమై, సంఘసూత్రనిర్బంధమునకుఁ బాల్పడనీయక కాపాడవలసిన నమూల్యవిషయములున్నట్లు, వ్యష్టిసమిష్టి మనుజుల యోచనయందు ధర్మశాస్త్రముల క్రిందికిరాక, మనుష్యదివ్యత్వమునకుఁ గావలసిననమూల్యమైనవిషయములుకలవు. అంతేగాక పరిపూర్ణన్యాయప్రేమతర్కములు హక్కులు ప్రస్తుతము జనోపయోగమునకు విరుద్ధవిషయములుగా నున్నవి. పూర్ణప్రేమ దేని నసహ్యించుకొనుచున్నదో దానిని న్యాయముకాంక్షించుచున్నది. తర్కము స్వభావమును బరిశీలించి మనుష్యసంబంధముల నిష్పక్షపాతబుద్ధితో విమర్శించి, తృప్తికరమగు ధర్మసూత్రమును వెతుకుచు, పూర్ణన్యాయప్రేమల నొప్పుకొనదు. మనధర్మశాస్త్రము లన్నియు సమాధానపరంపరలగుచున్నవి. మనుష్యజాతియొక విషయమునుండి మఱియొకదానికిఁ బరుగిడుచు విరుద్ధభావములచే వక్రగతుల నడిపింపఁబడుచున్నది. మొత్తమువిూద స్వభావమేది యిచ్ఛగించునో దానినే ప్రియప్రమాసలకు లో__ నెరవేర్చును గాని తాఁగోరుదానిని సరియనుకొన్నదానిని చేయఁదు.

నీతిసూత్రమున కావశ్యకమైన పరిపూర్ణన్యాయగుణముల మనము తెలిసికొన్నను మనమంత్యస్థితికి రాలేము. స్థూలప్రాణబంధముల వ్యష్టిసమిష్టికాంక్ష బంధములఁ దొలగించి నీతివృద్ధి మానసవృద్ధి నిచ్చుదాని మాత్రమేసంపాదించఁ గలిగితిమి. కాని నీతిమానసస్థితికంటె హెచ్చైన విజ్ఞానస్థితికలదు. మనము విజ్ఞానస్థితికి వచ్చినప్పుడు మాత్రమే భిన్నములై మారుచున్నట్టి నీతిసూత్రవిషయముల సమరసత్త్వైకత్వములు రాఁగలవు. స్థూలప్రాణమానసములు తమ రహస్య మూలమేదియో, గమ్యస్థానమేదియో యావిజ్ఞానమం దేకత్వమొందఁగలవు. పూర్ణప్రేమ న్యాయతర్కములు దివ్యజ్ఞానమందేకత్వ మొందుటకు, స్థూలప్రాణమానసములు మన దివ్యధర్మమందు సమరసమొందుటకు, విజ్ఞానస్థితియందు మాత్రము సాధ్యమగుచున్నది. అనగా సంఘముయొక్క బాహ్యధర్మమునకు భిన్నమైన

మఱియొక దివ్యధర్మము కలదు. జంతువుయొక్క స్వభావసూత్రము నుండి యిట్టి దివ్యసూత్ర మేర్పడుటకై రెండు మెట్లుగానున్నవి. దాగియున్న పరిపూర్ణసంసిద్ధికై వృద్ధిజెందుచున్న మనస్థితియే మన లోని దేవుఁడు గాన నీదివ్య సూత్రము త్తమధర్మముకాక తప్పదు. మనము మానుషత్వ మను సమానధర్మము కలిగియున్నాము. భిన్న మానవులము. కాన నీధర్మ మేకత్వమందు సమిష్టికి యుత్తమమాన వధర్మమగుచున్నది. భిన్నత్వమం దీశ్వరుని వ్యష్టిరూపమునకు నుత్త మధర్మము సహితమగు చున్నది. ఈయుత్తమధర్మముపూర్తిగానా చరింపఁ బడెనేని యదిపరిపూర్ణస్వాతంత్ర్యముగా ననుభవమునకుఁ దోచుచున్నది.

ప్రయోజనమో మఱియొక ప్రవర్తనవిషయమో ధర్మశాస్త్రమునకు ముఖ్యముగా నెంచి నీతిశాస్త్రజ్ఞ లీయాయుత్తమసూత్రమును నీతియందు స్థాపింపఁ బ్రయత్నించుచున్నారు. అట్టి సర్వ ప్రయత్నములు వ్యర్థమగుచున్నవి. అవిప్రయోజన శూన్యములు. మానవునందు వృద్ధిచెందుచున్న దేవుని యావిర్భావమైన మనుష్య స్వభావముప్రత్యేక మొక బలాత్కారవిషయముచే బంధింపఁబడు టకవకాశములేని బహుముఖత్వమై యున్నది. అధునికమతములవు తారముఖమున దేవుని ధర్మమును వెల్లడించుటచే దానిస్థాపింపఁబ్ర యత్నించుచున్నవి. కాని యవి విశేషశక్తికలవైనను నీతిని వెల్ల డించు ప్రమాణ్యములుగా మాత్రము పరిణమించుచున్నవి. క్రైస్తవ బౌద్ధ ధర్మములవలె నసుల్లంఘ్యమైన నేదోయసాధ్యము నవలం బించుటచేతనో కాలగతిచే నిరుపయోగముతైన సమాధానముగా మారుటచేతనో స్వభావముచే నవి నిరాకరింపఁబడుచున్నవి. ప్రాచీ నమతములు, మను కాన్ఫ్యూషియస్సు (confucious) ధర్మ శాస్త్రముల నిర్మించినవి. అట్టి శాస్త్రములందు సంఘసూత్రముల నీతిసూత్రముల, మన యనంతస్థితి కనుసరిలచిన ధర్మముల నేకత్వ మొందింపఁగొన్ని ప్రయత్నములు జరిగినవి. మొదటి రెండు విషయ ములు సర్గవృద్ధికి సంబంధించినవే. మూఁడవది సాంఘిక నీతిసూత్రి

ములకుఁ గట్టుబడుటచే వానిదశనే పొందవలసినదాయెను. కాబట్టి శాస్త్రము నిరుప యోగమగుచున్నది. లేదా మారిమారి త్రోసి వేయఁబడుచున్నది. లేదా మానుషవృద్ధికిగట్టి యభ్యంతర మగుచున్నది. లేదా సాంఘిక బాహ్యధర్మమును స్థాపించి యది వ్యష్టిమనుజుని యంతరస్వభావమును నిర్లక్ష్యపెట్టుచున్నది. కాని వ్యష్టిమనుజుని స్వభావము నిరసింపఁ బడకూడదు. దానికాంక్షలొంగునవికావు. హద్దుమీరి ననుభవించిన నరాచకము సంభవించును. బాహ్యసూత్రముచే దానినణచి నిర్మూలనుచేసిన మురుగు చావు సంభవించును.

నిజమేమనగా నీతిసూత్రమును వ్యష్టిమనుజుఁడు మొదట తనలో నెట్లుకని పెట్టితరువాత జనసామాన్యమునకు వ్యాపింపఁజేసెనో యట్లే యుత్తమసూత్రము సహితము మొదట వ్యష్టిమనుజుని చేఁ దనలోఁ గనిపెట్టఁబడి యితరులకు వ్యాపింపఁ జేయఁబడుచున్నది. సూత్రముచే వారినిబంధింపకఁ దమలోఁ దామెట్లుదానిఁ గనిపెట్టిరో యామార్గమును నేర్పుచున్నది. విజ్ఞానజీవితము సంకెలలతో బంధింపఁబడుట కొప్పుకొనదు. దానిమార్గములు దానివే. ఇవినిర్మింపఁబడిన బాహ్యసూత్రధర్మము ననుసరింపక మానవుని స్థితినిబట్టి వృద్ధిజెందుచున్నవి. విజ్ఞానజీవిత సమన్వయమే వ్యష్టిన మిష్టిపరిపూర్ణత్వ మివ్వగలదు. సదా యీశ్వర సాన్నిధ్యమందు మనముచేరుటచే నేదో యొకవిధమైన యీశ్వర పరిపూర్ణజ్ఞానము వ్యష్టిసమిష్టి మానవునందు వ్యక్తముకాగలదు.

సదా యీశ్వరసానిధ్యముయొక్క పరిపక్వమే దివ్యేచ్ఛకు సమర్పణ మనుచున్నాము. భిన్నరూపుఁడైన యహంకారజీవుఁడు సర్వవ్యాపకుఁడగు నద్వితీయుని యందైక్యమగుట యనుచున్నాము. జీవుని సర్వవ్యాపకత్వము సమస్తముతో నేకత్వము సమర్పణమునకు మూలము. ఆసర్వవ్యాపకత్వ యేకత్వములందే మనుజునిలో దేవుని యావిర్భావ విషయమైన యుత్తమధర్మమును గాంచెదము. దానియందే వ్యష్టిమనుజుని యుత్తమధర్మము సహితము

గాంచెదము. దానియందే సర్వభేదభావములు పూర్తిగా సమరస మొందుచున్నవి.

మొదట మనుజునికోరికలవల్లను, తరువాత నీతిమానసిక లక్ష్యార్థములచే వికాసమొందింపఁబడిన కోరికలవల్లను, తుదకు నీతి మానసిక ధ్యాస లనఁబడు కోరికల సమన్వయించఁగల విజ్ఞానస్థితి వల్లను, నడిపింపఁబడు వ్యష్టిసమిష్టి మానవులందు వృద్ధిఁజెందుచు వ్యక్తమగుచున్న నీశ్వరుఁడే సర్వధర్మమని మనకుఁ దోఁచినది. మనుజుఁడు తాను ప్రత్యేకజీవుఁడ నని చేయుశ్రమకు బదులుగా నేదిసర్వవ్యాపకమగుటచేఁ బ్రత్యేక సంతృప్తికై ప్రయాసపడదో, వస్తువుల యందనురాగము కలదైనను వ్యష్టిసమిష్టి యహంకారముచే బంధింపఁబడదో, యట్టి సర్వవ్యాపక పురుషధర్మము నుపయోగించుటచే నీవిజ్ఞానవ్యక్తి పరిపూర్ణ సమాధానము కల్పించి పవిత్రకర్మాచరణ మొసంగుచున్నది. అట్టి కర్మ యొకప్రత్యేకవిషయమును గాని, యంగీకరింపఁబడిన సూత్రమునుగాని యనుసరించదు. అది యహంకార పురుషునకుఁగాని, ప్రపంచమానవునకుఁగాని, నీతిశాస్త్రజ్ఞునకుఁగాని, దేశాభిమానికిఁగాని, వేదాంతికిఁగాని తృప్తిగా నుండదు. ఎందుకనగా నెన్నుకొనఁబడి ప్రత్యేకించి ధర్మముగా స్థాపింపఁబడిన కర్మగాక, సచ్చిత్ జ్ఞాన రాశినుండి యప్రయత్నముగా బ్రవహించుచున్నది. ఈశ్వరత్వముకొఱకు వృద్ధిచెందుచున్న లోకములఁ జెదరిపోకుండఁ బట్టుట దాని ముఖ్యాభిప్రాయము. అందుచే దానిని నిర్హేతుకస్థితి ధర్మ మనికాని తనంతటఁ దా నిర్ణయింపఁబడిన కార్యమనిగాని చెప్పరాదు. స్వభావముయొక్క కార్యమువలెనే యది యంతర్గర్భితమైన చిత్తజ్ఞానరాశినుండి వెలువడుచున్నది. కాని యీమాయిచ్ఛాజ్ఞానములు వికాస మొందనవి. దాగునవికావు. పరిపూర్ణానంద భరితములు. ద్వంద్వభావములచే బంధింపఁబడనివి. అది యహంకార కల్లోలములకు మారుగా నేర్పడినయీశ్వరేచ్ఛానుగుణ్యమైన కార్యము.

ఏదో యద్భుత మొనరించి యీశ్వరుఁడే మనుష్యజాతిని యొకపర్యాయముగా నీస్థితికి లేవనెత్తిన పక్షమున సత్యయుగము తప్పకవచ్చును. అప్పుడు ధర్మము బుద్ధిపూర్వకమై ప్రతిజంతువునందు వ్యక్తితోఁ దనపని స్వేచ్ఛగా సమరసభావముతోఁ జేయుచున్నది. అప్పుడు భిన్నత్వముగాక నేకత్వము జాతీయజ్ఞానమునకుఁ బునాది యగుటచేఁ బ్రేమ పరిపూర్ణమగుచున్నది. స్వేచ్ఛతో నొనరింపఁబడి ఫలదాయకమగు బుద్ధిపూర్వక కర్మచేఁ బరిపూర్ణన్యాయము సంభవించుచున్నది. తప్పక సిద్ధించు సరియైన సంబంధములఁ దెలిసికొనుటచేఁ దార్కిక వివేకము తృప్తినొందుచున్నది. వ్యష్టిమనుజునకు సంఘమునకు, నొకసంఘమునకు మఱియొక సంఘమునకుఁ బోరాట నశించుచున్నది.

కాని యిప్పటి మనుజుల పరిస్థితినిబట్టి మార్గప్రదర్శిగా నిట్టి యున్నతత్వ మారోహించవలసినవాఁడు వ్యష్టిమనుజుఁడే. అట్టి వాని కర్మలకుఁ దప్పక దివ్యసమిష్టి కార్యములకంటె వేఱుగురూపముల నిరూపించుచున్నది. అంతరస్థితి యనఁబడు కర్మమూలమీ రెంటికొక్కటే. కాని కర్మలు మాత్రము భేదించును. పూర్ణయోగసాధకుఁ డీశ్వరేచ్ఛ యొక్క పాలనకుఁ దన సర్వకర్మల సమర్పించుట వలనఁ గలిగెడి ఫలముల నీప్రామాణ్యమును బట్టి యోచించుకొనవలెఁగాని యీపరిపూర్ణ లక్ష్యార్థమును బట్టికాదు.


ధర్మశాస్త్రము సంపూర్ణము.



# యోగసంకలనము.



## ఎనిమిదవ అధ్యాయము.



## ఉత్తమేచ్ఛ.



వెనుకటి యధ్యాయమందు క్లుప్తముగా విమర్శించినవిషయములఁబట్టి "సర్వకర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ" యను గీతావాక్యము మనకుఁ బూర్తిగా బోధపడుచున్నది. సకలధర్మశాస్త్రములు సూత్రములు స్థూల స్థితినుండి యాత్మస్థితికి మారునపుడు జీవునకుఁ గావలసియున్న యవసరములఁబట్టి తత్కాలమున కేర్పడుచున్నవి. స్థూలప్రాణ జీవితమందు, విజ్ఞాన సంపర్కముగల మానసికజీవితమందుసహితము, మనము మార్పుతో సంతృప్తి జెందునంతకాల మీశాస్త్రాధిపత్యముండునదే. కేవల విజ్ఞానమందుఁ బూర్ణముగాఁ బ్రవేశించితిమా యీధర్మములదాటి, సర్వేశ్వరుని సర్వహితుని నమ్మి యనంతస్వేచ్ఛా సముద్రమందుఁ బ్రవేశించుటకు ధైర్యనమ్మకములు గలవారమగుదుము. ధర్మచట్టమును దాటిన స్వేచ్ఛ కలదు. స్వకీయపరకీయ ప్రాపంచిక ధర్మముల దాటిన దివ్యస్వాతంత్ర్యము నిర్గుణత్వము కలదు. నిలువున నారోహించు సరళమార్గము దాటిన శిఖరమందు విశాలపిటభూము లున్నవి.

స్థూలమనోవిజ్ఞాన జీవితములనఁబడు నారోహణసోపానములు మనకు మూఁడు గలవు. స్థూలజీవితమం దవసరము యొక్క కోరిక యొక్క యాధిపత్యమునకుఁ బ్రాముఖ్యతకలదు. తరువాత వ్యష్టిమనుజక్షేమము, సంఘక్షేమము మనోజీవితమందనుభవ జన్యములగు లక్ష్యార్థముల యాధిపత్యమునకుఁ బ్రాముఖ్యతకలదు. స్థూలజీవితమును నిర్మించునది మానసజీవితముగాన లక్ష్యార్థమునను సరించి మొదట వ్యష్టిమానవజీవితము తరువాత సంఘజీవితము మారవలసియున్నది. విజ్ఞానమయ జీవితమం దంతరాత్మ (ప్రభువు) మన స్థితి ధర్మమునకు సాధ్యమగు నున్నతవిపుల పరిపూర్ణత్వానుగుణ్యమైన యంతర్వృద్ధిని నిర్మించు చున్నాఁడు. తుదకిది పూర్ణస్వాతంత్ర్యముతోఁ బనిచేయుచున్నది. మనుజునకుఁ బొందవలసిన మఱొక ఫలము, సిద్ధింపవలసిన మఱొకకోరిక లేనందున దివ్యగమ్యస్థాన ప్రయాణమందున్న ప్రపంచముయొక్క యుద్ధరణమే ముఖ్యమై యుండును.

కర్మమార్గావలంబకుఁడు కర్మకుఁ గోరికే ప్రధానమనుస్థితి దాటినవాఁడై యుండవలెను. తన్నే కోరికలింకను భాదించుచున్నవో వానిని తనలో నీశ్వరునకు వశము జేయవలెను. ఈశ్వరుఁడుసాధకుని మంచికొఱకు నందఱి క్షేమముకొఱకు వానిని వినియోగించుచున్నాఁడు. ఇట్టియర్పణసిద్ధించెనాయహంకారజనిత కామము తనంతట నశించుటకుఁ గొంత కాల ముండనివ్వఁబడును. అహంకార సంభవాస్థిమిత మహోన్నతస్థిమితముతోఁ బోల్చి చూచుటచే నహంకారజనిత దుఃఖముల కామము మోక్షమునకై ప్రయత్నించుజీవునకు నాడీరాగప్రాణ ధర్మము కాదని నేర్పుటకుఁగొంతకాలముండనివ్వఁబడుచున్నది. తదనంతరమాధ్యాసలయందుఁ గామము తొలగింపఁబడి సమస్తకర్మలలో విషయములలో సమానమైన నానంద సహితికర్మప్రవృత్తిమట్టుకు నిలిచియుండును. పనిచేసి యానందించుట నాడీపురుషుని ధర్మముహక్కు. కాని స్వార్థపరత్వ కాంక్షతోఁ గర్మానుభవముల

నెన్నుకొనుట యతని యవివేకచిత్తము. అతనిహక్కు కాదు. ఎన్ను కొనునది లోపలనున్న సర్వవ్యాపకయుత్తమ చిత్తము.

అహంకారజీవుఁడు తనయాత్మశిక్షకై తనకంటె విపులమగు నహంకార జీవునకు లోఁబడుటకు సంఘధర్మముసాధనమగుచున్నది. ఆసంఘధర్మము సంఘక్షేమావసరములనుగాని గొప్పనీతి ప్రమాణముచే మార్పఁబడిన సంఘక్షేమావసరములను గాని వెల్లడించవచ్చును. మనుజునకుఁ గల యుత్తమధర్మమునకంటె వేరుకానంతవరకు నది సంఘవిధి రూపమున మనుష్యునకు ధర్మమగుచున్నది. కాని కర్మయోగ సాధకుఁడు దీని సహితము కర్మేశ్వరున కర్పింపవలెను. ఇట్టి సమర్పణం బతఁడు చేసినతరువాత సాంఘిక ప్రేరేపణలు, తీర్మానములు, కోరికలు వలెనే తమంటతాము నశించుట కుపయోగింపఁబడుచున్నవి. అతని యధోమానసిక స్వభావము, జనసామాన్యముతోనో, వేరుమనుష్యసంఘముతోనో తన కర్మకాంక్షధ్యానముల యం దేకీభవించుట కవసర మున్నంతమట్టుకే యుపయోగింపఁబడుచున్నవి.

ముక్తుఁడైన తరువాత సహితము సాధకుఁడు ప్రపంచమందే యుండును. ప్రపంచమం దుండు టనగాఁ గర్మలఁ జేయుటే. కోరిక లేక గర్మలఁ జేయు టనగా మానవకోటి క్షేమమునకుఁ బాటుపడుటే. తనకుఁ బ్రాప్తించిన యావరణమం దుండిగాని, తాబుట్టిన సంఘమందుండిగాని, తన కేర్పడిన మఱియొక సంఘమం దుండిగాని, పాటుపడుటే. కాబట్టి మనకుఁ బరిపూర్ణత్వము ప్రాప్తించగా సంఘమునుండి మనుష్యజాతినుండి మనయనురాగమును స్వాతంత్ర్యైక భావమును దొలగించు న దేదియు మానసవ్యక్తియం దుండ రాదు. చివరకు సంఘ, జాతి, మతాభిమానములకు వశముకాని స్వాతంత్ర్యైకత్వము కలుగవలెను. ఏదైన సంఘధర్మము ననుసరించినప్పటికి యది స్థూలావశ్యకత ఫలము, వీలు, యావరణము, విధి మొదలగు వాని యొత్తిడివల్ల కాదు. ప్రస్తుతమున్న సంఘధర్మ మవలంబించుట, దాని నిరాకరించి జనుల మనస్సుల గల్లోలపరచుకుండుట

యీశ్వరేచ్ఛయని తెలుసుకొనుటవలన, కర్మేశ్వరునికొఱకుఁ జేయఁ బడుచున్నవి. లేక సంఘధర్మము నిరాకరింపఁబడిన యెడల నదికోరి కస్వచిత్త స్వాభిప్రాయముల దృప్తికిఁ గాక లోకముల వృద్ధికొఱకు సంఘధర్మము మార్చుట తీసివేయుట యవసరమని తెలియుటవలన నట్లు చేయఁబడుచున్నది.

ఇక నీతిధర్మ, మనగాఁ, బ్రమాణ్యధర్మమున్నది. ఎవరిని సర్వప్రమాణ్యముల సంపూర్తిగా వెల్లడించునో యట్టివానియందు సాధకుఁడు దీని సహితం మర్పింపవలెను. నాశములకు సంబంధించిన కామ మనఁబడు రజోగుణము నశించగనే పాపబంధము నశించు చున్నది. కాని సాధకుఁడు మున్ను తానేర్పరుచుకొని యలవాటు పడిన పుణ్య మనఁబడు బంధమునకు లోఁబడి యుండనవసరములేదు. ముఖ్యతమము గాఢతరమైనది మఱియొకటి దానిస్థానమం దమరు చున్నది. పుణ్య మనుమాటకు మొదట మానుషత్వ మని (man-hood) యర్థముండెను. కర్మయోగ సమాప్తి యుత్తమ మానుషత్వ మగుచున్నది. దానినే జీవత్వమనిన మేలు (soulhood). మానుష పుణ్యము (human virtue) నకు మాఱుగా నుత్తమ సత్యప్రేమ జనిత కర్మరూపమునఁ దనంతటఁదా నావిర్భవించుచున్న స్వతంత్ర జీవత్వము కలుగవలెను. కాని యీయుత్తమ సత్య మిప్పటి స్వల్ప యనుభవస్థితి వివేకమునకుగాని, సత్యమని మన మనుకొను స్వచ్ఛ మైన విపుల ప్రమాణ్య వివేకమునకుఁగాని పనికిరాదు. ఈయుత్త మప్రేమ మన యనుభవమందున్న రాగభరితమైన దయదాక్షిణ్య ములుకాదు. స్వల్పధర్మము గొప్పవిషయమును బంధింఁపజాలదు. అసంపూర్ణమైన సిద్ధి యుత్తమ సంసిద్ధిని శాసించనేరదు.

మొదటి యుత్తమ సత్యప్రేమలు సాధకుని యందతనిముఖ్య స్వభావధర్మానుసారముగా నాజీవుఁ డెట్టి దివ్యస్వభావ భాగమునుం డి యుద్భవించెనో యట్టిదాని ననుసరించి సిద్ధిపొందుచున్నవి. అతనికి ఋషిస్వభావమో, క్షాత్ర యోధస్వభావమో, భోగస్వభావమో, కింకర స్వభావమో గుణసమ్మేళనమును బట్టి యేర్పడుచున్నది.

తనకర్మలయందు మనుజుఁ డీట్టి యాత్మస్వభావముయొక్క స్వేచ్ఛా విహారముగాంచును గాని బాహ్యధర్మముచే నడుపఁబడు నడవడికెను కాదు.

కాని యింతకంటె నుత్తమసిద్ధికలదు. అది యనంతము. దాని యందీ తుదిహద్దుసహితముండదు. అందు జీవునకు హద్దులు లేవు. అన్ని యాకారముల రూపముల నీశ్వరేచ్ఛాను సారముగా నుప యోగించునే కాని వానిచే నడ్డగింపఁబడి బధింపఁబడఁడు. ఇదే కర్మ మార్గమునకు శిఖరము. కర్మలయందు జీవునకుఁగల సంపూర్ణ స్వా తంత్ర్యమిదే. నిజమునకు దానికిఁ గర్మలేలేవు. దాని సమస్తకార్య ము లీశ్వర విలాసములే. ఈశ్వరుని వలన నుత్పన్నమగుచున్నవే.

ఉత్తమ సర్వవ్యాపకేచ్ఛకుఁ గర్మల సమర్పణము (అహం కారజనిత సాధారణకార్య విధానమునకు మారుగా మనలోని రాజ్యమునకు నియమధర్మములతోఁ బనిలేని సమర్పణము) కర్మ యోగమున కంత్యమనఁబడును. ఈయుత్తమ దివ్యేచ్ఛయనగా నేమి? దానిఁ దెలుసుకొను టెట్లు.

సర్వ సాధారణముగా వ్యష్టి దేహమానస నీతి స్వభావముల నడుపునట్టి, ప్రత్యేకకర్మల నెన్నుకొనునట్టి "నేనను" నహంకార మే మన మనుకొనుచున్నాము. తనలోఁ దాపరిశీలించఁ జాలని మూఢునకుఁ బైకిఁ గనుపించునట్టి "నేనను" నహంకారముకంటె వేరైనసత్యము గాఢము శక్తియుక్తము మనలోఁ గలదని యూ హించుట కష్టసాధ్యము. కాని వస్తుజ్ఞానమునకెట్లో యట్లే యాత్మ జ్ఞానమునకు సహితము మొదటి మెట్టేది యనగాఁ బైకిఁగనుపించు సత్యముల విడనాడి నిజమైన సత్యమును లోన వెతుకుకొనుటే.

నిజమునకు "నేనను" నీయహంకారము విచక్షణగల మా నసమం దేర్పడిన మానసిక స్వభావమే కాని వేరు కాదు. బహిరంగ మునకు మనమందఱ మేదియగుచున్నామో దేనిని జేయుచున్నా

మో యదే స్వభావము (Nature). అది కార్యనిర్వాహక బ్రహ్మాండశక్తి యనఁబడుచున్నది. అదిమనల నిర్మించియున్ను నిర్మింపఁ బడిన మన స్వభావావరణ మానసములద్వారా మనకర్మల కర్మఫలముల నిరూపించుచున్నది. యోచన మనలోఁ బుట్టుచున్నది. ధ్యాస మనలోఁ బుట్టుచున్నది. యోచన కలిగించి, సంకల్పమును మీఁదఁబడవేసి, ధ్యాసను బుట్టించునది బ్రహ్మాండశక్తి. మనదేహము, మానసము, "నేనను" నహంకారము (ego) క్రియారూపమైన నాశక్తి సముద్రములో నొక తరంగము. గనుక సాధకుఁడు సత్యాత్మజ్ఞానములకొఱకుఁ దానొందుచున్న వృద్ధిలో నహంకార కర్మలవిషయమై యీసత్యమును జీవుఁడు కళ్లు తెరచి తెలుసుకొను స్థితికి రావలెను. కర్మలు చేయునది కర్మల నడుపునది "నేనను" నహంకారమనుమాట విడువవలెను. పనిచేయునది తనలోని ప్రకృతియనియూ బ్రహ్మాండశక్తి దాని స్థిరపడిన విధానముల ననుసరించు చున్నదని తెలుసుకొనవలెను.

కాని యాశక్తివిధానముల నేది స్థిరపరచెను ? ఆశక్తి వ్యాపారము నేదిసృజించెను ? ఏదిపాలించెను ? అశక్తికి వెనుకనున్న ప్రభువు, సాక్షి, జ్ఞాత, భోక్త, కర్మానుజ్ఞాత, జ్ఞానస్వరూపమే. అదే పురుషుఁడు. ప్రకృతి మనకార్యముల నిర్మించుచున్నది. పురుషుఁడు దానికిసాక్షి. ప్రకృతి మనమానసమందు భావము పుట్టించుచున్నది. పురుషుఁడట్టి యోచన తెలుసుకొనుచున్నాఁడు. దానిసత్యత్వ మెరుగుచున్నాఁడు. ప్రకృతి కర్మఫలముల నిరూపించుచున్నది. పురుషుఁడనుభవించు చున్నాఁడు. ప్రకృతి దేహమానసముల నిర్మించి వానితోఁ బనిచేసి వానిని వృద్ధిజేయుచున్నది. పురుషుఁడు దానిసృష్టి వృద్ధుల నామోదించి దాని ప్రతికార్యమున కనుజ్ఞనిచ్చుచున్నాఁడు. సకల చరాచరములందుఁ బనిచేయునట్టి యిచ్ఛాశక్తిని (will force) ప్రకృతి యుపయోగించుచున్నది. ఏది జరుగవలెనో దానినెఱిగి పురుషుఁడా యిచ్ఛాశక్తిని బనికిఁ బురికొలుపుచున్నాఁడు. గనుక నీపురుషుఁడు "నేనను" నహంకారముకాదు. అహంకారమునకు

వెనుకనున్నయాత్మ, శక్తి, జ్ఞానమితఁడు. "నేన" ననది యీ యాత్మ యీశక్తి యీజ్ఞానముయొక్క యసత్యమైన మానసిక ప్రతిబింబము.

నే నను మానసికయహంకారముగాక మనలో మరియొకటి కలదు. అది యద్వితీయుఁడు సర్వవ్యాపకుఁడైన పురుషుని స్వచ్ఛమగు ప్రతిబింబము. అదే జీవుఁడు. అదే వ్యష్టిరూపమైన యాత్మ. అది స్వభావముతోఁ బ్రత్యేకమః విలాసము జరుపుటకుఁ దనశక్తి జ్ఞానములఁ దగ్గించు కొన్న యాత్మ. హిందూవేదాంతశాస్త్రములం దు దీనిని జీవుఁడందురు. అజీవుఁ డీయహంకారమే తా నని ప్రస్తుతము భ్రమపడుచున్నాఁడు. అహంకారమును విడిచి సర్వవ్యాపకమగు నుత్తమ యాత్మప్రతిబింబము తా నని తెలిసికొనవలెను. అట్టి యుత్తమాత్మ యొక్క జ్ఞానమునకుఁ బ్రపంచమందుఁ దా నొకస్థానమని తెలిసికొనవలెను.

అహంకార క్రియారూపముల విడుచుటకు సాధకుఁడు నేను పనిచేయుచున్నా నను వ్యక్తిని విడువవలెను. స్వభావకార్యము ననుసరించి తన మానసశరీరసాధనములచేఁ దనలో సర్వము జరుగుచున్న దని తెలిసికొనవలెను. అప్పుడు తాను స్థిమిత మొందుచున్నాఁడు. కర్మలకు సాక్షి యగుచున్నాఁడు. కర్మఫలములఁ బ్రశాంతుఁడై యంగీకరించుచున్నాఁడు. కర్మ ప్రేరేపణల కనుజ్ఞ యిచ్చిన యిచ్చును, నిరాకరించిన నిరాకరించును. కర్మయతని యనుజ్ఞతోఁ బని లేకనే, వెనుకకూడఁ బెట్టిన శక్తియొక్క, స్థిరపడిన స్వభావముయొక్క ఫలరూపమునఁ బరిణమించుచున్నది. తుదకుఁ దాఁజూచుటకుఁ దెలిసికొనుటకు, ననుజ్ఞయిచ్చుటకు, నంగీకరించుటకు నిరాకరించుటకు మూల మేదో యాయుత్తమాత్మను దనలోఁ దెలిసికొనుచున్నాఁడు. ఇదే యీశ్వరుఁడు. ఆకర్మేశ్వరుఁడు తన యిచ్ఛను విధానమం దెట్లు వెల్లడించునో యామార్గములఁ దెలిసికొనుటనుబట్టి తక్కిన మానవృద్ధి యుండును.

ఈశ్వరుఁడు జరుగవలసినదానిని తన సర్వజ్ఞత్వముచేఁ జూచుచున్నాఁడు. ఈచూచుటే యతని యిచ్ఛ. అది సృష్టిముఖమైన శక్తిరూపము. అతఁడు చూచినదానినే కార్యనిర్వాహక స్వభావశక్తియా సర్వశక్తుని యాసర్వజ్ఞుని బానిసవలె సాధనమై నెరవేర్చుచున్నది. ఈశత్వమం దీవీక్షణము నిర్హేతుకముగ జనించుచున్నది. అది చూడవలెనని మర్త్యులుచేయు ప్రయత్నముకాదు. కాబట్టివ్యష్టిజీవుఁడు స్థితిజ్ఞానములం దీశ్వరునితో నేకత్వ మొందినపుడు జరుగవలసినదేదియో యారూపమున మనలో నుత్తమేచ్ఛజనించి నిర్హేతుకమైన స్వభావకార్యముచేఁ దనంతఁ దాసంసిద్ధినొందుచున్నది. కోరికలేదు. బాధ్యతలేదు. ప్రతిఫలము లేదు. ఆయుత్తమేచ్ఛ విధి ప్రేరేపణగా దైవప్రేరితకార్యముగాఁ బరిణమించవచ్చును. ఆయుత్తమేచ్ఛమానసమందుఁగాక హృదయ శరీరములందుఁ దనంతటఁ దానావేశరూపమునఁ దోఁచవచ్చును. దాని పూర్ణజ్ఞాన మింకను దెలియఁ బడకపోవచ్చును. ఆయుత్తమేచ్ఛ సంకల్పమందుఁ బ్రకాశమానమైన యనుజ్ఞవ్యక్తిరూపములఁ దోఁచి తక్కిన పరికరణములచే నిర్హేతుకముగా నెరవేర్చఁబడవచ్చును. యోగము పూర్తికానప్పుడు కొన్ని కర్మల మట్టుకీవిధమునఁ జేయఁబడును. యోగముపూర్తిచెందినపుడు సమస్త కర్మ లీవిధమునఁ జేయఁబడును. అనగా వ్యష్టిజీవకార్యకరణమునకు సర్వేశ్వరుఁడైన యుత్తమపురుషుని యిచ్ఛ ననుసరించి యతని యానందముకొఱకు నిర్హేతుకముగాఁ బ్రకృతిచేయు కార్యము లగుచున్నవి.

ఇది యుత్తమమైన కర్మవిధానము. దీనికంటె తక్కువవిధానముకలదు. అం దీశ్వరుఁడు ప్రకృతిలో స్వయముగా దాగుచున్నాఁడు. వ్యష్టిజీవుని యహంకారసహితుని జేసి స్వభావముచే నడిపించుచున్నాఁడు. లేక నతని వెనుకటి కర్మల నిర్మాణముల చిరకాలమునుండి పాతుకొనియున్న యలవాట్ల బలముచే నాత్మజ్ఞానముకొఱ కతఁడు చేయు ప్రయత్నముల కడ్డుగా నడిపించుచున్నాఁడు. మరణచ్ఛాయల లోయయనఁబడు నీతక్కువ విధానమునుండి యుత్తమ

విధానములోఁ బ్రవేశించుటకు బహుకాలము పట్టును. పరీక్షలు, భాదలు, దుఃఖములభ్యంతరములు, పొరపాట్లు గోతులుగల మార్గమిది. ఈకష్టముల దాటుటకు నమ్మకము కావలెను. లోనుండి తనంతటఁ దానావిర్భవించు జ్ఞానమునకు మానసిక సమర్పణము క్రమముగా వృద్ధిపొందవలెను. ఎడతెగని సరియైన యోగాభ్యాస ముండవలెను.

నిరుత్సాహరహితమైన హృదయముతో నెడతెగని యభ్యాసముండవలెనని గీత చెప్పుచున్నది. మొదట నీమార్గ మందులోని పోరాటభాద విషతుల్యమై తోచునుగాని తుదకు శాశ్వతామృత మాధుర్య మనుభవింపఁబడును.





# యోగసంకలనము.



తొమ్మిదవ అధ్యాయము.



## పరిపూర్ణసన్యాసము.



ఈశ్వరేచ్ఛకు లోబడుట పూర్తిగా నెట్లు సంభవించఁగలదో యాసోపానపంక్తిని మన మిప్పుడు నిర్ణయించఁగలము. కర్మలయం దాత్మసమర్పణము మొదటి సోపానము. మనలో సమస్తభూతము లలో సమస్తబ్రహ్మండకార్యములలో నున్న యుత్తమునకు సమస్త కార్యముల నివేదించు యలవాటే యాత్మసమర్పణ మనఁబడును. జీవితము వేదిక, కర్మలు నైవేద్యములు. అతీతమైన యిచ్ఛయే దేవత. ఈనివేదన కీయాత్మసమర్పణమునకు రెండువైపులుకలవు. (1) కేవలకర్మ, కర్తయొక్కభావము (2) మనము చూచునట్టి యోచించునట్టి యనుభవించునట్టి సమస్తమున కధికారిని బూజించుట.

కేవల కర్మ మనకున్న ప్రకాశముచే నిర్ణయింపఁబడుచున్నది. విధియనుజ్ఞానముచేతనో, భూతదయచేతనో, యితరులకుగాని బ్రపంచమునకుగాని క్షేమమను భావముచేతనోఁ కలడని నమ్మినను మన మింక నెవనినెరుగమో యాకర్మేశ్వరుని బ్రతినిధి మనకంటె జ్ఞానమతుఁడైన గురువుయొక్క యాజ్ఞ నంగీకరించుటచేతనో మనకు

విధియని తోఁచినదే యాకర్మ. సమస్త ఫలాపేక్ష సమస్తఫలాసక్తి త్యజించుట కర్మల నివేదనకు ముఖ్యము. ఎంతకాలము ఫలాపేక్షతోఁ బనిచేతుమో యంతకాలము నివేదన యహంకారమునకేగాని యీశ్వరునకుఁ గాదు మన మీశ్వరునికే ననుకొనవచ్చును. కాని మనము మోసపోవుచున్నాము. మనయీశ్వరభావము, జంతుదయా ళుత్వముఁ విధిజ్ఞానము, పరోపకారబుద్ధి, గురుభక్తిసహిత మహాంకార జనితకామము వేసుకున్న వేషములగుచున్నవి. మనలోనియహంకారమును దొలగించుటకు మారుగా దానిని దాచి సంరక్షించుచున్నాము. యోగముయొక్క యీసోపానమందు మన మెల్లప్పుడు జాగరూకులమై యుండవలసిన శత్రువిది మనలో నీశత్రువు దాగి వివిధవేషముల వేయుటగాంచినపుడు మనము భయపడనక్కరలేదు. ఆశత్రువును గనిపెట్టుటకు జాగరూకులమై తొలగించుటకుఁ బట్టుదలఁ గలవారమై యుండవలెను.

“కర్మకు నీకు హక్కుకలదు. కాని కర్మఫలమునకు నీ కేవిధమైన హక్కు లేదను” గీతావాక్యము దీనినే బోధించుచున్నది. కర్మపరిభువునకే తప్పక ఫలములు చెందవలెను.

కర్మయోగికి కర్మాధిపతిపూజ, మనలో సమస్తవస్తువులలో సర్వకామములలో స్పష్టముగా సంతోషముతో నతని యొప్పుకొనుటచే సంభవించును. జీవసమత్వమే యీపూజకు చిహ్నము. ఈశ్వరుఁడు సమస్తభూతములందు సమానముగా నున్నాఁడు. కాబట్టి మనకు నితరులకు, జ్ఞానులకు నజ్ఞానులకుఁ, బుణ్యాత్ములకు, బాపాత్ములకు, మిత్రులకు, శత్రులకు, మనుష్యులకు, జంతువులకు భేదములు కల్పించరాదు. నీచముగఁ జూడరాదు. నిరాకరించరాదు. వేషధారియై యందఱియం దాయొక్కఁడే యున్నాఁడని తెలిసికోవలెను. రూపముల ధరించుటకుఁ గర్మలఁ జేయుట కతని సంకల్పమున కేదిపనికి వచ్చునో తద్వారమునఁ దన జ్ఞానేచ్ఛానుగుణ్యముగా స్వల్పముగానో, గొప్పగానో వెల్లడి యగుచున్నాఁడని తెలిసికోవలెను. సమస్తము మనయాత్మే. క్రోధము నిరాకరణ మసహ్యాతయ జ్ఞానజీవుని

యహంకారములు. కొన్ని స్థితులం దవి స్వభావసిద్ధములు, తప్పనివి యవసరములై నను గర్మయోగికిఁ దెలివిహీనత యభ్యంతరములవా సనలని తోఁచును. అతఁడు వృద్ధికానుకాను జీవుని శైశవమందు దివ్య పరిశ్రమ పూర్తికానపు డుండిన యనాగరికత యని తోఁచును.

సమస్తవస్తువు లాత్మసాక్షాత్కారమే గనుక సౌందర్యమన్న వికారమన్న, కుంటియన్న, సంపూర్తియన్న, ఘనమన్న, నీచ మన్నఁ మంచియన్న, చెడుగన్న, బాగన్న, యోగన్న సమత్వము మనకుఁ గలుగుచున్నది. ఇందు సహితము క్రోధము నిరాకరణ మసహ్య ముండదు. ఎందు కనగా సమస్తవస్తువులు తమకు సాధ్య మైనంతవరకుఁ దమ నియామకముల ననుసరించి, ప్రస్తుతపు సమస్త వస్తుసముదాయమునకు నంత్యఫలసమాప్తికై యతని సాక్షాత్కా రాభివృద్ధియం దెంతమట్టు కవసరమో యంత యీశ్వరసత్యత్వముల వెల్లడించుచున్నవని మనము తెలిసికొందుము. అసత్యమును సత్యము కాని యీయవిర్భావమునకు లోపల వెతుకుదుము. పైయాకార ములఁ జూచి భయపడక యతని వేషములకు లోపల సుందరమై పరి పూర్ణమై నిర్మలమై నిర్బాధితమై యున్న యీశ్వరుని బూజించె దము.

జీవసమత్వ మనగా నూతన యజ్ఞానము, నూతనయంధత్వము దృష్టిమాంద్యము, వర్ణనిర్మూలము కాదు. భేదములుండును. ఆవిర్భా వభేదములుండును. అసంపూర్ణ ప్రేమచే, క్రోధముచే, ననురాగాస హ్యములచే, నాకర్షణ నిరాకరణలచే దృష్టియావరింపఁబడినప్పటి కంటె నిప్పుడే యీభేదముల నెక్కువగా గ్రహింతుము. కాని భేద ములతోఁబాటు నంతర్వ్యాపియగుఁ బరిపూర్ణాఖండుని సదాగాంచె దము. మానుషదృష్టికి సమరసపరిపూర్ణమని తోఁచనీ యసంపూర్ణ మని తోఁచనీ ప్రతియావిర్భావమునకుఁగల దివ్యావశ్యకత యుక్త ప్రయోజనము మనకు స్ఫురించును. తెలియఁబడును. నమ్మించును.

తుదకు సమస్తసంభవముల సుఖదుఃఖముల జయాపజయ ముల ఖ్యాత్యపఖ్యాతుల నదుష్టదురాదృష్టముల సమముగాఁ జూ

తుము. సుఖదుఃఖముల నేకభావముతో నంగీకరింతుము. ఏలననగా సమస్తసంభవములలో సర్వకర్మాధిపతియొక్క కర్మఫలదాయకుని యొక్క యిచ్ఛగాంతుము. ఈశ్వరుని వైఖరి చూడఁగలము. ఆవిధమున నతఁడు విషయములందు జంతువులందు వస్తువులం దావిర్భవించుచున్నాఁడు. సమస్తవస్తువు లీదివ్యత్వమునకై పాటుపడుచున్నవి. ప్రీతి సుఖదుఃఖానుభవము, మనము గ్రహించి యొప్పుకొనవలసియున్న బ్రహ్మాండోద్దేశ్యము నెరవేర్చుట కావశ్యకమైన సోపానమగుచున్నది. తిరుగఁబడి, నిషేదించి, మొఱఁబెట్టుట పరిపక్వముకాని యజ్ఞానభావము. తిరుగుబాటు కొన్నివేళలవృద్ధికి నవసరమైయున్నది. కాని యది శైశవసంబంధి. పరిపక్వమైన జీవుఁడు నిషేధించఁడు. తెలిసికొనుటకుఁ బ్రయత్నించును. మొఱఁబెట్టఁడు. వృద్ధిచేసి పూర్తి చేయుటకు శ్రమపడును. తిరుగఁ బడఁడు. లోఁబడి నెరవేర్చును.

నిశ్చయముగా నీసమత్వము దీర్ఘప్రయత్నముచే నోర్పుగల యాత్మశిక్షచేఁదప్ప వేరువిధమునఁ గలుగదు. కామము బలవత్తరముగా నున్నంతవరకు కామము శ్రమచెంది స్థిమితమొందినప్పుడు తప్ప సమత్వము సంభవించదు. సమత్వమునకుఁ గాలము లేకపోలేదు. సర్వవిషయముల నోర్పుతో సహించి భరించుటయను కాలముతో మనము ప్రారభింతుము.దుఃఖమును తప్పించుకొని సుఖము కొఱకుఁ బరుగెత్తక యాదుఃఖము నంగీకరించి జయించుట మనము నేర్చుకొనవలెను. సమత్వాభ్యాస మందిది నిగ్రహసమయము. కాని యీసమత్వమునకుఁ దోడుగా నీశ్వరేచ్ఛకులోఁబడుటయనువ్యక్తికలిగిన బహుమంచిది. కష్టములలో సహితము జీవుఁడు జ్ఞాన వైరాగ్యములతోఁ బరిపూర్ణత్వమునకుఁ బాటుపడుచున్న యీశ్వర కరస్పర్శ కలిగియుండుట మంచిది. అది గాఢమైన మృదువగు నిగ్రహము. దేవునిపాత్రకు మిక్కిలి కఠినత్వమొసగు కేవలనాస్తిక సహనమునకంటెనిదిమంచిది. అది ప్రేమతోఁగూడినబలమిచ్చును. ఆనందముగా మారగల స్థిమిత మొసగును. ఈ కాలభాగమునకు ఫలమేమనగా

సమస్తకష్టముల విషయముల సహించుటకు జీవునకు బలము కలుగునే.

రెండవకాల భాగమందు మహాద్భుత నిస్పృహాత్వము నిష్పక్షపాత ముండును. ఇదే యుదాసీనత. అందు జీవునకు హెచ్చు తగ్గులుండవు. సంతోషాసక్తి దుఃఖబాధ లుండవు. సర్వసమత్వాభ్యాసమందిది వేదాంతభాగము. నిస్పృహయనగా ననుభవకర్మల త్యజించుటకాదు. ఆశాభంగమొందిన సంతృప్తి జెందిన కోరికయొక్కయు, సంకోచరూపము లనఁబడు, విసుకు, శ్రమ, యయిష్టతవల్ల గలిగిన నిస్పృహకాదు. ఇట్టి సంకోచములు పరిపక్వమొందని జీవునకుఁ దప్పక సంభవించును. వానివృద్ధికి సహాయపడవచ్చును కాని మనము ప్రయత్నించు పరిపూర్ణ మదికాదు. మనముకోరెడు నిస్పృహ నిష్పక్షపాత మనగా వస్తుసంపర్కముల కంటక లోఁబడక వాని నంగీకరించు నుదాసీనత యను జీవుని మహోన్నతపీఠము. ఈ కాల భాగమునకు ఫలము ప్రపంచకార్య సంబంధమైన చిన్నయలలకుఁ బెద్దతరంగములకుఁ జలింపని స్థిమితము.

మూఁడవకాల భాగమున జీవున కానందసహితమైన యేకత్వము ప్రారంభమగుచున్నది. అప్పుడు దివ్యానందానుభవముల చేఁ బ్రశాంతస్థిమితములు పూర్తి నొందుచున్నవి. ఈఘనమైన పరిపూర్ణత్వము వచ్చినతోడనే యీశ్వరునకు లొంగవలెనను నూతన వ్యక్తిచే నాయుదాశీనత మార్పుచెందుట మంచిది. కేవల త్యాగమే కాదు. దుఃఖరహిత మగుటచే నది యానందభరిత త్యాగము. మనకుఁ దెలియఁబడుచున్న యీశ్వరుని కేవల యిచ్ఛకేగాక, మనమానందముతో ననుభవించఁగల యా యిచ్ఛయందున్న దివ్యప్రేమకు లోఁబడుట. వేదాంత శాస్త్రజ్ఞులకు సమత్వమనగా జనులతో సంబంధములేని శక్తి, స్థిమితత్వము. కాని జీవుఁడుతన పరిపూర్ణత్వమందుస్వయంకృతమను నీస్థితినుండి తప్పించుకొని సర్వాంభర యుత్తమానంద సముద్రమందు నిమగ్న మగుచున్నాఁడు. మనము సమస్త విషయముల నానందభరిత సమత్వముతో గ్రహింతుము. కారణ

మేమనగా, సదా వస్తుతత్వమైన నచ్యుత ప్రేమానందస్పర్శ వాని యందు మనకుఁ దోచుచున్నది. ఈయుత్తమకాల భాగమునకు ఫలము జీవున కానందము. తెలుసుకొనుటకు శక్యముకాని దివ్యాశీర్వాద ద్వారమును దెరచుట.

ఈకామ వినాశము జీవసమత్వమట్టి పరిపూర్ణత్వమునకు రావలెనన్న మఱియొక విధానమావశ్యకము. మొదటిమెట్టు కొంత స్థిరపడిన తరువాత మన మవలంబించ వలసిన రెండవమెట్టు కర్మధియందహంకార వినాశము. ఫలములు ఫలాపేక్షలు కర్మాధిపతి కర్పించుటచే కోరికకు సంబంధించిన యహంకారము మనము విడుచుచున్నాము. కాని కర్తకుఁగల యహంకారము మనల విడువదు. కర్మకు మూలము మనమే నని, కర్మ మనవలనఁ బుట్టి నిర్ణయింపఁబడునని, కర్మచేయు వారము మనమే నని వ్యక్తియుండనే యుండును. ఎన్నుకొని నిర్ణయించు నది యింకను "నేన"నునదే. ఆధిక్యత నెరిగి బాధ్యత వహించునది యింకను "నేనను"నదే.

భిన్నత్వకారణ మగు నహంకారవ్యక్తిని తొలగించుటే యోగాభిప్రాయము. మనలో "నే"నను నహంకార మేమాత్రమైన నుండవలసిన యడల నది నామమాత్రావశిష్టమై యద్వితీయ జ్ఞానము నద్వితీయ స్థితిని బ్రతిఫలించుటకు విశుద్ధ స్థానమగు వ్యక్తితో మాత్ర ముండవలెను. బ్రహ్మాండ పురుషుని వ్యష్టికార్యమున కది యాధారమాత్రమై యుండవలెను.

అహంకారాచ్ఛాదనమును దొలగించునట్టి యీ శ్రేష్టమైన కర్మమార్గవిధానమందు వృద్ధిసోపానములు కలవు. కర్మఫల మెట్లీశ్వరుని జెందుచున్నదో యట్లే కర్మలుసహిత మతనివే యని మనము మొదట గ్రహించవలెను. మనకర్మల కతఁడు ప్రభువు. కర్మఫలములకు సహిత మతఁడే ప్రభువు. సాధకుఁడు కర్మలు తనవికావనుటే గాక మనవ్యష్టిస్వభావరూపమున వెల్లడగుచున్న నుత్తమస్థితినుండి

నిర్గమించుచున్నవని తెలుసుకొనుట రెండవది. కాని యిందొక ప్రమాదము కలదు. మన యహంకారమే యీశ్వరుఁడని పొరపడి యీశ్వరేచ్ఛకు లోఁబడుచున్నామను మిషతో మన యిచ్ఛను మనకోరికను తృప్తిచేయవచ్చును. కామోపభోగపరులము కావచ్చును. ఈసోపాన మారోహించుటకు ముందు సాధకుఁడు కామనిర్మూలనము సమస్తక్రియలందు జీవసమత్వము వృద్ధిజేసుకొనవలెను. లేక నీసోపానమందుఁ బనిచేయునప్పుడు తన స్వభావముయొక్క నిజతత్వమును విడువక యహంకారముయొక్క హీనకృత్యముల విషయమై జాగరూకత కలిగి యుండవలెను.

కాబట్టి తత్క్షణమే సాధకుఁడు "సాక్షి" యను పదవికై ముందుఁ బ్రయత్నము చేయవలెను. అతఁడు తనలో స్వభావకార్య నిర్వాహణశక్తిని గనిపెట్టి దాని కార్యవిధానమును దెలిసికొనవలెను. స్వభావము సత్వరజస్తమస్సులను ప్రకృతియొక్క త్రిగుణములచేఁ బనిచేయుచున్నదని గీత చెప్పుచున్నది. తనలో జరుగుచున్న సమస్తమునకుఁ దాదర్శియై యీగుణముల వ్యష్టిసమిష్టి కార్యమును విభజించుట నేర్చుకొనవలెను. ఆజ్ఞ నొసగువాఁడు తా నగుటచే రజస్తమోగుణంబుల రెంటిని సత్వమునకు లోఁబడున ట్లొనర్చుగా దివ్య స్వభావద్వారమునఁ బనిచేయుచున్న యుత్తమేచ్ఛకుఁ దన కర్మల తుది సమర్పణముచేయుటకు సంసిద్ధుఁడై యుండును. అట్టి దివ్యస్వభావమందు గొప్ప ప్రకాశము విపుల స్థిమితముతోఁ బనిచేయును. బంధవిముక్తిగాంచిన జీవుని కామరహితానందసహిత కర్మను చలనములేని తన సత్యముతోఁ బ్రజ్వలింపఁజేయును.

అప్పుడే చివరమెట్టు సాధ్యమగుచున్నది. ఆయంత్యసోపానమందు స్వభావము వేసుకున్న ముసుకు తెరువఁబడును. సర్వేశ్వరుని ముఖాముఖిని, కర్మల కర్మఫలములు నతని కర్పించి, సాధకుఁడు వ్యక్తితో నతని సాధనమై పనిచేయును. ఇక కర్మకు నాజ్ఞనిడక

దాని స్వీకరించి యనుసరించును. ఇక కర్మచేయక నిమిత్తమాత్రుఁడై కార్యకరణ మంగీకరించును. ఇక తన యూహల సంసిద్ధిని తన కామముల సంతృప్తిని గోరక, దివ్యజ్ఞాన దివ్యప్రేమ లనఁబడు దివ్యేచ్ఛకు లోఁబడి దాగి యందుఁబాల్గొను చున్నాఁడు.





# యోగసంకలనము.



పదియవ అధ్యాయము.



## స్వభావము—మూఁడుపద్ధతులు.



కర్మ స్వాతంత్ర్య మపేక్షించు జీవునకుఁ బ్రకృతి స్వభావకార్యమున కంటకుండుట యత్యావశ్యకము. స్వభావమునకు సరసముగా లోఁబడుట, స్వతసిద్ధములగు నుపకరణములకు సంపూర్ణముగాఁ బనియిచ్చుట యగును. కాని యది జీవునకు లక్ష్యార్థము కానేరదు. జీవుఁడు దేవునకు లోఁబడవలెను. తన స్వభావమును జయించి యుత్తమేచ్ఛకు (Supreme will) దానొక ప్రతినిధియై స్వతసిద్ధములగు నుపకరణములు పనిచేయుటకుఁ బ్రకృతిచే నిర్మింపఁబడిన శక్తిసంచయమును, యావరణపరిస్థితిని సమిష్టివ్యాపార మాధుర్యము నెట్లు వినియోగించవలెనో యతఁడు నిర్ణయించవలసియున్నది. కాని స్వభావము త న్నధిగమించి దాని ముఖ్యగుణములకుఁ గార్యపద్ధతుల కంటకుండుటచే స్వాధీనమగుచున్నది. లేకున్న వానికి మనమే లోఁబడుదుము. అప్పుడు స్వభావమునకుఁ బూర్తిగా వశమగుదుము.

ముఖ్యమగు నీమూఁడుపద్ధతులఁ బ్రాచీన హిందూపిమర్శకులు నిర్ణయించిరి. అవి దీర్ఘ గాఢమానసి కానుభవముపై నేర్పడినవి.

అనుభవశోధనలు లేనియడల స్పష్టముగా వానిని దెలుసుకొనఁజాలము. కాని కర్మమార్గమందున్న సాధకునకుఁ దన స్వభావమిశ్రితములను విభాగించి పరిశీలించుటకు సహాయపడుకొన్ని ధారాళమగు విషయముల సూచించవచ్చును. హిందూశాస్త్రములందు వీనికి సత్వగుణ, రజోగుణ తామసగుణములని పేర్లు. ఈవిభాగము మానసిక శాస్త్రమునకేగాక ప్రపంచమునందు సహితము గనుపించుచున్నది. సృష్టిలోని సమస్తవస్తువులందీగుణములు కలవు. ఈగుణముల సమ్మేళనముచేతనే సమస్తమేర్పడుచున్నది.

మానసికశాస్త్రములనుబట్టి చేతనములుకాని యచేతనములుకాని, సమస్తవస్తువుల యాకార మావరణ స్పర్శలకు వశమై యున్నది. స్వభావశక్తుల సమతూనికచే నేర్పడిన దని మనమనుకొనవలెను. జీవునికంటె వేరైన మనవ్యష్టిస్వరూప మాతూనికకంటె వేరుకాదు. ఆవరణ స్పర్శానుభవ విధానము త్రివిధము. మొదటిది ప్రత్యుత్తర ప్రతిక్రియ, యాత్మసంరక్షణ, నిధిధ్యాసలులేక యాయావరణ స్పర్శల ననుభవించుట. దీనినే తమస్సు మొద్దుతన మందురు. ఇతర విషయముచే దిద్దబడకున్న దానిఫలము నూతనసృష్టినూతన సమతూనిక యివ్వక స్వరూపనాశము తెచ్చుటే. ఈయశక్త తకుమూల మజ్ఞానము. గ్రహించలేకపోవుట, నడిపించలేకపోవుట.

రెండవది ప్రతిక్రియచేయకలదు. ఆవరణ స్పర్శములనదిమెదిరించి స్వాధీనము చేసుకొనుటకుఁ బ్రయత్నించఁగలదు. దీనిని రజస్సు, రాగము, కర్మమందురు. దానిఫలము పోరాట, మార్పు, నూతనసృష్టి, జయాపజయములు, సుఖదుఃఖము, లాశానిరాశలు. దానిస్వభావ మసంపూర్ణజ్ఞానము. అందువలన నదిపొరపాటు, ప్రమాదము, కామదుఃఖములఁ గలిగించును. మూఁడవది వ్యక్తితో నాత్మస్థిమితముతో నావరణ స్పర్శముల గ్రహించుచున్నది. అది గ్రహించి ప్రత్యుత్తర మిచ్చును. దానికి నిధిధ్యాసకలదు. అదిలొంగిపోదు.

దీనినే సత్వము ప్రకాశము మంచి యందురు. దానిఫలము సుఖము సమరసము. ప్రేమానురాగములవంటి జ్ఞాననిర్మలతే దాని స్వభావము. నిర్జీవ సర్గమం దీగుణములు జడములై తదంతర్గతమైన మానసికఫలముల వెలిఁబుచ్చక, తమోవినాశరూపమున, శక్తిప్రతిక్రియ సృష్టిరూపమునఁ బ్రకాశత స్థిమిత సమరసరూపమునఁ బనిచేయుచున్నవి. మానసిక పురుషునకవి మానసిక విలువల వెలిబుచ్చుచున్నవి.

ఈగుణములలోఁ బ్రత్యేకముగా నొకదానిచే నిర్మింపఁబడిన వస్తువ సృష్టిలోఁ గనుపించదు. ఈత్రిగుణములు ప్రతిస్థితియందుఁ గలసి వర్తించుచున్నవి. ఒకదాని నొకటి వశము చేసుకొనవలెనని ప్రయత్నించుచున్నవి. ప్రతిదానియందు సత్వసంబంధమైన తెలివి, నిర్మలత, సుఖము, స్థిమిత మావరణయం దనురాగము; రజోగుణ సంబంధమైన కోరిక, యాశ, పోరు, సుఖదుఃఖములు, పని, యావరణతో క్రియాప్రతిక్రియలు; తమోగుణసంబంధమైన, నిరుత్సాహ మజ్ఞానమశక్తత, యనామధేయత్వ మావరణనుండి వైదొలగుట, దానికి లోఁబడుట యనువిషయములు కలవు. ఎల్లప్పు డిట్లుండక కొన్నిపనులందు సత్వమే కాన్పించును. మఱికొన్నిటియందు రాజసమే యుండును. ఈత్రిగుణములలో నేది హెచ్చుగా మనోకర్మలందుఁ గాన్పించునో దాని ననుసరించి, యితఁడు సాత్వికుఁడని, యితఁడు రాజసుఁ డని యితఁడు తామసుఁ డని యందురు.

మనుజుఁడు తన్ను స్వయముగా విమర్శించుకొని యీత్రిగుణవిలాసమును దనలోఁ గనిపెట్టిన పక్షమునఁ గర్మలు తానుచేయుచున్నాఁడనుకొనుట యెంత పొరపాటో తెలుసుకొనకపోఁడు. తన పద్ధతుల ననుసరించి యింతవరకుఁ బనిచేయునది స్వభావమే. అనగా స్వభావముయొక్క యీత్రిగుణములు వాని ప్రత్యేక సమ్మేళనానుసారముగాఁ బనిచేయుచున్నవి. అహంకారజీవుఁడు వానివశమై యున్నాఁడు. వానిచేతిలో బొమ్మ. అతని మానసికశక్తులు, నీతులు, క్రోధశాంతములు, క్రూరత్వదాక్షిణ్యములు, ప్రేమాసహ్యములు,

పాపపుణ్యములు, వ్యక్త్యంధత్వములు, సుఖదుఃఖములాత్రిగుణవిలాసములే. జీవుఁడు వానిచే నాకర్షింపఁబడి, జయింపఁబడి, లోఁబడి, తనయొప్పుదల నొసఁగుచున్నాఁడు. కాని జీవునకు జడమందుఁ గొంత స్వాతంత్ర్యముకలదు. జీవుఁడు తనయంతరేచ్ఛచే, ప్రత్యేక క్రియాప్రేరేపణలు స్వభావజన్యములేయైనను, మొత్తముమీద విలాస సమ్మేళనముల నిర్ణయించి యనుజ్ఞ నిచ్చు ప్రభువగుటకుఁ బ్రయత్నించఁ గలఁడు. సమరసము నిర్ణయించి స్వభావముచేఁ బనిచేయించఁ బ్రయత్నించఁగలఁడు. కాని యితరగుణములఁ బారఁదోలి సత్వగుణమును వృద్ధిచేయుటే మంచిమార్గమని తోఁచుచున్నది.

కాని యిందొక చిక్కుకలదు. ఈగుణములలో నొకటి స్వయముగాఁ దక్కిన రెంటిని జయింపఁజాలదు. క్షోభ బాధ పాపదుఃఖములకు మూలమని రజోగుణమును త్యజించితిమా రజోగుణ మణగును. కాని తమస్సు లేచును. చురుకుతనము మందగించిన దాని స్థానమందు బండతనము ప్రవేశించును. అప్పుడు మంచి, నెమ్మది, సుఖము, జ్ఞానము, ప్రేమ, వ్యక్తి యుండవచ్చును. కాని జీవునియందా నెమ్మది నిష్క్రియారూపమగు స్థిమితముగా మారఁ బ్రారంభించును. మనుజుఁడు సత్వతామసుఁడగు చున్నాఁడు. మానసనీతి శూన్యత్వము నశించును. అట్లే తీవ్రక్రియాప్రేరేపణలు సహితము నశించును. ఇది మఱియొకవిధమైన యశక్తత, చిక్కుఁబెట్టు ప్రతిబంధకము. తమస్సు ద్విస్వభావము కలది. నిష్క్రియత్వముచే రజోగుణమునకుఁ బ్రతిబంధకమగుచున్నది. ధారాళశూన్యత్వానామధేయత్వములచే సత్వమునకుఁ బ్రతిబంధకమగుచున్నది. సత్వరజోగుణములలో నేదితగ్గిన దాని స్థానమందిది ప్రవేశించుచున్నది.

ఈలోపము పోగొట్టుటకు తిరిగి రజోగుణము రావలెను. సత్వముతోఁ జేరి తమోగుణము నణచవలెను. అప్పుడు మనక్రియ హెచ్చుస్థితికివచ్చును గాని రజోగుణసంబంధమైన యాతురత, కోపము, నిరాశ క్రోధము దుఃఖములకు లోఁబడుదుము. ఇవి మునుపటి కంటె మంచిస్థితికి మారినను మనకు కావలసిన నెమ్మది స్వాతంత్ర్య

ము శక్తి యాత్మాధికార మిదికాదు. ఎచ్చట నహంకారకామములు చేరుచున్నవో యచ్చట నీరాగములు చేరుచున్నవి. లేక సత్వాధిపత్యముక్రింద నీత్రిగుణములకు సంధిఁజేయఁ బ్రయత్నించితిమా స్వభావ విలాసకార్యమునకు తీవ్రతమాత్రముతగ్గింతుము. మన మొక క్రొత్తస్థిమితము సంపాదింతుము. కాని మనము స్వతంత్రాధికారము పొందలేదు.

పూర్తిగా మఱియొక విధానము కావలెను. జీవుఁడు వేని ధర్మములకు లోఁబడి, వేని కార్యములలోఁ జిక్కుకొనుచున్నాఁడో యాత్రిగుణముల కృత్య మంగీకరించుట యను పొరపాటు విడువవలెను. రజస్తమో గుణములనేగాక సత్వమును కూడ దాటవలెను. ఇనుప గొలుసునేగాక బంగారు గొలుసునుకూడ త్రెంపవలెను. కాబట్టి గీతమఱియొక యాత్మశిక్షావిధానము నిర్ణయించుచున్నది. తనలోఁ ద్రిగుణములకు వెలియై వాని కల్లోలములకుపరిద్రష్టనలె నిష్పక్షపాత నిస్పృహాతోఁ గనిపెట్టమనుచున్నది.ఆగుణతరంగములు లేచి పడునప్పుడు వానిఁగనిపెట్టి విమర్శించవలెను గాని వాని నంగీకరించి సంబంధము పెట్టుకొనరాదు.

ఈవిధానమునకు మొదటి యుపయోగము మనుజుఁడు తన్నుఁ దెలిసికొనుటకు నహంకారమును బూర్తిగావదలి యాత్రిగుణముల విలాసమును జూచుటకుఁ బ్రారంభించును. అది మోసముతో నిండియున్నందున, సమస్తకార్యము త్రిగుణముల పరస్పరకార్యమని గ్రహించి, వాని సమస్తవిధానముల నెరిగి వాని దాడికి వశముగాక, వానివేషముల యుక్తులఁ దెలసికొనుటకుఁ బ్రారంభించును. ఈవిధానమునకు రెండవ ప్రయోజనమా త్రిగుణముల పరస్పరకార్యముచే నేర్పడినబంధమే యహంకారమని తెలిసికొనుట. యాచకులకు ఋషులకునుండు సాత్వికాహంకారమునుండి తప్పించుకొందుము. స్వాపేక్షులు కోరికలతోనిండిన యాత్మపరాయణుని రాజసాహంకారమునుండి తప్పించుకొందుము. ఈవిధానమునకు

మూఁడవప్రయోజన మీసమస్తకార్య మందున్న ముఖ్యమైన యహంకారమును గ్రహించి యాత్మముక్తి యాత్మనిగ్రహసాధనములకొఱకు నే ననునహంకారమందు వెతుకక పవిత్రుఁడు స్వతంత్రుఁడు ప్రభువైన యధికారికొఱకు స్వభావకార్యసాధనముల వెలిని పరిశోధింతుము.

ఈవైతొలగుటవలనఁ గలిగెడు వృద్ధియందు మొదట మన మీత్రిగుణముల మించెదము. హీనస్వభావమునుండి జీవుఁడు విముక్తుఁడై వెలిగాను పరిస్థితుఁడగును. స్వభావము పనిచేయుచునే యుండును. కామసుఖదుఃఖములు హృదయమును పీడించుచునే యుండును. ఉపకరణములు శ్రమచెంది నిష్క్రియత్వ మొందుచునే యుండును. శాంతప్రకాశములు హృదయమానసములఁ పునః ప్రవేశ మొందుచునే యుండును. కాని జీవుఁడు మార్పుచెందక, నీమార్పులకంటక, హీన విషయములకుఁ గామదుఃఖములకు వశముగాక, వానిఁ గనిపెట్టును. వానిప్రయత్నముల వాని సంతోషములఁ జూచి నవ్వుచూ మనో సంకోచమునకుఁ గాని శరీర నాడీహృదయము బలహీనతకుఁ గాని వశముకాఁడు. సంతోషము కలిగెనని సంతోషించఁడు. ఈవిషయములలోఁ జోరఁబడఁడు. ఈస్వేచ్ఛాభావములఁ దెలిసికొనుటకు నిస్సంగిమై కాచియుండును. అట్లొనర్చుచు చివర కీత్రిగుణముల పోరాటకు వెలియగుచున్నాఁడు. అతని హీనస్వభావముపైనుండి బాధింపఁబడుచున్నది. అతని యలవాట్లంగీకార శూన్యము లైకలుచు సంభవించుటమాని యఱుదగుచున్నవి. ఇంతకంటె యెక్కువైన మంచి కర్మకు స్థితికిఁ దా నిర్ణయింపఁబడె నని తెలుసుకొనుచున్నాఁడు. క్రమముగా నిష్టములేకనే లోఁబడి, మార్పునకు సిద్ధపడుచున్నాఁడు.

జడములేక స్థూలము స్వభావసిద్ధముగాఁ దమోగుణప్రధానము. ప్రాణనాడీశక్తులు రజోగుణప్రధానము. మానసముసత్వగుణప్రధానము. ఈత్రివిధోపకరణములద్వారా యీత్రిగుణములు కలిసి పనిచేయుచు కల్లోలము తెచ్చుచున్నవి. ఇప్పటి సాధారణమానుషస్థితియదే. కాన మఱియొకకార్యమునకు వీలుకలదు. ఈకార్యము

మన యిప్పటి యసంపూర్ణస్వభావమున కధిదైవికముగాఁ దోఁచినను బ్రకృతి పురుషుల గాఢసంబంధములకు స్వతసిద్ధమై తగినదై స్వభావసిద్ధమై కాన్పించును. శరీరము కర్తృత్వశూన్యమైన సాధనము కావలెను. కాని యది వివిధతీవ్రానుభవముల ననుభవించుటకు సామర్థ్యము కలిగియుండవలెను. నాడీరాగములు శ్రమలేని కార్యకరణసామర్థ్యము ననుభవసామర్థ్యమును గలిగియుండవలెను. కాని ప్రశాంతస్థిమితములు కలిగి, కామవశముచేఁ దొందరకు సోమరితనమునకు లోఁబడి బండబాఱక యుండవలెను. అజ్ఞానము మనోనిర్మితము కాఁకూడదు. సృష్టిముఖమై యున్నశక్తియొక్క బలమునుండి తప్పించుకొనుటవల్లఁ గలిగిన శమనము సహితము కాఁగూడదు. ఈ మూఁడుపకరణములు (అనగా స్థూలప్రాణమానసములు) తమలో లేక తమకంటె భిన్నమైన దానినుండి నిర్గమించు గొప్ప శక్త్యానందజ్ఞానముల కనుగుణ్యమైన సాధనములు కావలెను.

అట్టి స్థితేయీశ్వరసంబంధియగుఁ బరిపూర్ణమందుఁ బ్రకృతియొక్క త్రిగుణసమ్మేళన సమత్వ మనఁబడును. అచ్చట నప్రసిద్ధమైన నిష్క్రియత్వముండదు. తమస్సునకు మారుగా దివ్యప్రశాంతస్థిమితములు వచ్చును. అట్టి ప్రశాంతస్థిమితములనుండి కర్మజ్ఞానవిలాసము సముత్తమ యేకాగ్రతనుండి వెలువడినట్లు ప్రభవించును. అచ్చట కామములేదు. క్రియాప్రయత్నము, నిర్మాణప్రయత్నము వశీకరణప్రయత్నములుండవు. శాంతమునకు భంగము చేయఁజాలనట్టియు స్థిమితమును గదలింపఁ జాలనట్టియు, స్వకీయకార్యకరణశక్తి రజస్సునకుమారుగావచ్చును. మనోనిర్మిత మచ్చట లేనందున నచ్చటి ప్రకాశశాంతము లపాయకరములు క్రియాశూన్యములు కానేరవు. సత్వమునకు మారుగా విపులప్రకాశత్వము పూర్ణానందము రాఁగలవు. ఆప్రకాశానందములు జీవుని యనంత గాంభీర్యములకు సరిపోలినవై యాజీవుని వివిధత్వములందు గాఢస్థిమిత తీవ్రక్రియల రెంటిని కలిగియుండును.

ఈయుత్తమ సమరసత్వ మహంకారముతోఁ గూడుకొన్న యెన్నిక, క్రియలు నశించుటచేఁ గలుగుచున్నది. వ్యష్టియహంకారము ప్రయత్నించదు. ఎన్నుకొనదు. క్రియనారంభించదు. దాని స్థానమందు మనసమస్తకార్యములకు నిజమైన ప్రభువు తన దివ్యేచ్ఛాజ్ఞానానుసారముగఁ బవిత్రమైన స్వభావమున కనుజ్ఞనొసగును. వ్యష్టిపురుషస్థానము సేవకుఁ డగుచున్నది. ఈశ్వరచిదానందశక్తులఁ బ్రతిఫలింపఁజేసి వానియందుఁ బాలుకొనుచున్నది. కర్మచేయుచున్నను గర్మచేయదు. ప్రతిఫలము దానినంటదు. ఇదే కర్మయోగపరిపూర్ణత్వము. దీనికొఱకే త్రిగుణముల నిర్జించుట యభ్యసింపఁబడుచున్నది. ముఖ్యకార్యముగా నెన్నఁబడుచున్నది.



## స్వభావము-మూఁడుపద్ధతులు.



# యోగసంకలనము.



పదకొండవ అధ్యాయము.



## కర్మాధిపతి.



కర్తృత్వాహంకారము మనము త్యజించినప్పుడు, త్యాగము పూర్ణమైన కొలది, కర్మాధిపతి తనంతటఁ దావెల్లడగుచున్నాఁడు. ఆత్యాగమనంతమైనప్పు డతని యనంతమందు నిలిచి యీశ్వరేచ్ఛకు మనక్రియలఁ బూర్తిగా వశము జేతుము. ఇతర పరిపూర్ణత్వమునకు న్నట్లీపరిపూర్ణత్వమునకు సహితము మెట్లున్నవి. మనకాకస్మికముగాఁ బూర్ణప్రకాశము ప్రత్యక్షముకావచ్చును. కాని పునాది స్థిరపడకున్న నది యొకయేకాగ్రతనొందిన దృష్టియై నమ్మఁగనిదై యుండును. తరువాత దానియందున్న ననంతవివిధత్వములు క్రమముగా దృగ్గోచరమవును. ఉత్తమ శిఖరమందు నిశ్చలదృష్టి నిలిచియున్నను సమస్తహీనావయవములు క్రమముగా గాని తెలిసికొని పూర్ణమైనఁ బ్రత్యుత్తర మీయఁజాలవు. సమస్తయోగములందు నమ్మకము యోర్పు యుండవలెను. హృదయతీవ్రత, చిత్తప్రాబల్యము మోక్షమునప్రయత్నముగాఁ బొందగోరునుగాని శాంతమైన నీస్వల్పోపకరణముల సహాయమందకున్న విషాదకరమగుఁ బ్రతిక్రియలకు వశమవును.

హృదయమానసముల స్వభావజన్యమైన నాతురత, బుద్ధియొక్క ప్రమాదముతోఁగూడిన నమ్మకము రజోగుణసంబంధమైనవి. కాబట్టి సమస్తయోగాభ్యాసములం దీపైనఁ జెప్పఁబడిన విషయము ను గురించి గట్టిగాఁ జెప్పవలసియున్నది. మనుజుఁడు తన శ్రమకు ప్రతిఫలము గోరుచున్నాఁడు. ఫలప్రాప్తి రాకున్నను, కాలహరణమైనను, లక్ష్యార్థమందునమ్మకము వదలుచున్నాఁడు. వాఁడు ప్రస్తుతఫలమును బట్టి యోచించుచున్నాఁడు. బుద్ధివిమర్శనయందే యతనికిఁ బూర్తిగా నమ్మకము. తాను బొరపడినప్పుడు దైవమును నిందించి యిట్లనుట యతనికి సులభము. "నేను దేవుని నమ్మితిని. పాపప్రమాదములలోఁ బడిపోతిని. కేవల యనుభవనిరుద్ధమయిన లక్ష్యార్థమున జీవితమంతఁ గడిపితిని. తమబంధముల విడువక సాధారణానుభవములతోఁ గాలము గడుపు నందఱివలె నేనున్న మంచిదవునే." అట్టి సమయమందు సమస్త యున్నతానుభవము మరువఁబడుచున్నది. జీవుఁడు తన దుఃఖమందే కాగ్రతఁ బొందుచున్నాఁడు. మనుజుఁడు మార్గము చిరకాలమభ్యసించినవాఁడయ్యే నేని, దాగియున్నప్పటికి, హృదయ నమ్మకము నిలుచును. అవకాశము దొరికినతోక్షణమే యానమ్మకము బైలుపడి బుద్ధిహృదయములకంటె శ్రేష్టమైనదానిచేఁ బడిపోకుండఁ బట్టుకోబడును. వానికి సహిత మిట్టిలోపములు వృద్ధికి విఘాతములై యున్నవి. ప్రారంభకునిమాట చెప్పవలెనా? వానికి మిక్కిలి ప్రమాదకరములు. మన మెన్నుకొనిన మార్గమునందుఁ గలకష్టమిది. నిజముగా బుద్ధికి నమ్మకము కలిగియుండుట మంచిది. బుద్ధికి మూర్ఖముగాఁ దోచినప్పటికి, బుద్ధిజ్ఞానమును మించిన యంతరప్రకాశము యొక్క శాంతాహ్లాదకరమైన ఛాయ యైాచున్నది. అది బాహ్యాకారములకు స్వాధీనముగాక దాగియున్న జ్ఞానము. పనిచేసినకొలది మననమ్మకము తన వ్యాపారములు సరియైన వనిపించుకొనుచున్నది. ఆనమ్మకమే జ్ఞానముయొక్క యాభాసగా మాఱుచున్నది. గనుక మనమెల్లప్పుడు "నిరుత్సాహములేని హృదయముతో సదా యోగ మభ్యసించవలె"నను గీతా

విధిని మన మవలంబింపవలెను. "విచారింపకుము. నేను నిశ్చయము గా సమస్త కష్టములఁ దొలగింతు"నను ప్రభువిచ్చిన వాగ్దానము సంశయించు బుద్ధికి జ్ఞాపకముచేయుచుండవలెను.

కర్మాధిపతి మన స్వభావమును మార్చునప్పుడు సహితము దానిని నిరాకరించుటలేదని మనము జ్ఞాపకముంచుకొనవలెను. అతఁడు మనస్వభావముద్వారా పనిచేయుచున్నాఁడు. కాని క్రమము తప్పి పనిచేయఁడు. అసంపూర్ణమైన మనస్వభావము పరిపూర్ణత్వము నకుఁ దగిన విషయములఁ గలిగియున్నది. కాబట్టి దానినోర్పుతోఁ దయారుచేసి, పునర్నిర్మాణ మొనరించి, నూతనరూప మిచ్చి మార్చవలెను గాని ఖండించి నరికి పాడుచేయకూడదు. నీతప్పులలో సత్య మిమిడియున్నది. అసత్యము వెల్లడియగుటకుఁ బ్రయత్నించు చున్నది. మానుషవివేక మాతప్పుల ఖండించుచున్నది. దానితోఁ బాటు సత్యమునుకూడ ఖండించుచున్నది. తప్పులు తమ నిజతత్త్వముఁ దెలిసికొనువరకు దైవమాతప్పుల నుండనిచ్చును. మనపాపము లన్నియుఁ బాప మొనర్చుట కిచ్చగింపకఁ, బరిపూర్ణత్వమునకై ప్రయత్నించు నొకదాని యొక్క యసత్యసోపానములు. అవి వికారవేషములనుండి విముక్తి నొందింపఁబడి మార్చఁబడవలసిన గుణము యొక్క ముసుకేగాని నిరాకరింపఁ బడవలసినవి కావు. అట్లుగాకున్న సర్వజ్ఞుఁడైన యీశ్వరుఁడు వీనికిఁ దావివ్వకపోవును. మన కర్మాధిపతి పొరపడువాఁడు కాఁడు. అశ్రద్ధకలవాఁడు కాఁడు. అనవసరములైన గష్టములఁ దెచ్చిపెట్టి యానందించువాఁడు కాఁడు. మనతార్కిక వివేకములకంటె నెక్కువ వివేకము కలవాఁడు. మనధర్మముకంటె యెక్కువ వివేకముగలవాఁడు. మనము పరాజయముగాంచితిమా నిజమైన దారి యేర్పడుటకై పరాజయ మతఁడు సంకల్పించును. మనము కష్టములఁ జెందితిమా యసాధారణమైన యానందానుభవమునకు మనల నర్హులఁజేయుటకే. మనము బోర్లపడితిమా బాగుగా నడచుట మనకు నేర్పుటకే. శాంతపవిత్రపరిపూర్ణత్వముల నొందుటకుసహితము మిక్కిలి తొందర పడకూడదు. శాంతము మనకుం

డవలసినదే. శాంతమనగాఁ దీవ్రత సాధ్యము కానందున స్థిమితము కూడ సాధ్యములేక చెడిపోయిన స్వభావసామర్థ్యములయొక్క శాంతమదికాదు. పవిత్రత మనకుండవలెను. శూన్యముతోఁగూడిన పవిత్రతకాదు. పరిపూర్ణత్వము మనకుండవలెను. హీనబంధములలోఁ జిక్కుకొనుటవలన గలిగెడి పరిపూర్ణత్వముకాదు.

అసంపూర్ణమైన నీస్వభావమహంకార యుతమైయున్నది. కర్మలఁ జేయుచు నహంకారమును దొలగించుటకంటె కష్టమైనపని వేరులేదు. పనికిఁ బురికొలుపు ప్రేరేపణను జంపి, యహంకారమును జయించుట సులభమే. దానినీశ్వర ప్రేమజనితానందమందు ముంచి తన్ను మరచునట్లుచేయుటకూడ సులభతరమే. కాని యీశ్వరకార్యమునకుఁ బవిత్రమైన సాధన మనఁబడు దివ్యమానుషత్వ మొందుట బహుకష్టము. ఒకమెట్టుతరువాత నొకమెట్టు స్థిరపరుపవలెను. ఒకకష్టమునకుఁ దరువాత మఱియొక కష్టమును బూర్తిగా ననుభవించి పూర్తిగా స్వాధీనపరుచుకొనవలెను.

మనలోఁ బ్రపంచములోనున్న నీశ్వరునకు మన సమస్తకర్మలబలిగా సమర్పించుట మొదటి సోపానమని తెలిసికొంటిమి. మన కర్మల ఫలాపేక్షలత్యజించుట రెండవసోపానము. సమర్పణకుఁ గోరదగినఫల మీశ్వరుఁడే. అతఁడుదొరికిన సమస్తము దొరుకును. కర్తృత్వాహంకార త్యాగము మూఁడవ సోపానము. ఈమూఁడవ సోపానమందు సహితము కష్టసాధ్యమైన సమర్పణమునకు వివిధ మెట్లుకలవు.

మనము కర్తలమను భావమువిడుచుట సాధనమని గ్రహించుట మొదటిపని. అప్పటికి యహంకారబంధము విడుచునదికాదు. కర్తృత్వమందుఁగల యహంకారమును తగ్గించినను, బూర్తిగాఁ దృజించినను దానికి మారుగా సాధనముయొక్క యహంకారము వచ్చుచున్నది. ప్రపంచచారిత్రి మిట్టి యహంకారముయొక్క యుదాహరణములతోఁ నిండియున్నది. అట్టిమనుజుఁడు ప్రజలకు నాయ

కుండగుచున్నాఁడు. అగాధమై విచిత్రమై తనలోలేదని తనకుఁ దెలిసినట్టి గొప్పశక్తి తనయందుఁ బ్రవేశించెనని నమ్ముచున్నాఁడు. తన కార్యములకు గొప్పఫలములఁ గాంచుచున్నాఁడు. మానవులకు దారి యేర్పరుచుటకై విపరీతమైన నాశనముఁజేయుచున్నాఁడు. లేదా తాత్కాలిక శాంతిదాయకమైన నిర్మాణమును జేయుచున్నాఁడు. అతఁడు శుభ్రపరుచువాఁడో, ప్రకాశత దెచ్చువాఁడో యగుచున్నాడు. లేదా కార్యములు తత్ఫలములు స్వల్పములై యుండవచ్చును. వానికి వీలు కర్మస్థానము తగ్గియుండవచ్చును. కాని సాధనమునశక్తి యుండకతప్పదు. అట్టివారు తాము దేవుని యుపకరణములని సులభముగానమ్మి ప్రకటింప సాహసింతురు. అట్టి ప్రకటనయందు విశేషతీవ్రమగు నహంకారము సాధారణజనులు భరించుదానికంటె నెక్కువయున్నటులఁ గనుపించకపోదు. వారు దేవునివిషయమై ప్రసంగించినప్పుడు దేవుని విగ్రహనిర్మాణముచేయఁ బ్రయత్నింతురు కాని నిజమునకది వారి భావస్వభావకార్యముల ఛాయ. ఈయధిపతిని వారు సేవింతురు.

వారు భ్రమతోఁగూడిన పిచ్చివారుకారు. వారు సాధారణజనులకంటె యెక్కువతత్వము గ్రహించినవారు. వారిజీవులు మతియొక్క మెట్టుపైకెక్కినవి. కాని వారికి ప్రత్యక్షములేదు. కాబట్టి వారు నిజమైన కేవల యీశ్వరోపకరణములు కాలేదు. ప్రభుసాక్షాత్కారమొందలేదు. వారి యసంపూర్ణ స్వభావానుగుణ్యముగ నుపయోగింపఁబడుచున్నారు. వారు చూడనేత్రములేని యట్టి ముసుకులోనుండే యీశ్వరుని జూచుచున్నారు. ఒక శాఖకో, జాతికో యీశ్వరవిగ్రహమును నిర్మించుచున్నారు. శిక్షించు భయంకరుఁడైన దేవునిగాని దయామయుఁడైన దేవునిగాని నిర్మించుచున్నారు. ఈశ్వరుఁడీవిగ్రహము నంగీకరించి తద్వారముననుఁ బనిచేయుచున్నాఁడు. వారి పరిపక్వములుకాని స్వభావముల ననుసరించే నితరులకన్న నెక్కువ తీవ్రముగా నీశ్వరుఁడు పనిచేయును గనుక వారియందు ప్రేరేపణాశక్తియైన యీయహంకారము సహితమితరులకంటె యె

క్కువ తీవ్రముగానే యుండును. నిజమునకు వారు సేవకులుగాని యుపకరణములనఁబడరు. ఏదో యొక దివ్యగుణముయొక్క సేవకులు గాని పరిపూర్ణ దేవత్వముయొక్క సేవకులనఁబడరు.

అట్టి యుదాహరణములఁ జూచి యాశక్తిని మనము తెచ్చు కొనుటకు ప్రయత్నించవలెను. కాని నిర్మలమగు హెచ్చు జ్ఞానము మనకు కలుగవలెను. ఉపకరణములోని కెట్టి యహంకారము రాని వ్వకూడదు. తెలియుచునో తెలియఁబడకుండనో ప్రతిమనుజుఁ డీశ్వ రున కుపకరణమే యనియు నొకవిధమైన కర్మకు మఱియొక విధ మైన కర్మకుఁ దారతమ్యములేదనియు, నొకయుపకరణమునకు మఱి యొక యుపకరణమునకు నహంకారము కలిగించుభేదము లేదనియు మనస్సునం దుంచుకొనవలెను. జ్ఞానాజ్ఞానములకుఁ గల భేదముసహి త మీశ్వరానుగ్రహమే. ఆయీశ్వరశక్తి యీరోజున నొకని రేపు మఱియొకని పూరించుచు శ్రద్ధకలచోటఁ జేరుచున్నది. ఆధిక్యత మనదికాదు. ప్రస్తుతము మనలోఁ గనుపించు నాధిక్యత సహిత మీ శ్వరుఁ డెన్నుకొనుటవల్లఁ గలిగినదే. మనప్రయత్నాధిక్యతనుగూంచి విర్రవీగుట తెలివిమాలినపని. ఆప్రయత్నము సహిత మీశ్వరుఁ డెన్నుకొనుటచేఁ గలిగిన ఫలమే. కుమ్మరివాఁ డొకపాత్రను మఱి యొకదానికంటె బాగుగఁ జేసినప్పు డాయాధిక్యత కుంభకారునిది కాని పాత్రదికాదు. "ఇది నాశక్తి నాయందు దేవుని శక్తిజూఁడుడ"ను భావము మనస్సునందుండరాదు. "సమస్త మానవులందు, జంతువు లందు, లతాగుల్మములందు, లోహములం దెట్లు దేవునిశక్తి పనిచేయు చున్నదో యట్లే యీశరీరమానసములందుఁ బనిచేయుచున్నది." యను భావముండవలెను. సమస్తమం దొక్కఁడే పనిచేయుచున్నాఁ డనియు నాత్మవ్యక్తీకరణమను నీశ్వరకార్యమునకు సమస్త ప్రపంచ ము సమానసాధన మనియు భావించుటవలన నుపకరణమందలి రాజ సాహంకారము మనల విడుచుచున్నది.

రెండవపని యేదనగా, మనస్వభావముద్వారా మనస్వభావ మునసుసరించి యీశ్వరుఁడు పనిచేయు నని మనము జ్ఞాపకముంచు

కొనవలెను. మనస్వభావ మసంపూర్తిగా యున్నయెడల కర్మసహిత మసంపూర్తిగాఁ బ్రిమాదభరితముగానుండు నని, యప్పుడు సహిత మది మనయం దీశ్వరకార్యము కాకపోదని తలచవలెను. సదా యభ్యసించినయెడల నీభావము కామగర్వాతురతలఁ గలిగించు రాజ సాహంకారమునకు, నిరుత్సాహదాయకమైన దామ సాహంకారము నకు మనలలోను కానివ్వదు. స్వభావము త్రిగుణముల ద్వారముననే పనిచేయుచున్న దను జ్ఞానమువలన మన కిచ్చుట యధికయుపయో గముకలను. ఆధిక్యత, శక్తి, పాపము, బలహీనత మనయందిక నారో పించుకొనము. "గుణములు గుణములందుఁ బనిచేయుచున్నవి" యను గీతావాక్యము వక్కాణింతుము. శాంతులమై, నిర్వాణితులమై, నిస్సంగులమై, కర్తృత్వ రాహిత్య తదేక నిష్టపరిపూర్ణత్వములుగల యంగీకారముచే, మనలోపముల సవరించి మనకర్మల పవిత్రిము చేయనెంచిన యీశ్వరుఁడు మనపైఁ బెట్టుచున్న యొత్తిడికి సహాయ పడుచున్నాము.

మూఁడవపని యేదనగా, స్వభావ మను నీముసుకు తొలగిం చి కర్మలకు వెలియందుఁ దునకు సమస్తకర్మలందు సాధనము యొక్క ప్రిభువునుగాంతుము. "నాహృదయమం దున్న నోహృషీ కేశా! నీచే నియమింపఁబడి యావిధముగాఁ బనిచేయుచున్నా" నని సంస్కృత శ్లోకము. ఈకర్మ రెండువిధములైనది. (1) మన స్వభా వముయొక్కకర్మ, దీనియందు మన మొక యంత్రిముపై నెక్కింపఁ బడి స్వభావముచే నహంకార జనిత భ్రిమచేఁ ద్రిప్పఁబడుచున్నట్లు పనిచేతుము. (2) భ్రిమ లన్నియుఁ దొలగింపఁబడి యాదిమదివ్యశక్తి కెదుట నప్రియత్నముగాఁ గర్మయొనర్తుము. అప్పుడు మన యుద్దే శ్యము దాని యుద్దేశ్యమే. మన యిచ్ఛ దానియిచ్ఛే. అది యనగా శక్తియం దావిర్భవించిన యధికారే యని మనకుఁ దోఁచఁగలదు. శరీరమానసములు దాని కార్యములే నని మనకు దెలియఁగలదు. ఇక స్వభావముగాని గుణములుగాని మనకుఁ గనుపించవు. కాని నర ములందు, మానసవిషయములందు, శరీరమానసములకు వెలియై

వానిని నడిపించుశక్తి స్థూలరూపమున మనకు వ్యక్తముకాఁగలదు. మనము తిరుగుచున్నాము, యోచించుచున్నా మనుభవించుచున్నా మను వ్యక్తి మన కికనుండదు. కాని యాశక్తి మనలో చలించుచున్నది, యోచించుచున్నది, యనుభవించుచున్నదను వ్యక్తి పుట్టును. మనము వ్యక్తమగుచున్న యీశక్తి బ్రహ్మాండశక్తి యనఁబడును. ఈశక్తిమాత్రమే సృష్టియందున్నది. పనిచేయుచున్నదని పదార్థ విజ్ఞానశాస్త్రములు వేదాంతశాస్త్రములు చెప్పుచున్నవి.

ఈశక్తి దేవునిశక్తి స్వరూపమనఁబడును. క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, ప్రేమశక్తి. తనకంటె వేరుకాని యీశక్తిని స్వాధీనముచేసుకొని యందు నివసించి తన్మూలకమున సమస్తస్థితుల సంభవముల నొనర్చునట్టి యధిపతి, సమస్తవస్తువులందు, మనయందితరులందు వ్యక్తమగుచున్నాఁడు. ఈవిధమున కర్మలద్వారా యీశ్వరునితో నైక్యమొందుచున్నాము. స్వచ్ఛమైన భక్తిజ్ఞానములచేత నాయైక్యమునే పొందఁగలము.

కర్మాధిపతిని మనముగాంచినప్పుడు నాలుగువిధముల మనమతని దెలిసికొందుము. (1) స్వయంప్రకాశుఁడు—సమస్తస్వభావాతీతుఁడై యొకఁడుండి, ప్రపంచస్వభావముల స్వాధీనముచేసుకొని, యింక నవి కానట్టి వేరువస్తువుగా మార్చుచున్నాఁడని తెలిసికొందుము. (2) తత్తుల్యమైన నిష్క్రియుఁడైన బ్రహ్మము—స్వయంప్రకాశమైన నిచ్ఛచే బ్రహ్మాండమం దొప్పుకొనఁబడి నిర్ణయింపంబడిన క్రియాశక్తుల నిష్పక్షపాతబుద్ధితో నంగీకరించునట్టియు నిష్క్రియారూపమై తనయునికిచేతనే క్రియాశక్తుల దివ్యగమ్యస్థానమొందుటకు బలవంతపెట్టుచు, నిప్పటికి నెరుగఁబడని యేకత్వముకొఱ కాకర్షించునట్టియు నిర్గుణుఁడగు నీశ్వరునిగాఁ దెలిసికొనుచున్నాము. (౩) సర్వవ్యాపకుఁడైన నీశ్వరుఁడు—ఎవఁ డనంతగుణములు బ్రహ్మాండ క్రియేచ్ఛలు, సర్వవ్యాపక జ్ఞానానందము లగుచున్నాఁడో, మొదటిమూలమున సమస్తయుత్పన్నములతో సారాంశమందేగాక క్రియావిలాసమందు సహిత మేకమగుచున్నామో, సమస్తమందు

మనలను మనలో సమస్తమును జూచుచున్నామో, సమస్తయోచన సమస్తానురాగ మొక హృదయమునకు, నొకమనస్సునకు సంబంధించినవని తెలిసికొనుచున్నామో, సమస్తశక్తిక్రియలు శక్తియుక్తమైన యిచ్ఛకు సంబంధించినవని తెలిసికొనుచున్నామో, బ్రహ్మాండ విషయముకొఱకుఁ బనిచేయుచున్న మను నహంకారము విడుచుచున్నామో, బ్రహ్మాండస్థితిమితముకొఱకు నహంకారబీజమును విడుచుచున్నామో, యట్టివాఁడని తెలిసికొనుచున్నాము. (4) మనతో స్వయముగా సంబంధమంగీకరించిన యీశ్వరుఁడు మనయుత్తమాత్మ యగుటేగాక, మనప్రభువు, స్నేహితుఁడు, ప్రియుఁడు, గురువు, తల్లితండ్రి, యీగొప్పప్రపంచిక విలాసమందుఁ జెలికాఁడను వేరు వేరురూపములఁ బొందఁగోరుచున్నాము. శత్రుమిత్రులుగా, హితాహితులుగా సమస్తసంబంధములందు సమస్తకార్యములందు వేషములవేయమనుచున్నాము. అతనివలనఁ గర్మలయందు కర్తృత్వాకర్తృత్వముల వర్జించుటవల్లనేగాక దివ్యప్రేమావేశముచేతను దివ్యానందాధిక్యతచేతను, మనము చూడఁగలము.

మనకుఁ బూర్తిగాఁ దెలిసిన యీజ్ఞానకర్మలు మాత్రమేగాక, దానియందుఁ దెలియఁబడని భగవంతునియానందరహస్యము మునుకుతోఁ జుట్టఁబడియున్నది.





# యోగసంకలనము.



## పన్నెండవ అధ్యాయము.



## కర్మ.



కర్మయోగికి మఱియొకవిషయముకలదు. సర్వసమత్వము స్వభావమందు స్థిరపడగా; పరిపూర్ణసమర్పణము భావహృదయములందేగాక సర్వవిషయములందుఁ జేయఁబడగా; త్రిగుణములు పూర్తిగా సమరసమైన శుద్ధిప్రకాశములనొందగా; జీవుఁడు కర్మాధిపతినిగాంచి సామీప్యసారూప్యసాయుజ్యముల నొందగా; కర్మిష్ఠి యికనేకర్మచేయవలెను? ఏభావముతో? ఎందునిమిత్తము? ఏయుద్దేశ్యముతో!

హిందూదేశమందు వాడుకలో దీనికి ప్రత్యుత్తరము కలదు. కర్మలేదనుటే యాప్రత్యుత్తరము. పరమాత్ముని సాక్షాత్కారము జీవునకుఁ గలిగినప్పుడు, మన మతనితో నైక్యమైనప్పుడు ప్రపంచములో మనముండుట ప్రయోజన శూన్యమనియు, భిన్నత్వదోషవిముక్తి, యజ్ఞానదోషవిముక్తి, కర్మదోషవిముక్తి మనుజుఁడు కాంచెనని చెప్పుదురు. అప్పుడు కర్మచేయుట యనగా నుత్తమస్థితినుండిపడుట, యజ్ఞానమందుఁ దిరిగి ప్రవేశించుట యందురు. ఈభావము సరియైనదనుకొన్నను బ్రాణమున్నంతవరకు కర్మతప్పదు.

యోచించుట సహితము యోచనలేకున్నను జీవించుటమాత్రమే కర్మయగును. అది యనేకకార్యములకుఁ గారణము. అణువు మొదలు నిర్వాణ మొందుటకు సిద్ధముగానున్న నచలుఁడైన బుద్ధునిపర్యంతము ప్రపంచమందలి యునికి కర్మయే. కాని కర్తచేయు విధములు పయోగించుసాధనములు కర్తయొక్క వ్యక్తిభావములు యోచించవలసిన విషయములు. నిజమునకే మనుజుఁడు కర్మచేయఁడు. వాని మూలకమున స్వభావము పనిచేయుచున్నది. దాని నెరిగి కామశూన్యుఁడై, స్వకీయప్రేమయొక్క భ్రమలేక స్వభావముయొక్క ప్రభుసాక్షాత్కారమందు నివసించి యుండుటే కర్మబంధవిముక్తిగాని శరీరముచే కర్మచేయకుండుట కాదు. మనుష్యుఁడు సదా చలనరహితుఁడై కదలకఁ గూర్చొనఁగలిగినను మృగకీటకములవలె నజ్ఞానముచే బంధింపఁబడి యుండును. మనవృద్ధికొఱకు, సంసిద్ధికొఱకుఁ, బ్రపంచమం దీశ్వరోద్దేశ్య సంసిద్ధికొఱకు సాధనముగా నివ్వఁబడిన దివ్యమైన భాహ్యకర్మను చేయనివ్వక స్వభావము వానియందు నిరోధింపఁబడుచున్నది.

యోగ మీస్థితికి వచ్చినప్పు డొకయద్భుతముం దికఁ గర్మలు మనుజునకు లేకపోవచ్చును. దీనియర్థ మాంతర్యముం దితనికిఁ గర్మతోఁ బనిలేదనుట. బహిరంగమునకుఁ గర్మలఁ ద్యజించి పారిపోయి యానందరూపమగు నిష్క్రియత్వమందు దాగునని యర్థముకాదు. బంధించు నావశ్యకత విడిచి, బలాత్కరించు నజ్ఞానమువదలి యీశ్వరుఁడు పనిచేయుచున్నట్లతఁడు పనిచేయుచున్నాఁడు. కర్మలఁజేయుచున్నప్పటికి వాఁడు కర్మలఁ జేయుటలేదు. ఏలనన, వానికి స్వవిషయిక ప్రేరేపణలేదు. వాని స్వభావముద్వారా పనిచేయుచున్నవాఁడీశ్వరుఁడు. అట్టి మనుజునకు స్వాధీనమైయున్న యుత్తమశక్తియొక్కనిస్పృహత్వముచేత నేడాగులేకుండ కర్మవృద్ధియగుచున్నది. వాఁడు తనలోఁ గర్మను భరించి యంగీకరించికనిపెట్టి, జ్ఞానముతోఁ బరిశోధించునుగాని, కర్మకంటడు ఫలాపేక్షచే బంధింపఁబడఁడు.

కామములేకున్నఁ గర్మసాధ్యముకాదని కామమునశించిన కర్మనశించునది యనుకొనుట సర్వసాధారణమైన పొరపాటు. ఇది సత్యముకాదు. ప్రపంచములో జరుగుచున్న కర్మయం దధిక భాగము కోరికతో సంబంధములేకనే మిక్కిలి యవసరముచేతను, స్వభావముయొక్క నిష్ప్రహాధర్మముచేతను నడుపఁబడుచున్నది. మనుష్యుఁడు సహితము వివిధములగు కర్మలను నిష్కామనిష్ప్రహాలతో నట్టి ధర్మావసరములకులోఁబడి కామరాగ మనోవ్యాపారచిహ్నము లేకనే సదా చేయుచున్నాఁడు. తరుచు తనకోరికకు విరుద్ధముగా శ్రేష్ఠతరమగు ధర్మమునకు లోఁబడి పనిచేయుచున్నాఁడు. కామము తోడివ్వఁబడిన యాకర్షణము. మధ్యమధ్య కొన్ని కార్యములకు ప్రయోగపడు స్వభావముచే దీనికిఁ బ్రాముఖ్యత కల్పింపఁబడినది. కర్మయోగి యిట్టి మధ్యసోపాన మతిక్రమించుచున్నాఁడు. వాని యేకర్మకుఁ గామము ప్రేరేపింపనక్కరలేదు. స్వాపేక్షతో నితరు లేదిచేయుచున్నాఁరో దానినే వాఁడు నిరాపేక్షతోఁ జేయుచున్నాఁడు. కాబట్టి శాంతమైన తటస్థభావము సంతోషయుక్తమైన నిష్పక్షపాతము వానికుండును. నిశ్చయముగ నకిది సిద్ధిగాంచిన కర్మయోగి లక్షణము. బంధకాముములేక గర్మచేయుటకుఁ బూర్ణసామర్థ్యమే.

దీనిని బట్టి యుత్తమస్థితియున్న వాని కీకర్మచేయవలయునని, చేయకూడదని, కర్మచేయవలెనని చేయకూడదని విచక్షణలేదు. వాఁడున్యాయముగా నెన్నుకొనఁడు. ఈశ్వరుఁ డేదివానిస్వభావమునుబట్టి నిర్ణయించునో దాని నొనర్చును. గనుక మనుజుఁడు తానేకులము శాఖ దేశము మతమందు బుట్టెనో యాయావరణయందే యుండి పని చేయవలెను కాని వానిని విడిచి ప్రాపంచక ఘనకార్యములకుఁ బ్రయత్నించరాదని దీనివలన కొంద అభిప్రాయపడుచున్నారు. ఎందుకన వాఁడు చేయుటకు కర్మలేదు. వాఁడు కర్మల నుపయోగించవలెను. ముక్తినొందుటకే కర్మలైననునరే. ముక్తిరాగనే యవసరమునుబట్టి తనకు నియమించిన హద్దులో ననంతునందు లీనమైపోవుటకు నెదురుచూచుచూ శరీరమున్నంతవరకుఁ బనిచేయుచుండవలెను.

ఈభావమునుబట్టి యొక ప్రత్యేకకార్యమును వహించి, ప్రాపంచిక ఘనకార్యమునకై పనిచేయుటకర్మల భ్రమలందుఁ బడుటయందురు. ఈప్రపంచ జీవితమున కుద్దేశ్యము కలదనియు, నందు శ్రమపడి సాధించుట కర్హమైన విషయములు కలవనియు చెప్పుట పొరపాటందురు.మనము తిరిగి మిధ్యావాదమును సమీపించితిమి. ప్రపంచమందు దేవుఁడు లేఁడను వాదములోనికి దిగితిమి. కర్మయోగి కట్టి యల్ప విధినిరూపించరాదు. అట్టిస్వల్ప కర్మ నిర్ణయించరాదు. ఎట్టికర్మలు గాని, ఘనమైనను హీనమైనను, గొప్పవైనను, కొద్దివైనను, ముక్తిదాయకమైన నాత్మశిక్షకు వినియోగపడుచున్నవనుట పూర్తిగానిశ్చయము. ముక్తిఁజెందినతరువాత మనుజుఁ డేస్థితియందైననుండవచ్చును. ఏకర్మనైనఁ జేయవచ్చును. ఆస్థితియందే యీశ్వరసంసిద్ధిగాంచవచ్చుననుటకూడ నిశ్చయమే. అట్టివాఁ డేస్థితియందు జన్మించునో యాయావరణ మందే నివసించిన నివసింపవచ్చును. వాఁడాయావరణమును భేదించి పొందిన క్రొత్తజ్ఞాము ననుసరించి కర్మస్వీకరించిన స్వీకరించవచ్చును. అంతర్ముక్తి బహిఃకర్మయందుఁ గాన్పించకపోవచ్చును. కాని యంతరస్వాతంత్ర్యానందములు విపులమైన స్వేచ్ఛగలకార్యరూపమున బహిర్గతముకావచ్చును. ముక్తిజెందిన జీవుఁడే యీశ్వరేచ్ఛయైన యెడల వెనుకటి యావరణమందే తృప్తిజెంది, దానిని మార్చకపోవచ్చును. లేదా తనయావరణమును మార్చుటే గాక చుట్టుప్రక్కలనుండే యితరములకు సహితము మార్పుతెచ్చునట్టి కర్మలఁ జేయవచ్చును.

మనుష్యజాతికి మహోపకార మొనర్చుటే కర్మయోగి పొందుముక్తివికాసము. ముక్తియొక్క యుద్దేశ్యము వ్యష్టిజీవునకు జన్మరాహిత్యమనియు, ముక్తివచ్చినతరువాత, జీవించుట కవసరమైనట్టి ప్రారబ్ధవినాశమున కవసరమైనట్టి కర్మలుఁగాక మఱియేకర్మతోఁ బనిలేదను భావమొకటి గట్టిగానాటుకొనియున్నది. ఉన్నది కొంచము త్వరలోనశించి దేహము విడువగానే పూర్తిగా నశించునందురు. ఇతరమతములవారికేగాక, వేదమున కంతరార్థము చెప్పలేనికాలము

సహిందూ మతమునకు సహితము, స్వర్గోపభోగ మనుభావము దృఢ
ముగానున్నట్లు జన్మరాహిత్యమే జీవునకు ముఖ్యమను భావము చిర
కాలము నుండి హిందువుల హృదయమందు నాటుకొనియున్నది.
జన్మనుండి తప్పించుకొనవలెనను భావ మెంతచులకనైనదో చెప్పవల
సియున్నది. మరణించినతరువాత స్వర్గోపభోగాపేక్షకంటె జన్మరా
హిత్యాపేక్షయందు నిశ్చయముగా నాధిక్యతకలదు. ఎట్లైన నది
యపేక్షయనఁబడుచున్నది. కర్మయోగి కది యర్హమైన యుత్తమ
యపేక్ష కానేరదు. తన వ్యష్టి ముక్తియం దపేక్ష యెంతమంచిదైన
నహంకారమే యగుచున్నది. వ్యష్టిభావమందే నిలుచుచున్నది. జీవిం
చుటకు ఫలము వ్యష్టికోరికలఁ దృప్తిచేయుటనఁబడుచున్నది. పూర్తి
గా నహంకారమును విడువవలె నన్న వ్యక్తిముక్త్యాపేక్షను విడువ
వలెను. ముక్తియం దపేక్ష ప్రయత్నము మన కుత్తమధర్మము
గనుక నంగీకరింపఁబడినది. మనయం దధమస్థితికి యుత్తమస్థితికో
ఉండఁగల యాకర్షణ మిది. ఇతర సర్వాపేక్షలు వానిఫలముల నంద
గానే జీవుఁడు త్యజించవలసియున్నది.

శ్రేష్ఠమైన మనస్స్వభావధర్మమునకుఁ జెందినట్టి, ముక్తుఁడైన
జీవుఁడు చేయవలసినకర్మ స్వభావమును సూచించునట్టి, మఱియొక
యాకర్షణచే యీవ్యష్టి ముక్త్యాపేక్ష నిరాకరింపఁబడుచున్నది. అది
బుద్ధుని గొప్పకథయం దిమిడియున్నది. బుద్ధుఁడు నిర్వాణముయొక్క
గుమ్మమందుండి యజ్ఞానదుఃఖ మం దొక్కఁడైన నున్నంతవరకు నీ
గుమ్మము దాటనని ప్రతిజ్ఞ జేసెను. "అష్టసిద్ధులుగల యుత్తమ
స్థితిగాని, జన్మరాహిత్యముగాని నేను గోరను. సమస్తజీవులదుఃఖము
నేనొందెదను గాక, సమస్తజీవులు దుఃఖవిముక్తులగుటకు వారియందు
నేఁ బ్రవేశింతునుగాక" యను నీభగవద్వాక్యమం దిమిడియున్నది.
స్వామీవివేకానందుని యుత్తరమందుఁ గలయొక వాక్యమున కర్థ
మిది. "నాముక్తియం దపేక్షనాకులేదు. సమస్తజీవసంఘము. ఉన్నది
యీదేవుఁడే. నే నమ్మినది యీదేవుఁడే. అట్టి వానిసేవించుటకుఁ
దిరిగి తిరిగి నేజన్మల నొందుదునుగాక. బహుదుఃఖముల నొందుదుఁ

గాక. నేను ముఖ్యముగాఁ బూజించునది దుర్మార్గమందున్న నా వుఁడు. దుఃఖమందున్న నాదేవుఁడు. బీదరికమందున్న నాదేవుఁడు. ఉత్తమాధమను లెవఁడో, పుణ్యాపాపము లెవఁడో, క్రిమి దేవత లెవఁడో, గోచరించుఁ దెలియఁబడు నిజమైన సర్వవ్యాపకుని బూజించుము. తక్కినవిగ్రహములఁ బగులఁ గొట్టుము. ఎవనికి భూతభవిష్యజ్జన్మలులేవో, చావుపుట్టుకలు లేవో, యెవనియందు మనము సదా యేకమై యుంటిమో, యుండఁగలమో, వానిని బూజించుము. తక్కిన విగ్రహములఁ బగులఁ గొట్టుము.''

యావత్తు సారాంశ మీచివర రెండువాక్యము లందున్నది. కుటుంబసంఘముల విడిచిపెట్టుట యెట్లు నిజమైన సన్న్యాసము కాదో యట్లే యీప్రపంచజీవితమును నిరాకరించుట జన్మపరంపరలనుండి నిజముగాఁ దప్పించుకొనుటకాదు. ఎవనియందు భూతభవిష్యజ్జన్మలు లేక, జన్మరాహిత్యమైన జీవశ్వ మనంతముగ నున్నదో యటి యీశ్వరునితో యాంతర్యమున నేకీభావ మొందుటే జన్మరాహిత్యము. అంతర్ముఖమున నెవఁడు స్వేచ్ఛతకలవాఁడో, వాఁడు కర్మలుచేయుచున్నను గర్మచేయనివాఁడే యని గీతచెప్పుచున్నది. శరీరము లనేక పర్యాయములు ధరించినను, శరీరధర్మముండుగాక, చావుపుట్టుకలేని యాత్మధర్మమందు నివసించుటచే వానికిబంధములేదు. పునర్జన్మతప్పించుకొనుట యను విగ్రహమును బూర్ణయోగ సాధకుఁడు పగులఁ గొట్టవలెను. వానియోగము వ్యష్టిజీవునిచేఁ బ్రపంచాతీతుని గ్రహించుటేగాక సమస్తజీవసంఘమనెడి సర్వవ్యాపకత్వమును గ్రహించుట యందిమిడియున్నది. కాబట్టి తానొక్కఁడే తప్పించుకొని ముక్తినొందుటకాదు. దేవునియందు సమస్తముతోఁ దానేకీభవించవలెను. వానికిఁ జేయుటకు దివ్యకర్మకలదు.

ఆకర్మ యిట్టి దని యొకబాహ్యసూత్రముచేతగాని తరగతిచేతగాని నిర్ణయించవీలులేదు. ''వా డెట్లుజీవించినను, నెట్లుఁజేసినను నాయందు నివసించి పనిచేయుచున్నాఁడని'' గీతచెప్పుచున్నది. మానుష మేధాశక్తిచే నిర్ణయింపఁబడిన సూత్రములు ముక్తుఁడైన జీవు

నకు సంబంధించినవికావు. బాహ్యవిషయములబట్టి వాని విమర్శించ రాదు. అట్టివాఁడు కాషాయవస్త్రమునుధరించి సన్యాసియైనఁ బూ ర్తిగా గృహస్థుఁడైన నొక్కటే. పవిత్రములైనఁ గార్యములఁజేసిన వివిధప్రపంచకార్యముల నొనర్చిన నొక్కటే. బుద్ధుఁడు, క్రైస్తువు, శంకరులవలె జనులకు జ్ఞానబోధఁజేసిన, జనకునివలె రాజ్యపరిపాలనఁ జేసిన,ఁ గృష్ణునివలె రాజకీయుఁడై సైన్యముల నడిపిన నొక్కటే. వాఁ డేమిదిన్నఁ దాగిన, వానియలవాట్లు ప్రయత్నము లెట్టివైన వాఁడుజయించినఁ బరాజితుఁడైన, వాఁడు బాగుచేసిన నోగుచేసినఁ, బ్రాచీనపద్ధతుల నిల్పిన, వానికినూరుగా నూతనపద్ధతులనిర్మించిన, జనులచేగౌరవింపఁబడువా రతనికి హితులైన వెలివేయఁబడిన దుర్మా ర్గులు హితులైన,వాని జీవితమును కర్మల జనులంగీకరించిన, జనులకు దప్పుమార్గముచూపెట్టు మతనీతి సాంఘిక కథల నిర్మించువాఁడ నిరాకరించిన, నతని కొక్కటే. మానుషతీర్మానముల కతఁడందఁడు. అజ్ఞానులు నిర్ణయించిన చట్టములకు బద్ధుఁడుకాఁడు. అంతరశబ్దము నకు లోఁబడి యదృశ్యమౌ యుండు శక్తిచేఁ బ్రేరేపింపఁబడుచున్నాఁ డు. అతనినిజమైన జీవితమంతరున్ముఖమందున్నది. దాని వర్ణించు టె ట్లన, వాఁడు దివ్యానంతమైన దేవునందు నివసించును, చలించును, బనిచేయును.

అతనికర్మ బాహ్యసూత్రబద్ధము కాకపోయినను వెలిసంబం ధములేని యొకసూత్రమును మట్టు కాదరించుచున్నది. దానికి స్వా పేక్షలేదు. అది ప్రపంచ మందీశ్వరకార్యమునకుఁ జేయఁబడుచున్న ది. కోరికచేఁ బ్రేరేపింపఁబడక, ప్రపంచోద్ధరణము పరిపాలనము నడిపించుట కొఱకుఁ గర్మయోగి కర్మచేయవలెనని గీతచెప్పుచున్నది. సాధారణజనముందు ప్రపంచము మిథ్య గనుక, ముక్తికివా రర్హులు కారు గనుక సంఘచట్టము ననుసరించి యాచరణపద్ధతులకంటె యు న్నట్లతఁడు పైకి నటించవలెనని యీగీతావాక్యమున కర్థము చెప్పు చున్నారు. అదే నిజమైనయడల నది పనికిరాని సూత్రమే. గొప్ప హృదయము దాని నిరాకరించి, యమితాభ బుద్ధుని దివ్యప్రమా

ణము, భాగవతుని విమలధ్యానము, వివేకానందుని యుత్సాహభరితధ్యాన మంగీకరించును. మనుష్యునందు దేవుఁడగుచున్న స్వభావముయొక్క దైవనియామకవ్యాపారమే యీప్రపంచమనియుఁ బొందవలసిన దేదియుఁ దనకు లేకున్నను, భగవద్గీతయం దీశ్వరుఁడు తాను చేయుచున్నా నని చెప్పిన కర్మ యిదేయనియు మనమంగీకరించిన నీగొప్పసూత్రమునకు గాఢాభిప్రాయము కాన్పించును. అట్టి దివ్యకర్మయందుఁ బాలుకొనుట, మనుష్యజాతియందు దేవుని నిమిత్యార్థము నివసించుట కర్మయోగికి ధర్మములు. మనుష్యులందు దేవుని నిమిత్తము నివసించు టనగా లక్ష్యార్థమైన గమ్యస్థానము నొందుటకుఁ బ్రపంచమున కేదోయొక విధమైన సహాయ్య మొనర్చుటే.

మనుజుఁ డెట్లుచేయునో యేమార్గమునఁ జేయునో నిర్ణయించుటకు సర్వసాధారణ సూత్రములేదు. అది లోపలినుండు రావలెను. దేవునకును సాధనమైన జీవునకును వారిలో వారికి తీర్మానము కావలెను. చేయవలసినకర్మ యిట్టిదని లోనఁ దోచవలెను. చేయవలసిన కర్మ యిట్టిదని చెప్పునట్టి గీతావాక్యమైన "ధర్మము ఫలాపేక్షలేక చేయవలె"నను దాని కింగ్లీషున (We must due our duty without regard to the fruit) యని యర్థముచేసినారు. ఇది యైరోపాఖండవృద్ధి ననుసరించి వచ్చినభావము. ఇది విజ్ఞాన సంబంధము (Spiritual)గాక నీతి (Ethical) సంబంధమైనది. పూర్ణమైనదిగాక బహిరంగమైనది. విధి (duty) యనునది లేనేలేదు. మన విధులు (duties) పరస్పర విరుద్ధములుగా నున్నవి. మన యావరణమునుబట్టి, సంఘసంబంధములనుబట్టి, బాహ్యజీవస్థితినిబట్టి యావిధులు నిర్ణయింపఁ బడుచున్నవి. పరిపక్వముకాని నీతిని వృద్ధిచేయుటకు, నాత్మపరత్వముగల కోరికల వ్యాపారమణచుటకు నావిధులు సహాయపడుచున్నవి. సాధకున కంతర్ప్రకాశము కలుగువరకు, తనకుఁ గల ప్రకాశముచేతనే పాలింపఁబడుట మంచిదనియు, విధులు నీమములు తత్కాలికముగా నుంచుకొనవలెననియు నిదివరకే

చెప్పఁబడిరి. విధులు బాహ్యావిషయములే. జీవవిషయములు కావు. ఈమార్గమునకు స్థాపింపఁబడిన ధర్మములు కావు. యోధునకుఁ బిలిచినప్పుడు యుద్ధముచేయుట విధి. తనబంధువులనైనఁ దుపాకినివేయుటకూడ యతినికి విధియే. కాని యట్టివిధి ముక్తుఁడైనవానికి విధించుట తప్పు. మనతోటిపాటి జనుల ప్రేమించి సహాయమొనర్చుట మనకు విధియనఁబడదు. అదియొక స్వభావధర్మము. ఈశ్వర స్థితికలిగిన కొలది యేర్పడును. అది జీవస్థితినుండి వచ్చు కార్యప్రవాహము. కర్మయోగియొక్క కర్మజీవుని నుండివచ్చు ప్రవాహరూపమై యుండవలెను.

మన కర్మధర్మమే దనగా స్వభావముచే నిర్ణయింపఁబడి పాలింపఁబడు కర్మయను గీతా నిర్ణయమునకు గాఢభావమిది. అది మైమనోవృత్తి యలవాటువలనఁ గలిగెడి యుద్రేకములుకాదు. మన "స్వరూపము-నిజస్వభావము-దివ్యజీవపదార్థ"మను సంస్కృత శబ్దమం దిమిడియున్నది. అదే మన నిజస్వభావము; దేవుని దివ్య తత్వము. ఈమూలమునుండేది యుత్పన్నమగుచున్నదో యదే పూర్ణమైనది, యగాధమైనది, సత్యమైనది, సరియైనది. తక్కినవి యుద్రేకములు, ఆశలు. అలవాట్లు కోరికలు పురుషునిపై పై వెరుప్రలనఁబడును. అవి వెలినుండి వచ్చెడి బలాత్కారములే. అవి తొలగించఁబడుచున్నవి. మార్పఁబడుచున్నవి. కాని యిది స్థిరముగా నిలుచుచున్నది.

ఎంతకాలము మనోబుద్ధు లహంకారవర్జితములుకావో యంతవరకు మనమీయంతరధర్మము నెరుగఁజాలము. పవిత్రమొందిన కొలది యాధర్మముస్పష్టముగా వెల్లడియైవెలి ప్రేరేపణలకు బహిరంగమనోనిర్మాణములకు లోనుకాదు. అహంకారము విడువఁబడెనా కర్మలోనుండి యుత్పన్నమగును. మనహృదయములందు నివసించియున్న యీశ్వరునిచే బహిరంగముగాఁ బరిపాలింపఁబడును. యోగికిగీత చెప్పెడి యుత్తమవాక్యము "సమస్తధర్మముల విడిచి తన్ను శరణుజొచ్చుమ"నుచున్నది. కామములేక, దానికంటక, సర్వభూత

ములతో నేకత్వమొంది, యనంతనిత్యపవిత్రమందు నివసించి, దివ్యోక్షే త్రమాత్మచేఁ బాలింపఁబడుచు, వాని సమస్తకార్యము లంతఃశక్తిచే, మన నిజస్వభావద్వారమున నడిపింపఁ బడుచున్నది. ఆశక్తి తెలిసికొనుచున్న, యుద్ధము చేయుచున్న, బనిచేయుచున్న, బ్రేమించుచున్న సదా దివ్యమై ప్రపంచమం దీశ్వరుని సిద్ధికై పాటుబడుచున్నది.

ముక్తికై మనము పాటుపడుటకు నిజమైన గారణము తానొక్కఁడే ప్రపంచదుఃఖమునుండి విముక్తినొందుటకాదు. పరిపూర్ణత్వమొందుటకు నిజమైన కారణ మనగా (దివ్యస్థితి, పవిత్రత, జ్ఞానము, బలము, ప్రేమ, సామర్థ్యము నొందుటకుఁ గారణము) దేవతలవలె నుండుట, తానొక్కఁడే దివ్యస్వభావము గ్రహించుట కాదు. ఈముక్తి పరిపూర్ణత్వములు పూర్తిగా నావిర్భవించిన దేవుఁడే గనుక వ్యష్టిమనుజునందుత్పన్నమగుట ప్రపంచమందంతట నావిర్భవించుకొఱకు సహాయపడుటకే. అజ్ఞానమందు సహితము వ్యష్టిమనుజుఁడు ప్రపంచములో ప్రపంచముకొఱకు నివసించుచున్నాఁడు. అతఁడు తన యహంకారకర్మల బ్రపంచోద్ధరణకొఱకు వినియోగించునటుల స్వభావముచే బలాత్కరింపఁబడుచున్నాఁడు. కాని యది యసంపూర్తికార్యము. అది సంపూర్తికాని యసంస్కారసృష్టికార్యకలణము. ముక్తుఁడై పవిత్రుఁడై, పరిపూర్ణుండై వ్యష్టిదేవుఁడు ప్రథమమునుండి సంకల్పించినట్లే ప్రపంచేశ్వరునికొఱకుఁ బూర్తిగా వ్యక్తితోఁ బ్రపంచమందు నివసించుచున్నాఁడు.

కర్మ సంపూర్ణము.



కర్మయోగము సమాప్తము.

